## ❀ శ్రీ పరాశరసంహితా ❀

# శ్రీ ఆంజనేయచరిత్ర

1 నుండి 15 పటలములు

స మ ర్ప ణ :

'సాహిత్య విద్యాప్రవీణ'

'వైద్యవిద్వాన్', 'భాషాప్రవీణ', 'హిందీ విశారద'

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి,

M. A & M. A., P. O. L.

ప్ర చు ర ణ :

శ్రీ హనుమత్సేవా సమితి

సత్యనారాయణపురం, విజయవాడ-520011

శ్రీ రౌద్రి-ఆశ్వయుజము
ద్వితీయ ముద్రణ 1980, అక్టోబర్



రూ. 6

శ్రీ రామరక్ష - సర్వజగద్రక్ష
ఆంజనేయరక్ష - అఖిలజగద్రక్ష

ముద్రణ :
ఎస్వీ ప్రింటర్సు
విజయవాడ - 520002



ఈ రూపు, నీయఁగని నా
కీ రీతిగ హనుమ నెంచు నింగిత మిడు సీ
తా రామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరులఁ గొలుతున్॥

—అన్నదానం చిదంబరశాస్త్రి

## మా మాట :

చదువరులకు నమస్కృతులు. ఈ మాటచదివి ఊరుకోక గ్రంథ మంతాచదవాలనిమాకోర్కె, అంతేకాదు. మా ప్రచురణలన్నీ ఒకమారు పరి శీలించమని మావిజ్ఞప్తి మీఆదరం వల్లనే శ్రీ ఆంజనేయచరిత్ర ద్వితీయ ముద్రణకురాగల్గినది. మా కృషిని అభినందించమని కోరం ఆశీర్వదించమనే మా ప్రార్థన.

ఈ పుస్తకంమీ చేతిలోకి వచ్చిందంటే దాని వెనుకఉన్న కష్టమెంతో ఒక్కమారాలోచించండి. ఇది వేలసంవత్సరాలుగా వ్రాతప్రతులలో మగ్గు చున్న ఉద్గ్రంథం. ఇంతటి గ్రంథాన్నిముద్రించివెలుగులోకి తీసుకు రావాలని ఇన్నేండ్లుగా ఎవ్వరు చేయని సాహసానికి మేముపూనుకొన్నాము. అనేక ప్రాంతములు పర్యటించి వ్రాతప్రతులను సేకరించి, సంస్కృతమూలము సామాన్యజనులకు ఉపయోగపడే విధంగా చక్కని భావాన్ని శ్రీఅన్నదానం చిదంబరశాస్త్రిగారు అందిస్తున్నారు. కార్యకర్తలమైన మేము ప్రతివ్యక్తిని కలిసి ప్రతిపైస కూడబెట్టి కొద్ది కొద్దిభాగాలుగా ప్రచురిస్తున్నాము. స్వామి చరిత్ర ఇప్పటికి 60 పటలములుముద్రించగలిగామంటే, అది శ్రీహనుమ ద్భక్తుల ప్రోత్సాహమే.

ఈ భాగము వెలువడుటకు సహకరించిన శ్రీ కె.ఎస్.శర్మ M.A., M.Sc., I.A.S, జిల్లాకలెక్టరు, కరీంనగర్ గారికి, శ్రీటి. మల్లిఖార్జునరావు, సూపరింటెండెంట్ 'కమీషనర్ ఆఫ్ ల్యాండురివెన్యూ' హైదరాబాదు గారికి 'తదితర భక్తులకు కృతజ్ఞతలు తెలుపుతూ' శ్రీఆంజనేయస్వామివారు సదరు దాతలకు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక అని ప్రార్థించు చున్నాము.

—ప్రకాశకులు



శ్లో॥ గురురేవ పరందైవం గురురేవ పరంతపః
గురురేవ పరంధ్యానం న గురోరధికం భువిః॥

తా॥ గురువే పర దైవతము, గురువే శత్రునాశకుడు, గురువే తత్వధ్యానము, లోకమునందు గురునకు మించినదిలేదు

—ఎస్. ఎస్. లక్ష్మణరావు

# ఇందులో



—o—

ఓం

శ్రీ హనుమతే నమః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## (శ్రీ పరాశర సంహితా)

### ప్రథమ పటలం

### మంత్రోపదేశ లక్షణం

శ్లో॥ శ్రీజానకీపతిం రామం భ్రాతృభి ర్లక్ష్మణాదిభిః
సహితం పరమం వందే రత్నసింహాసనే స్థితమ్ ॥

తా॥ లక్ష్మణుఁడు మొదలగు సోదరులతోఁ గూడినవాఁడై ర సింహాసనమునందున్న పరాత్పరుఁడు, జానకీ పతియగు రామునకు నమస రించుచున్నాను.

శ్లో॥ ఏకదా సుఖ మాసీనం పరాశర మహామునిమ్
మైత్రేయః పరిపప్రచ్ఛ తపోనిధి మకల్మషమ్ ॥

తా॥ ఒకప్పుడు తపోనిధియు పాపరహితుఁడు సుఖాసీనుఁడునైన శరుని మైత్రేయుఁడిట్లడిగెను.

శ్లో॥ భగవ న్యోగినాం శ్రేష్ఠ ! పరాశరమహామతే
కించి ద్విజ్ఞాతుకామోఽస్మిత న్మమానుగ్రహం కురు ॥

తా॥ పూజ్యుఁడా ! యోగులలో శ్రేష్ఠుఁడా ! పరాశర మహాముని ! కొంత విషయము నెఱుఁగ గోరుచున్నాను. నన్ననుగ్రహింపుము.

శ్లో॥ ప్రాప్తం కలియుగం ఘోరం మోహమాయా సమాకులమ్
అధర్మానృత సంయుక్తం దారిద్ర్యవ్యాధి పీడితమ్ ॥

తా॥ భయంకరమగునట్టియు, మోహమాయతో కూడినట్టియు, అధర్మము, అసత్యములతోఁ గూడినట్టియు దారిద్ర్య వ్యాధ్యాదులఁ బీడింపబడు కలియుగము సంప్రాప్తించినది.

శ్లో॥ తస్మి న్కలియుగే ఘోరే కింసేవ్యం శివమిచ్ఛతామ్
పూర్వకర్మ విపాకేన యే నరాః దుఃఖభాగినః ॥

తా॥ ఘోరమగు నా కలియుగమునందు పూర్వ కర్మఫలముగా దుఃఖభాగులగువారికి మంగళాకాంక్షతో సేవింపదగిన దేమిటి.

శ్లో॥ తేషాం దుఃఖాభిభూతానాం కిం కర్తవ్యం కృపాళుభిః
దస్యుప్రాయా స్సదా భూపా-స్సాధవో విప దన్వితాః ॥

తా॥ అట్టిదుఃఖము లనుభవించువారియెడ దయాళురగువారి కర్తవ్య మేమి ? రాజులెప్పుడూ దొంగలవంటివా రగుచున్నారు. సజ్జనులగువారు కష్టముతో కూడిన వారై యున్నారు.

శ్లో॥ పీడితాః కలిదారిద్ర్యా ద్వ్యాధిభి శ్చాపరే జనాః
కిం పథ్యం కిం ప్రజప్తవ్యం సద్యో విజయకారకమ్ ॥

తా॥ కలి దారిద్ర్యముచే పీడింపబడువారు కొందరు, వ్యాధులచే పీడింపబడు జనులు కొందఱున్నా. అట్టివారికి వెంటనే విజయమునందుటకు మార్గమేమి ? ఏ మంత్రము జపింపఁదగినది ?

శ్లో॥ సంసారతారకం కిం వా-భోగ స్వర్గాపవర్గదమ్
కస్మా దుత్తీర్య తే పారం సద్య ఆపత్సముద్రతః ॥

తా॥ సంసార తారకమైనదేమి ? భోగస్వర్గ మోక్షముల నొసగున దేమి ? వెంటనే ఆపదలను సముద్రమునకు దరి జేర్చునదేమి?

శ్లో॥ కి మన్త్ర బహునో క్తేన-సద్య స్సకల సిద్ధిదమ్
శిష్యం మాం కృపయా వీక్ష్య-వద సారం కృపానిధే ! ॥

తా॥ దయాపూర్ణుడా ! పెక్కుమాటలేల ? వెంటనే ఫలమిచ్చునదేది ? నమ శిష్యుడగు నన్ను దయతోమాచి తత్సారము ననుగ్రహింపుడు.

శ్లో॥ పతత్పృష్టం త్వయా విద్ధి—లోకానా ముపకారకమ్
ఘోరం కలియుగం సర్వ—మధర్మానృత సంకులమ్ ॥

తా॥ అనియడుగఁ బరాశరుడు – భయంకరమగు కలియుగము – పూర్తిగా అధర్మము, అసత్యములచే సంకులమైనది. మైత్రేయా ! నీ ద్వారా లోకమున కుపకారకమైన మంత్రమును తెల్పెదను. ఎఱుంగుము.

శ్లో॥ వేదశాస్త్ర పురాణౌఘ సారభూతార్థ సంగ్రహమ్
సద్య స్సిద్ధికరం వక్ష్యే—చ్ఛృణుష్వ సుమనా భవ ॥

తా॥ సమస్త వేదశాస్త్ర పురాణచయముయొక్క సారభూతమగు నర్థసంగ్రహమగు, వెంటనే ఫలితమునిచ్చుదానిని చెప్పెదను. మంచిమనసు కలవాఁడవై వినుము.

శ్లో॥ తీర్థయాత్రా ప్రసంగేన సరయూతీర మాగతమ్
మాం వీక్ష్యకృపయా సాక్షా—ద్వసిష్ఠోఽస్మ త్పితామహః ॥

తా॥ తీర్థయాత్రావసరముగా సరయూనదీ తీరమునకు వచ్చి నన్ను దయతోఁ జూచి సాక్షాత్తు నా పితామహుఁడగు వసిష్ఠుండు

శ్లో॥ ఉపాదిదేశ విద్యాం మే సద్యస్సిద్ధి విధాయినీమ్ ॥
తా॥ వెంటనే సిద్ధించి ఫలమిడు విద్యను నా కుపదేశించెను.

శ్లో॥ శైవ వైష్ణవ శాక్తార్క గాణాపత్యేందు సంభవాః
న శీఘ్రసిద్ధిదాః ప్రోక్తా శ్చిరకాల ఫలప్రదాః ॥

తా॥ శైవ, వైష్ణవ, శాక్తేయ, అర్క, గాణాపత్య, ఇందు సంభవము లగు మంత్రములు శీఘ్రము సిద్ధించునవిగా చెప్పబడలేదు. అవి చిరకాల ఫలప్రదము లగునవి.

శ్లో॥ లక్ష్మీ నారాయణీ విద్యా భవానీ శంకరాత్మికా
సీతారామ మహా విద్యా - పంచవక్త్ర హనూమతః ॥

తా॥ లక్ష్మీనారాయణీ విద్యయు, భవానీశంకర విద్యయు, సీతారామ మహా విద్యయు, పంచవక్త్ర హనుమంతుని విద్యయు నాల్గవదిగా చెప్పబడి నది.

శ్లో॥ విద్యా చతుర్ధా సంప్రోక్తా నృసింహానుష్టుభాభిదా
బ్రహ్మాస్త్ర విద్యా షష్ఠీస్యా దష్టార్ణా మారుతేః పరా ॥

తా॥ నృసింహవిద్య, బ్రహ్మాస్త్ర విద్య యారవది కాగా, అష్టార్ణ మారుతీవిద్య

శ్లో॥ సామ్రాజ్యలక్ష్మీ స్స్వహా మహాగణపతే రథ
మహాసౌరాభిదావిద్యా దక్షిణాకాళికా పరా
చింతామణి మహావిద్యా - ద్వాదశీ పరికీర్తితా ॥

తా॥ మరియొకటి సామ్రాజ్యలక్ష్మీ విద్య, మహా గణపతి విద్యయు, మహాసౌరనామకమగు విద్యయు, దక్షిణాకాళికాపరమగు విద్యయు, పన్నెండవదిగా చింతామణి మహావిద్యయు దెలుపబడినవి.

శ్లో॥ ఏతా ద్వాదశ విద్యాస్తుః - మంత్ర సామ్రాజ్య ఈరితాః
ఏతాస్వపి మహావిద్యాశ్శీఘ్రసిద్ధిప్రదా శ్శృణు॥

తా॥ ఇవియే మంత్రాదులచే జెప్పబడిన ద్వాదశ విద్యలు పండ్రెండు. ఈ మహావిద్యలలో వెంటనే సిద్ధించువానిఁజెప్పద వినుము

శ్లో॥ దక్షిణాకాళికావిద్యా-పురశ్చరణతః పరమ్
అనాచారే కై కరాత్రౌ సిద్ధిదా చిరసాధనాత్ ॥

తా॥ దక్షిణాకాళికావిద్య ఒక్కరాత్రిలో ఆచార నియమము లేకనే పునశ్చరణమువలన సిద్ధినిచ్చును.

శ్లో॥ అష్టాఖ్యా మారుతేః ప్రోక్తా–తతో ప్యచిరసిద్ధిదా
పంచాశ దక్షరా జ్ఞ్యాత్రానులోమ ప్రతిలోమతః ॥

తా॥ అష్టాక్షర మారుతి మంత్ర మంతకంటెను తక్కువ కాలము లోనే సిద్ధించునది. అనులోమ ప్రతి లోమముగా నిందు నేబది వర్ణములు.

శ్లో॥ విశిష్య మాలయా జప్త్వా–గురుం సంతోష్య యత్నతః
గృహీత్వా గురుసాన్నిధ్యా–ద్బగళా పరమేశ్వరీ ॥

తా॥ గురువునుండి గ్రహించి గురువును తృప్తి నొనర్చి అంగన్యాస కరన్యాసాదులంజేసి మాలచే బగళా దేవిని జపించిన సిద్ధించును.

శ్లో॥ ప్రజప్య సిద్ధిగా ప్రోక్తా–విద్యా బ్రహ్మాస్త్ర సంజ్ఞితా
అనుష్టుపాఖ్యాం న్నృహరే–స్తతో ప్యచిర సిద్ధిదా॥

తా॥ బ్రహ్మాస్త్రవిద్యయు బాగుగ జపించుటచే సిద్ధినిచ్చునదని చెప్ప బడినది నృసింహానుష్టుప్ విద్య అంతకంటెను తక్కువకాలమున సిద్ధించునది.

శ్లో॥ తతోపి పంచవక్త్రస్య మారుతే ర్జగదీశితుః
విద్యా సిద్ధికరీ క్షిప్రం గుర్వనుగ్రహతో మునే ॥

తా॥ అంతకంటెను పంచవక్త్రహనూమన్మంత్రము గురువను గ్రహముచే త్వరగా సిద్ధించునదియే.

శ్లో॥ చులుకోదకవ త్పీతా–స్సాగరా స్సప్త యోగినా
అగస్త్యేన పురా జప్త్వా–విద్యామేనాం హనూమతః ॥

తా॥ ఈ హనుమద్విద్యాజపమువలననే యోగియగు నగస్త్యునిచే సప్తసముద్రములు పుడిసిలినీటివలె త్రాగబడినవి.

శ్లో॥ పార్థస్య జయసామర్థ్యం–భీమ స్యారినిబర్హణమ్
అస్యా ఏవ ప్రభావేన–సత్యం సత్యం వదా మ్యహమ్ ॥

తా॥ అర్జునునకు శత్రువుల జయించుశక్తియు, భీమునకు శత్రువులం జంపు సామర్థ్యము నీ మంత్రమువలనవచ్చినవే. ఇది ముమ్మాటికి నిజమని నేను చెప్పచున్నాను.

శ్లో॥ శ్రీరామానుగ్రహా దేనాం-విద్యాం ప్రాప్య విభీషణః
అచలాం శ్రియ మాసాద్య-లంకారాజ్యే వస తేఽసౌ ॥

తా॥ విభీషణుడు శ్రీరామునియనుగ్రహమువలన నీ విద్యనుపొంది శాశ్వతమగు సంపదను పొంది లంకలో నివసించుచున్నాడు.

శ్లో॥ అనయా సదృశీ విద్యా-నాస్తి నా స్తీతి మే మతిః
ప్రవృత్త్యర్థం న ప్రశంసా-క్రియతే సత్యమేవ హి ॥

తా॥ దీనితో సమానమైన విద్యలేదు, లేదు అని నా అభిప్రాయము. దీనియందు ప్రవృత్తి కల్గుటకై ఈ పొగడ్తకాదు. ఇది నిజము.

శ్లో॥ విజయో బహు సన్మానం రాజవశ్య మనుత్తమమ్
స్త్రీవశ్యం జనవశ్యం చ మహాలక్ష్మీ రచంచలా ॥

తా॥ దీనిచే విజయము, గౌరవము, రాజవశ్యము, స్త్రీవశ్యము, జనవశ్యము, అచంచల భాగ్యము కల్గును.

శ్లో॥ ధర్మార్థకామమోక్షాశ్చ నివృత్తిః సకలాపదమ్
శత్రూణా మపి సర్వేషాం-నిగ్రహానుగ్రహో స్సతామ్

తా॥ ధర్మార్థ కామ మోక్షములును, సమస్తములగు నాపదలనుండి నివృత్తియు, శత్రువులనివారణము నిగ్రహానుగ్రహ శక్తియు కల్గును.

శ్లో॥ వాక్సిద్ధిః పుత్రసంపత్తి ర్భోగా అష్టవిధా అపి
యద్య దిష్టతమం లోకే-తత్సిద్ధ్యతి న సంశయః ॥

తా॥ వాక్సిద్ధి, పుత్రసంతానము, అష్టైశ్వర్యములు, లోకమున నేది మిక్కిలి యిష్టమో అది యెల్ల నిస్సందేహముగా సిద్ధించును.

శ్లో॥ గురుసంతోషత స్సిద్ధి శ్శీఘ్రమేవ భవిష్యతి
ఏకాక్షర ప్రదాతారం-యో గురుం నాభిమన్యతే ॥

తా॥ గురువును సంతోషపెట్టుటవలన మంత్రసిద్ధి శీఘ్రముగ నగును. ఒక్క అక్షరం చెప్పిన గురువు నైనను ఎవఁడు గౌరవించఁడో

శ్లో॥ సశ్వయోనిశతం గత్వా-చండాలత్వ మవాప్నుయాత్
గురుం హుంకృత్య తుంకృత్య ఉల్లంఘ్యాజ్ఞాం గురోరపి॥

తా॥ వాఁడు వంద కుక్కజన్మలెత్తి చండాలత్వము నందును. గురువును హుంకరించియు, తుంకరించియుఁ గురునాజ్ఞ నుల్లంఘించువాడు

శ్లో॥ అరణ్యే నిర్జలేదేశే భవతి బ్రహ్మరాక్షసః
దరిద్రో గురుశుశ్రూషాం వత్సర త్రయ మాచరన్
విద్యాం లబ్ధ్వా మహాసిద్ధి మవాప్నోతి న సంశయః ॥

తా॥ నిర్జలమగు నరణ్యప్రదేశమున బ్రహ్మరాక్షసి యగును. దరిద్రుఁడు గురుశుశ్రూష మూడు సంవత్సరము లొనర్చినచో విద్యనంది నిస్సందేహముగా మహత్సిద్ధి నందును.

శ్లో॥ యత్కించి ద్ధనవాం శ్చాపి వస్త్రాలంకరణాదిభిః
కళత్రం ప్రీణయిత్వా తం సంతోష్య ప్రగురుం శుభమ్
గురుత్వా త్సిద్ధి మాప్నోతి నాన్యథా వ్రతకోటిభిః

తా॥ ఏ కొద్ది ధనవంతుడైనను వస్త్రాలంకరణాదులతో గురువును, గురుపత్నిని సంతోషపెట్టిన కృతకృత్యుఁడు కాగలఁడు. అట్టి సిద్ధి యితరముగా కోటివ్రతముల వలనను నేర్పడదు.

శ్లో॥ గురువాక్యేన మంత్రాణాం పురశ్చరణం వినాపి చ
సంతోషః జాయతే తస్మా దిత్యాహ భగవా న్శివః ॥

తా॥ గురువాక్యముల మంత్ర పురశ్చరణ లేకున్నను గురు సంతోషమువలననే సిద్ధియగునని భగవంతుఁడు శివుఁడనెను.

శ్లో॥ మంత్రోపదేశ సమయే ప్రాంజలి శ్శిష్యకో మునే ।
స్వామిన్! గురో! మహాప్రాజ్ఞ యావజ్జీవం మహావిభో ॥

తా॥ మైత్రేయా! మంత్రోపదేశ సమయమందు శిష్యుడు చేతులు జోడించి స్వామీ! గురుదేవా! మహాప్రాజ్ఞా! సర్వసమర్థా! నేను జీవితాంతము

శ్లో॥ భవచ్చరణ కైంకర్యం కరో మ్యాజ్ఞాం కురుష్వ మే
ఇతి స్వభాష యోచ్చార్య ప్రదత్వా గురుదక్షిణామ్ ॥

తా॥ తమ పాదసేవ చేతును నాకాజ్ఞనిండు అని తన మాటలలో జెప్పి గురుదక్షిణ సమర్పించిన

శ్లో॥ విద్యాసిద్ధి మవాప్నోతి–నాన్యధా వ్రతకోటిభిః
మంత్రోపదేశ కాలే తు గురు రిష్టప్రదం మనుమ్॥

తా॥ విద్యాసిద్ధిని పొందగలుగును. ఇతరములు కోటి వ్రతముల వలనను కలుగదు. మంత్రోపదేశకాలమున గురునకిష్టమగు మంత్రమును

శ్లో॥ అష్టోత్తరశతం చైవా ప్య ష్టావింశతి మేవ వా
జప్త్వా శిష్యస్య శిరసి హస్తం నిక్షిప్య దక్షిణమ్॥

తా॥ నూట యెనిమిదిమార్లుకాని, ఇరువదియెనిమిదిమార్లు కాని జపించి శిష్యుని శిరసుపై కుడిచేతినుంచి

శ్లో॥ దక్షిణే కర్ణమూలే తు మూలమంత్రం వదే న్మునేః
వీర్యశిద్ధ్యై చ మంత్రస్య జపం కుర్యా చ్చ దేశికః॥

తా॥ మైత్రేయా! కుడి చెవియందు మూల మంత్రమును చెప్పవలెను. వీర్యసిద్ధికొరకు గురువు మంత్రజపమును చేయవలయును.

శ్లో॥ అష్టోత్తరశతావృత్త్యా–జపే త్సంశుద్ధ మానసః
సర్వాసామపి విద్యానా మయం సాధారణక్రమః ॥

తా॥ పరిశుద్ధ మానసుఁడై నూటయెనిమిదిమార్లు జపించవలెను. అన్ని విద్యలకిది సామాన్య క్రమమైయున్నది.

శ్లో॥ విశేషేణ మహావిద్యా పంచవక్త్రహనూమతః
గురుసంతోషతో లబ్ధా_సామ్రాజ్యం ప్రపదాతి హి ॥

తా॥ విశేషముగా పంచవక్త్ర హనుమన్మహావిద్య గురు సంతోషముతో పొందబడినదై సామ్రాజ్యము నిచ్చును.

శ్లో॥ సహస్రశిరసా సాక్షాచ్ఛేషస్యాఽపి మహామునే :
న శక్యతేఽస్య మహాత్మ్యం వక్తుం వర్ష శతై రపి ॥

తా॥ ఈ హనుమన్మంత్రమాహాత్మ్యము వేయి శిరస్సులు కల శేషునకైనను వందల సంవత్సరములందునుఁ జెప్పుటకు నలవికాదు.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖహనుమన్మంత్ర వివరణే
పరాశరమైత్రేయ సంవాదే మంత్రోపదేశ లక్షణం నామ

ప్రథమః పటలః

—o—

ఓం

శ్రీ హనుమతే నమః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## ద్వితీయ పటలః

## హనుమన్మంత్రోద్ధారణం

శ్రీ పరాశరః

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి శృణు మైత్రేయ కాగ్రమానసః
యస్య విజ్ఞానమాత్రేణ విజయస్స్యాత్ నృణాం సదా ॥

తా॥ శ్రీ పరాశర మునీంద్రులు చెప్పుచున్నారు. దేనిని తెలిసికొనిన మాత్రమున నరులకు విజయము లభించునో అట్టి మంత్రోద్ధారము చెప్పు చున్నాను. ఏకాగ్రచిత్తుడవై వినుము.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య హరిమర్కట శబ్దతః
మర్కటాయ పదం వహ్ని జాయాం తు ప్రోచ్చరేత్తతః ॥

తా॥ మొదట ప్రణవము అనగా ఓంకారము నుచ్చరించి హరి మర్కట శబ్దము నుంచి దానిపై మర్కటాయ పదము, పిదప స్వాహా అనునది యుచ్చరింపవలెను.

శ్లో॥ ద్వాదశాక్షర సంయుక్తో మంత్రోఽయం సముదీరితః ॥

తా॥ ఇది ద్వాదశాక్షర మంత్రముగా చెప్పబడినది. (12 అక్షరములు.)

శ్లో॥ ఓం నమః పంచవదనాయ – పూర్వవత్కపిశబ్దతః
ముఖే సకల శబ్దం చ శత్రు సంహారణే త్వథ
తతో యకార ముచ్చార్య హ్రాం బీజం తతః పరమ్
మహాబలాయేతి పదం వహ్ని జాయాం సముచ్చరేత్ ॥

తా॥ "ఓం నమః పంచవదనాయ" అని పూర్వవత్ కపిముఖే పదముల నుంచి 'సకల శత్రు సంహరణాయ' అని 'హ్రాం' బీజమును జేర్చి 'మహాబలాయ' అని చెప్పి 'స్వాహా' పదము నుచ్చరింపవలెను.

శ్లో॥ త్రయస్త్రింశ ద్వర్ణరూపో మంత్రోయ మితి కథ్యతే ॥

తా॥ ఇది త్రయస్త్రింశద్వర్ణ మంత్రముగా చెప్పబడుచున్నది. అనగా ముప్పది మూడక్షరముల మంత్రము.

శ్లో॥ ఓంనమః పంచవదనాయ దక్షిణస్థ ముఖే పదమ్
కరాళాఖ్యనృసింహాయ క్ష్రౌంబీజం తదనంతరమ్ ॥

తా॥ 'ఓం నమః పంచవదనాయ' అని 'దక్షిణముఖే' పదము తరువాత 'కరాళ నృసింహాయ' అని చెప్పి 'క్ష్రౌం' బీజముచేర్చి

శ్లో॥ సకలేతిపదం చోక్త్వా భూత ప్రమథనాయ చ
వహ్నిజాయాం సముచ్చార్య - వద్యైషా రామదాయినీ ॥

తా॥ 'సకల' అనుపదము చెప్పి 'భూత ప్రమథనాయ' మరియు స్వాహా అని యుచ్చరించు ఈ మంత్ర మన్య సమస్తములను [illegible] దీర్చునది.

శ్లో॥ చతుస్త్రింశ ద్వర్ణరూపో మంత్రోయ మితి కథ్యతే ॥

తా॥ ఇది చతుస్త్రింశద్వర్ణ రూప మంత్రముగా చెప్పబడుచున్నది. అనగా ముప్పది నాల్గక్షరముల మంత్రము.

శ్లో॥ ఓంనమః పంచవదనాయ-పశ్చిమస్థ ముఖే పదమ్
వీరాద్గరుడాయేతి మ్రౌంబీజ తదనన్తరమ్ ॥

తా॥ 'ఓం నమః పంచవదనాయ పశ్చిమముఖే' అని 'వీరగరుడాయ' అని మ్రౌం బీజము నాపై యుంచవలెను.

శ్లో॥ సకలేతి పదం చోక్త్వావిషేతి పద ముచ్చరేత్
హరాయ పద ముచ్చార్య వహ్నిజాయా మతః పరమ్ ॥

తా॥ 'సకల' అను పదము పలికి, 'పెష' అని యుచ్చరించవలెను. పిదప 'హరాయ' అని 'స్వాహా' పదము నుంచవలెను.

శ్లో॥ ఏకత్రింశ ద్వర్ణరూపో మంత్రోయ మితి కథ్యతే ॥

తా॥ ఇది ఏకత్రింశద్వర్ణ మంత్రమని చెప్పబడుచున్నది. అనగా ముప్పదియొక్క యక్షరముల మంత్రము.

శ్లో॥ ఓంనమః పంచవదనాయ – ఉత్తరస్య ముఖే పదమ్
ఆదివరాహాయపదం గ్లౌంబీజం తదనంతరమ్ ॥

తా॥ 'ఓం నమః పంచవదనాయ ఉత్తరముఖే' అనుపదము, 'ఆది వరాహాయ' అనుపదము గ్లౌంబీజము నుంచి యనంతరము.

శ్లో॥ సకలేతి పదం ప్రోక్త్వా – సంపత్కార పదం తతః
తతో యకార ముచ్చార్య వహ్నిజాయాం సముచ్చరేత్ ॥

తా॥ 'సకల' పదము పలికి పిదప సంపత్కారాయ అని యుచ్చరించి 'స్వాహా' పదమును జెప్పవలెను

శ్లో॥ ఏకత్రింశద్వర్ణరూపో మంత్రోయ మితి కథ్యతే ॥

తా॥ ఇది ఏకత్రింశద్వర్ణ మంత్రమని చెప్పబడుచున్నది. అనగా ముప్పదియొక్క యక్షరముల మంత్రము.

శ్లో॥ ఓంనమః పంచవదనాయ – ఉచ్చరేచ్చ తతః పరమ్
పద మూర్ధ్వముఖే పశ్చా ద్ధయ గ్రీవాయ శబ్దతః ॥

తా॥ 'ఓం నమః పంచవదనాయ' అని యుచ్చరించి పిదప 'ఊర్ధ్వముఖే' అని పిదప 'హయగ్రీవాయ' అను శబ్దముపై

శ్లో॥ సర్వోత్కృష్ట మహాగోప్యం హ్స్రాంబీజ మనన్తరమ్
సకలేతి జనేత్యుక్త్వా చతుర్థ్యంత సమన్వితమ్ ॥

తా॥ అన్నిటికంటె రహస్యమగు 'హ్స్రాం' బీజము నుంచి పిదప 'సకల' అని, 'జన' అని యుచ్చరించి చతుర్థి విభక్త్యంతమగు

శ్లో॥ వశీకరణ శబ్దం చ – వహ్నిజాయాం సముచ్చరేత్
ద్వాత్రింశద్వర్ణమంత్రోయ మాగమజ్ఞై శ్చ కథ్యతే॥

తా॥ 'వశీకరణ' శబ్దమును-అనగా 'వశీకరణాయ' అని 'స్వాహా' నుచ్చరింపవలెను. ఆగమవిదులైనవారిచే నిది ద్వాత్రింశద్వర్ణ మంత్రముగాఁ జెప్పబడుచున్నది. అనగా ముప్పది రెండక్షరముల మంత్రము.

శ్లో॥ ప్రణవం హృదయం పశ్చా త్తతో భగవతే పదమ్
ఆంజనేయాయ శబ్దం చ చతుర్థ్యంత సమన్వితమ్ ॥

తా॥ "ఓంనమో" యను పదము వెనుక "భగవతే" పదము, "ఆంజనేయాయ" అను శబ్దము, పై చతుర్థీ విభక్త్యంతమగు

శ్లో॥ మహాబల పదం పశ్చాత్తతో హనుమతే పదమ్
ఉచ్చరే ద్వహ్నిజాయాంతాం విద్యైషా సముదీరితా॥

తా॥ "మహాబల" పదమును అనగా "మహాబలాయ" అనుట. పిదప "హనుమతే" అని అగ్నిదేవుని భార్య నుచ్చరింపవలెను. అనగా "స్వాహా" అనవలెను. ఈ రీతిగా నీ విద్య చెప్పబడినది.

శ్లో॥ త్రయోవింశత్యక్షరోయం – మంత్ర ఇత్యుచ్యతే బుధైః ॥
తా॥ ఇది త్రయోవింశత్యక్షరమంత్రముగా విజ్ఞులచే చెప్పబడుచున్నది. అనగా ఇరువదిమూడక్షరముల మంత్రము.

శ్లో॥ సప్తమంత్రస్థ వర్ణానాం – షణ్ణవ త్యుత్తరామునే
శతసంఖ్యేత్యాగమజ్ఞైః పండితైః ర్జాయతే ॥

తా॥ పై సప్తమంత్రములందలి వర్ణము లన్నియు నో మైత్రేయా తొంబదియారు సంఖ్య యుత్తరముననున్న వందనగా అనగా మొత్తం 196 అని ఆగమజ్ఞులగు పండితులచే తెలియబడుచున్నది.

శ్లో॥ సప్తమంత్రాత్మికా విద్యా పంచవక్త్రహనూమతః
కలౌ కలుషచిత్తానాం ప్రత్యక్షఫలదాస్మృతా ॥

తా॥ ఈ పంచవక్త్ర హనూమత్సంబంధమగు నేడు మంత్రములతో నున్న విద్య కలియుగమందలి కలి కల్మష హృదయులకు ప్రత్యక్ష ఫల మిచ్చునదని తెలిసికొనదగినది.

శ్లో॥ సామ్రాజ్ఞీ సర్వ విద్యానాం మహా సింహాసనేశ్వరీ
సకృజ్జాప్తఫలం ప్రాప్తం సప్తకోటి మనుష్వపి ॥

తా॥ ఈ సప్త మంత్రాత్మక హనుమన్మంత్ర విద్య విద్యలన్నిటికి రాణియై మహాసింహాసనము నధిరోహించినదై యున్నది. యేడుకోట్ల మన్వం తరములవరకు ఇహపర ఫలము దీనిచే ప్రాప్తమగును.

శ్లో॥ అనయా సప్తశీ విద్యా త్రిషులోకేషు దుర్లభా
న తిథి ర్నచ నక్షత్రం న యోగః కరణమేవ చ ॥

తా॥ మూడు లోకములందును దీనితో సమమగు విద్య దుర్లభమై యున్నది. దీనిని నేర్చుకొనుటలో తిథి నియమములేదు, నక్షత్రయోగ కరణ నియమములేదు.

శ్లో॥ న వార మాపదో దోషా విద్యాయా గ్రహణే మునే!
న వేదై ర్నాగమై శ్శాస్త్రై ర్న పురాణై స్సు విస్తరైః ॥

తా॥ వారాది దోషనిమిత్తము ఈ విద్యను గ్రహించుటలోలేవు. మరియూ దీని నెఱుగ వేదములతోగాని, ఆగమములతోగాని, శాస్త్రము లతోగాని పనిలేదు.

శ్లో॥ జ్ఞాతుం శక్యా హి విద్యేషా శ్రీమ ద్గురుముఖం వినా
గురు కారుణ్యతో లబ్ధ్వా సర్వ సామ్రాజ్యదాయినీ ॥

తా॥ ఈవిద్య గురుముఖమునసే రాకుండ తెలిసికొన వీలైనదికాని గురువనుగ్రహముచే దీనిని పొందినచో నిది సర్వ సామ్రాజ్యము నొసగున దగును.

శ్లో॥ యథా శ్రీగురుకారుణ్యా ల్లభ్యతే శ్రీహనూమతః
విద్యా తథైవ మోగోయు మర్థోదయ ఇతి స్మృతః ॥

తా॥ ఏరీతిగా గురు నను గ్రహమువలన హనుమత్సాంబభమగు విద్య లభించునో అట్లు అది యోగదాయి సంపద్దాయి యని తెలియ దగినది.

శ్లో॥ సత్యం సత్యం పునస్సత్యం భుజ ముద్ధృత్య వష్యతే
యస్యాస్తి గురుకారుణ్యం యావజ్జీవం మహామునే ॥

తా॥ ఈ చెప్పునది సత్యము, ముమ్మాటికి సత్యమని చేతులెత్తి చెప్పబడుచున్నది. ఏమన మైత్రేయా! ఎవానికి గురునను గ్రహముండునో జీవితాంతము

శ్లో॥ స ఏవ ధన్యో లోకేషు-కృతకృత్య స్సుభాగ్యవాన్
దరిద్రో వ్యాధితో వా పి అంధో వా వామనో పి వా ॥

తా॥ అతఁడు ధన్యుఁడు. దరిద్రుడైనను, వ్యాధి గ్రస్తుడైనను, అంధుఁడైనను, పొట్టివాఁడైనను అతఁడే లోకమున కృతకృత్యుఁడు; అతడే భాగ్యవంతుడు.

శ్లో॥ గురురేవ పరందైవం గురురేవ పరంతపః
గురురేవ పరంధ్యానం న గురో రధికం భువి ॥

తా॥ గురువే పరదైవతము, గురువే శత్రునాశకుఁడు. గురువే ఉత్తమ ధ్యానము, లోకమునందు గురునకు మించినదిలేదు.

శ్లో॥ మనో స్సదాశివ ఋషిః ఛందోఽ మృతవిరా ట్తతః
పంచానన విరాడ్రూపీ హనుమా న్దేవతా భవేత్ ॥

తా॥ మంత్రమునకు సదాశివుడు ఋషి. అమృత విరాట్టు ఛం దస్సు పంచముఖుఁడగు విరాట్రూపి హనుమంతుఁడు దేవత యగును.

శ్లో॥ హ్రాంబీజం చైవ హ్రీంశక్తిః హ్రూంకీలక మి తీరితమ్
షడంగ మాచరే త్పశ్చాత్ షడ్దీర్ఘ యుత మాయయా ॥

తా॥ దీనికి హ్రాం బీజము, హ్రీం శక్తి, హ్రూం కీలకము అని చెప్పబడినది. పిదప షడంగమాచరించి ధ్యాన మొనర్పవలెను.

శ్లో॥ ధ్యానం—

పంచాస్య మచ్యుత మనేక విచిత్రవీర్యం
శంఖాసిచక్ర విధృతం కపిరాజవర్యం
పీతాంబరాది మకుటై రుపశోభితాంగం
పింగాక్షమద్య మనిశం మనసా స్మరామి

తా॥ పంచముఖుఁడైనవానిని, భ్రంశము నొందని వానిని, పలు రీతుల పరాక్రమములుకలవానిని, శంఖము కత్తి చక్రము ధరించినవానిని, కపి శ్రేష్ఠుని, పీతాంబరము మకుటము మున్నగు వానితో ప్రకాశించు దేహము కలవానిని, సింహమధ్యముఁడైనవాని నెల్లప్పుడు మనసున స్మరించు చున్నాను.

శ్లో॥ మర్కటేశ : మహోత్సాహ సర్వశోక వినాశన
శత్రూన్ సంహర మాం రక్ష శ్రియం దాపయ మేఽ చ్యుత ॥

తా॥ కపిశ్రేష్ఠుడా! గొప్పయుత్సాహము కలవాఁడా! సకల శోకములు హరించువాఁడా! శత్రువుల సంహరింపుము. నన్ను రక్షింపుము. చ్యుతిరహితా! సిరులను పొందింపుము.

శ్లో॥ ఇతి ధ్యాత్వా జపే న్మంత్రం ప్రత్యహం నియతః పుమాన్
సర్వా న్కామా నవాప్నోతి నాత్ర కార్యా విచారణా ॥

తా॥ ఈరీతిగా ధ్యానముచేసి ప్రతిదినము నియమము కలవాఁడై జపింపనగును. అట్టివాడు సమస్తములగు కోర్కెలను పొందువాఁడగును. ఈ విషయమున సందేహములేదు.

శ్లో॥ అన్యం మంత్రం ప్రవక్ష్యామి పంచవక్త్రహనూమతః
బ్రహ్మ మైత్రేయః విప్రేంద్రః గోప్యం లోకోపకారకమ్ ॥

తా॥ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! మైత్రేయుఁడా! రహస్యముగా నుంచ దగిన, లోకోపకారకమగు పంచవక్త్ర హనుమత్సంబంధమగు వేరొక మంత్రమును చెప్పుచున్నాను. వినుము.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య హ్రౌంబీజం తదనంతరమ్
క్రౌంబీజం తత ఉచ్చార్య హ్స్ఫ్రేంబీజం తదనంతరమ్ ॥

తా॥ మొదట 'ఓం' అని యుచ్చరించి పిదప హ్రౌం బీజము, అటుపై క్రౌంబీజముచ్చరించి పిదప హ్స్ఫ్రేం బీజమును,

శ్లో॥ తతో గ్లౌంబీజ ముచ్చార్య హస్ఫ్రేంబీజం తతఃపరమ్
మహాబలాయేతి పదం నమశ్శబ్దం తతఃపరమ్ ॥

తా॥ తరువాత 'గ్లౌం' బీజముపలికి అటుపై 'హస్ఫ్రేం' బీజమును, "మహాబలాయ" అను పదమును అటుపై "నమః" శబ్దమును

శ్లో॥ పంచవదనాయ పదం తతో హనుమతే పదమ్
ఫట్ఫహాంఫట్ సముచ్చార్య వహ్నిజాయాం సముచ్చరేత్ ॥

తా॥ పిదప "పంచవదనాయ" పదమును, ఆ పై "హనుమతే" పదము "ఫట్ఫహాంఫట్" అని యుచ్చరించి యగ్ని భార్యయగు "స్వాహా" శబ్దమును వాడవలెను.

శ్లో॥ త్రింశద్వర్ణ సమాయుక్త స్సర్వోత్కృష్టో మహామనుః
ధ్యానమాత్రం పృథక్ప్రోక్తా తత్సర్వం పూర్వమంత్రవత్ ॥

తా॥ ఇది త్రింశద్వర్ణాత్మకమైన సర్వోత్కృష్టమగు మంత్రము. అనగా ముప్పది యక్షరముల మంత్రము. ధ్యానము మాత్రము వేఱుగ గలిగి తక్కినది పై మంత్రమువలెనే చెప్పవలెను.

శ్లో॥ వందే వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా
హస్తాబ్జై రసి ఖేట పుస్తక సుధాకుంభా న్కుశాద్రీ న్హలం
ఖట్వాంగం ఫణిభూరుహం చ దధతం సర్వారి గర్వాపహమ్

తా॥ వానర, నారసింహ, గరుడ, వరాహ, అశ్వముఖములచే నొప్పునట్టియు, వివిధాలంకారములతోను, మూడేదుల నేత్రములు కల్గి ప్రకాశించు దేహకాంతిగల, కరకమలములందు కత్తి, డాలు, పుస్తకము, అమృతభాండము, దర్భలు, కొంత, నాగలి, మంచపుకోడు, పాము, వృక్షములు ధరించినట్టియు, సమస్త శత్రుగర్వముల నణచు హనుమంతుని నమస్కరించుచున్నాను.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పంచముఖ హనుమన్మంత్ర
వివరణే పరాశరమైత్రేయ సంవాదే పంచముఖ హనుమ
న్మంత్రోద్ధారణ కథనం నామ ద్వితీయపటలః

—o—

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## తృతీయ పటలః

## కామ్యసాధనం

శ్రీ పరాశర: —

శ్లో॥ చక్రాబ్జకర్ణి కావాసం కాలాగ్ని సదృశప్రభమ్
చతుర్బాహుం వివృత్తాస్యం చతుశ్చక్రధరం హరిమ్ ॥

తా॥ సహస్రారచక్రము అను కలువపొద్దే నివాసముగా కల్గినట్టియు, ప్రళయాగ్నితో సమానమైన కాంతి గలినట్టియు, నాల్గుచేతులు కల్గినట్టియు, తెరువబడిన నోరు కల్గినట్టియు చక్రధారియగు, తమోపహారు డైనవానిని

శ్లో॥ యోగపట్ట పినద్ధాంగం త్రినేత్రం చోగ్ర విగ్రహమ్
ధ్యాయే త్సమస్త దోషఘ్నం మహోన్నద్రుమ మూలగమ్ ॥

తా॥ యోగపట్టచే కట్టబడిన శరీరము కల్గిన, మూడు నేత్రములుగల శ్రీగ్రఘ్రగ్రహము గలవానిని సమస్త దోషములను హరించు అశోక వృక్ష మూలముననున్న వానిని ధ్యానించదగును.

శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి మంత్రసాధన ముత్తమమ్
యస్య విజ్ఞాన మాత్రేణ – భవే త్సాక్షా ద్దివస్పతిః ॥

తా॥ అందుచే నీక దేనిని తెలిసికొనినమాత్రముచేతనే సాక్షా దింద్రత్వసిద్ధియగునో అట్టి యుత్తమ మంత్ర సాధనముఁ జెప్పుచున్నాను.

శ్లో॥ కృతే త్వేకసహస్రం స్యా త్త్రేతాయాం త్రిసహస్రకమ్
ద్వాపరే పంచసహస్రం ప్రజపే దయుతం కలౌ ॥

తా॥ ఈ మంత్రమును కృతయుగమున వేయిమార్లు, త్రేతా యుగమున మూడువేలసార్లు, ద్వాపరయుగమున నైదువేలమార్లు, కలియుగ మునఁ బదివేలపర్యాయములు జపించవలెను.

శ్లో॥ పర్వతాగ్రే నదీతీరే శ్రీగురో స్సన్నిధౌ తు వా
గోష్ఠే బృందావనే వా పి – నదీతీరే విశేషతః ॥

తా॥ కొండ పైభాగమునను, నదియొడ్డున, గురుసన్నిధియందును, గోష్ఠియందును, తులసితోటయందును జపించనగును. నదీతీరమందు విశేషఫలమిచ్చును.

శ్లో॥ గురో రనుజ్ఞయా మంత్రం ప్రజపే ద్విజితేంద్రియః
సిద్ధినానేన మంత్రేణ కామ్యకర్మాణి సాధయేత్ ॥

తా॥ ఇంద్రియముల జయించినవాఁడు గురు ననుజ్ఞ పొంది మంత్రమును జపించవలెను. ఈమంత్రమునుయొక్క సిద్ధివలన ఇష్టములగు పనులను సాధింపనగును.

శ్లో॥ పూర్ణానుగ్రహతో లబ్ధ్వా శ్రీగురో ర్దేవరూపిణః
అష్టోత్తరశతం జప్త్వా ద్వాదశాహం జితేంద్రియః ॥

తా॥ దైవస్వరూపియగు గురుదేవుని యనుగ్రహముచే జితేంద్రియుడు పండ్రెండు రోజులు నూటయెనిమిది పర్యాయముల చొప్పున జపించి

శ్లో॥ సిద్ధిం పదాతి మహతీం-పురశ్చర్యా క్రియోద్భవమ్
అథ కామ్యాని కర్మాణి ప్రవక్ష్యామి సమాసతః ॥

తా॥ పురశ్చరణ చేయుటచే సుద్భవించు గొప్ప సిద్ధిని పొందినవాడగును. ఇక కామ్యకర్మల నన్నింటిని చెప్పుచున్నాను.

శ్లో॥ ఇమాం శ్రీహనుమ ద్విద్యా మష్టావింశతిధా సదా
ప్రజపే న్నిశి సాయం వా మధ్యాహ్నే ప్రాతరేవ వా ॥

తా॥ ఈహనుమద్విద్య నెల్లప్పుడు అనగా రాత్రికాని, సాయంత్రముకాని, మధ్యాహ్నమున, ఉదయమునన్నైనను నిరువదియెనిమిది పర్యాయములుగా జపింపనగును.

శ్లో॥ స ఆపత్సంఘ నిర్ముక్తః సర్వ దుష్కృత వర్జితః
విజయీ సతతం భూత్వా రాజ విద్వత్సభాసు చ ॥

తా॥ అట్టివాడు రాజసభలయందు, విద్వత్సభల యందును ఎల్లప్పుడు విజయమందువాడై ఆపదలన్నింటినుండి ముక్తుడై అన్ని పాపముల వీడిన వాడగును.

శ్లో॥ సంస్తంభయతి శత్రూణాం సంతతిం దుస్తరా మపి
దీర్ఘాయుష్య మథారోగ్య మచలాం శ్రియ ముత్తమామ్ ॥

తా॥ అడ్డుకొన శక్యముగాని శత్రుసమూహమునైనను నిల్పివేయును.దీర్ఘాయుర్ధాయమును,ఆరోగ్యమును, ఉత్తమమగు తరగని సంపదను

శ్లో॥ ప్రాప్నోతి సుమహత్తేజః దుర్లభం పరమం యశః
సర్వాభీష్ట మవాప్నోతి త్రిమాసానంతరం ధృవమ్॥

తా॥ పొందును. గొప్ప తేజస్సునందిన యతఁడు తప్పక మూడు మాసములలో ననితరసాధ్యమగు గొప్ప కీర్తినిపొంది, వలయుఁ గోరికల నన్నింటి నందుకొనును.

శ్లో॥ మందవారే జపేన్మంత్ర మష్టోత్తర శతం బుధః
హూనే ద్వాదశధా వహ్నౌ గవ్యమాజ్యం సుశోభనమ్ ॥

తా॥ విజ్ఞుడు శనివారమున నూటయెనిమిది పర్యాయములు జపించ నగును. ఆపై అగ్నియందావునేతితో పంన్రెండుమార్లు హోమముచేసిన వాఁడై

శ్లో॥ అపూపా న్వటుకా న్పంచ - ప్రీణయే ద్భోజనేన చ
షణ్మాసత స్సలభతే మహాం లక్ష్మీ మచంచలామ్ ॥

తా॥ అప్పములతోఁగూడిన భోజనముతో నైదుగురు బ్రహ్మచారులను తృప్తిపరచవలెను. అతఁడు ఆరుమాసముల పిదప సుస్థిరమగు గొప్ప సంపదనందును.

శ్లో॥ మరణాంతం వశీకుర్యాత్ రాజ స్త్రీ పురుషాదికమ్
విజిత్య సకలా న్శత్రూ న్లభతే సర్వమనోరథాన్ ॥

తా॥ యావజ్జీవము రాజవశ్య, స్త్రీవశ్య, పురుషవశ్య శక్తులేర్పడును. సమస్త శత్రువులను జయించి యభీష్టము లన్నింటిని పొందును.

శ్లో॥ కారాగృహే జపే న్మంత్రం త్రిదినా న్ముచ్యతే బుధః
త్రిదినా న్నిగళాగ్రస్తో ముచ్యతైవ న సంశయః ॥

తా॥ కారాగృహమందు జపించినయెడల మూడు రోజులలో విడుదలయగును. మూడురోజులలో సంకెళ్ళనుండి నిస్సందేహముగా విడువబడును.

శ్లో॥ మహారాజభయే ప్రాణసంకటే దుర్గమేపి చ
అష్టోత్తరశతం జప్త్వా గచ్ఛే ద్భూపస్య సన్నిధిమ్ ॥

తా॥ ప్రాణాపాయకరమై సమీపించ శక్యముకాని రీతిని మహా రాజువలన భయమేర్పడినపుడు నాటి యెనిమిది పర్యాయములు జపించి రాజసన్నిధికిఁబోనగును.

శ్లో॥ దాసవ త్సతతం రాజా సద్యో వశ్యో భవే ద్ధ్రువమ్
సువర్ణవేష్టిత శ్వేత గుంజామూలేన ముద్రికా
గురుం సంపూజ్య గృహ్ణీయాత్ వస్త్రాలంకరణాదిభిః ॥

తా॥ అట్లు పోయినచో నెల్లప్పుడు వెంటనే దాసునివలె రాజు వశ్యుఁడగును. గురువును వస్త్రాలంకరణాదులతో సంపూజించి బంగార ముతో చుట్టబడిన పుష్పగుచ్ఛమూలంబగు ముద్రికఁగైకొని

శ్లో॥ శిఖాయా మథవా కంఠే కరేవామే చ దక్షిణే
ధృత్వా కట్యాంతు వా విద్యాం స్పృశ న్నేత్రాం త్రిధా జపేత్
మనసా శ్రీగురుం సత్వా పశ్చా చ్ఛ్రీవాయుపుత్రకమ్ ॥

తా॥ శిరసునఁగాని కంఠమందుఁగాని లేక వామ దక్షిణ హస్తము లందుఁగాని కటి ప్రదేశమునఁగాని ధరించి ముమ్మారులు కనులకద్దు కొనుచు మంత్రమును జపించవలెను.

శ్లో॥ రాజ విద్వ త్సభాంవాఽపి-యత్ర యత్ర హి గచ్ఛతి
తత్ర స్యా ద్విజయో లాభః సన్మానం పౌరుషం మునేః ॥

తా॥ మైత్రేయా! అట్టివాడు రాజసభలకు లేక విద్వాంసుల సభకు ఇంక నెక్కడెక్కడకేగిన అక్కడ విజయలాభమగును, గౌరవము కూడ లభించును.

శ్లో॥ శత్రూణాం వాఙ్మన స్తంభం—క్షేమ మాయుః పదేపదే
స లభే త్సకలా న్కామా న్నిత్య మేవం సమాచరన్ ॥

తా॥ నిత్యము నీరీతిఁజేయువాడు శత్రువులకు మాట, మనసు లేకుండ చేయగలును. తాను క్షేమము, ఆయువు ననవరతముఁబొందును. సమస్తములగు కోరికలనుగూడ పొందును.

శ్లో॥ వైశాఖేమాసి కృష్ణాయాం దశమీ మందసంయుతా
పూర్వప్రోష్ఠపదా యుక్తా తథా వైధృతి సంయుతా ॥

తా॥ వైశాఖబహుళమున శనివారముతో కూడిన, పూర్వాభాద్ర నక్షత్రము, వైధృతి యోగము కలదై దశమి యున్నది.

శ్లో॥ తద్దినం హనుమ జ్జన్మ దివసం మునిపుంగవ!
తస్యాం సంపూజ్య రామస్య ప్రియభూతం మహాబలమ్ ॥

తా॥ మునిశ్రేష్ఠా! ఆ దినము హనుమంతుని పుట్టినరోజు. ఆరోజున రాముని ప్రియదూతయు మహాబలుండునైన హనుమంతుని పూజించి

శ్లో॥ గురుం సంతోష్య యత్నేన వస్త్రాలంకరణాదిభిః
శత మష్టోత్తరం జప్త్వా విద్యా మేనాం హనూమతః ॥

తా॥ వస్త్రాలంకరణాదులచే గురువును సంతోషపరచి యీ హనుమత్సంబంధమగు విద్యను నూటయెనిమిది సారులు జపించు

శ్లో॥ హునే ద్దాపశతా వహ్నౌ గవ్య మాజ్యం సుశోభనమ్
సద్య స్సిద్ధా మహావిద్యా భవతీయం న సంశయః ॥

తా॥ యోగ్యమగు నావు నేతితో పన్నెండు మారులు హోమము చేసిన నీ విద్య నిస్సందేహముగా వెంటనే సిద్ధించున దగును.

శ్లో॥ జప్త్వాఽయుత విమాం విద్యాం ఖాదిరై రయుతం హునేత్
శత్రూణాం సుమహద్రాష్ట్ర మపి సద్యో దహే ద్ధ్రువమ్ ॥

తా॥ ఈ మంత్రమును పదివేలసార్లు జపించి చండ్ర సమిధలతో పదివేలసార్లు హోమముచేసిన తప్పక శత్రువులరాజ్యమెంతదైనను వెంటనే దహించుకుపోవును.

శ్లో॥ లంకాయా దాహకం ధ్యాయ న్నిజప్త్వా దీర్ఘ మాదరాత్
పాయసేన హునే దగ్నౌ సహస్రం త్రిమధు ప్లుతమ్ ॥

తా॥ లంకాదహన మొనర్చిన హనుమంతుని మిక్కిలిగా భక్తితో జపించి వేయిమార్లు త్రివిధమధువులఁగూడిన పాయసముతో హోమం చేసినచో

శ్లో॥ తస్మిన్నేవ దినే శత్రు-రాష్ట్రం సందహ్యతేఽగ్నినా
లక్ష్మణప్రాణదాతారం-ద్రోణశైల స్థితౌషధైః ॥

తా॥ ఆరోజుననే శత్రురాజ్యము నగ్నితో దహించును. లక్ష్మణ ప్రాణదాతయగు హనుమంతుని ద్రోణాచల సంబంధులకు నోషధులచేత

శ్లో॥ ధ్యాత్వాయుత మిమాం జప్త్వా-దీర్ఘ మాయుష్య మశ్నుతే
రాత్రౌ దివా చ ప్రజపే దష్టావింశతిధా తథా ॥

తా॥ కూడినవాడై ధ్యానముచేసి పదివేలమారులు ఈ మంత్రము జపించిన దీర్ఘాయుష్మంతుఁడగును. అట్లు రాత్రిందివముల నిరువది యెని మిదిసార్లుగా జపించవలెను.

శ్లో॥ మాసే మాసే మహాయోగిన్ స్వప్నేత స్యాంజనాసుతః
దదాతి దర్శనం స్వస్య గురు స్తుష్టో భవే ద్యది ॥

తా॥ యోగివరా! ప్రతిమాసమంపట్టివానికి గురువును సంతోషపరిచిన వాఁడైనచో స్వప్నమందు హనుమంతుఁడు దర్శనమిచ్చును.

శ్లో॥ ప్రసన్నే రామదూతేఽస్య-కి మసాధ్యం జగ త్త్రయే
బ్రాహ్మీముహూర్తే చోత్థాయ-స్మృత్వా శ్రీగురు మాదరాత ॥

తా॥ హనుమంతుఁడు ప్రసన్నుడైనవానికి ముల్లోకములం దసాధ్యమేదికలదు? తెల్లవారుఝామువననేలేచి శ్రీగురు నాదరముతో స్మరించి

శ్లో॥ అష్టావింశతిధా విద్యాం జపే త్కాలో స్థితే చ్చతథ
లభతే మహతీం కీర్తి-మచలాం శ్రియ ముత్తమామ్ ॥

తా॥ ఇరువది యెనిమిదిమార్లు హనుమద్విద్యను జపించవలెను. సమయమున్న నూరుసార్లు జపించనగును అట్టివాఁడు గొప్పకీర్తిని స్థిర మగు గొప్పదగు సంపదను కూడా గడించును.

శ్లో॥ విజయం రాజసన్మానం సౌభాగ్యం కాంతి ముత్తమమ్
క్షేమ మాయుష్య మారోగ్యం సర్వా న్కామా న్సమశ్నుతే ॥

తా॥ విజయము, రాజగౌరవము, సంపద, ఉత్తమ తేజము, కుశలము, ఆయువు, ఆరోగ్యము సర్వాభీష్టములును సమకూడగలవు.

శ్లో॥ శత మష్టోత్తరం యస్తు జపే ద్బ్రాహ్మే ముహూర్తకే
తస్య శ్రీహనుమా న్స్వప్నే పక్షేపక్షే హి దృశ్యతే ॥

తా॥ బ్రాహ్మీ ముహూర్తమునందెవ్వఁడు నూటయెనిమిది పర్యాయములు జపించునో అట్టివానికి హనుమంతుఁడు పక్షపక్షమునను కలలో దర్శనమిచ్చును.

శ్లో॥ ధనధాన్య సమాయుక్తో గజ వాజి రథాకులః
ఏకవర్షే త్రిభిర్వర్షై రథ వాజాయతే ధ్రువమ్ ॥

తా॥ అట్టి వాఁడొక్క సంవత్సరముననే లేదా మూడువత్సరముల లోపు కాని ధన ధాన్యములు, గజ, అశ్వ రథ బలాదులతోఁగూడిన వాఁడు నగును.

శ్లో॥ శత్రుసంఘా న్విసిర్జిత్య ఆంజనేయ ప్రసాదతః
దృష్ట్వా విషం నాశయతి జ్వరాం శ్చాతుర్థికా నపి ॥

తా॥ శత్రువుల జయించును. ఆంజనేయానుగ్రహము తోడ చూచినవాఁడై విషము నాశనం చేయగలఁడు. జ్వరములను కూడ మాన్పగలఁడు.

శ్లో॥ దృష్ట్వై వాకర్షయేన్నారీ నృపకన్యాశ్చ దుర్లభాః
మాసద్వయాత్పరం భూపాన్ దృష్ట్వై వాకర్షయ త్యసౌ ॥

తా॥ చూడగానే స్త్రీలను దుర్లభ రీతినున్న రాజులను కన్యలను కూడ చూపుచే నాకర్షించును.

శ్లో॥ వత్సరత్రయత స్తస్య ఖేచరత్వం ప్రజాయతే
జరామరణ శూన్యోవైస శతాయుర్భవేద్ధ్రువమ్ ॥

తా॥ మూడు సంవత్సరములలో ఈ జపమువలననే ఖేచరత్వము పొందగల్గును. అట్టివాఁడు జరామరణములు లేనివాడై నూరేండ్లు తప్పక ఆయువు నందును.

శ్లో॥ సంశయాం మాకురుష్వాత్ర సంశయాత్మ వినశ్యతి
వైశాఖే మాస్య మావాస్యా-దినే బ్రహ్మాదిభిస్సురైః ॥

తా॥ ఈ విషయమున సంశయమును పొందఁదగదు. సంశయం పెట్టుకొన్నవాఁడు నశించును. వైశాఖమాసమం దమావాస్య దినమున బ్రహ్మాది దేవతలతో కూడి

శ్లో॥ సూర్యం రాహువు జిఘృక్షంతం దృష్ట్వా శక్రేణ వజ్రిణా
వజ్రప్రహార నిహతో హను రేకశిలాతలే ॥

తా॥ రాహువుచే పట్టుబడబోవు సూర్యుని చూచిన వజ్రాయుధుని ఇంద్రుని వజ్రాయుధపుదెబ్బతిన్న దవడ కల్గి ఒక శిలపై

శ్లో॥ స్వపుత్రం పతితం దృష్ట్వా వాయుః కోపసమన్వితః
న సంచచార తే నైత న్మృతప్రాయ మభూ జ్జగత్ ॥

తా॥ పడియున్న పుత్రుని వాయువు చూచి కోపముతోఁ గూడినవాఁడై తన సంచరణము నాపివైచెను. దానితో జగత్తు మృతప్రాయ మయ్యెను.

శ్లో॥ తదాగత్య హరిబ్రహ్మ శక్రాద్యై రమరాధిపైః
వరాః సహస్రశోదత్తాస్తే నాసౌ వాయునందనః ॥

తా॥ అప్పుడు వచ్చిన హరి, బ్రహ్మ, ఇంద్రుడు, మొదలగు దేవతా శ్రేష్ఠులచే వేల వరములీయబడినవి. అందుచే వాయుసుతుఁడగు హనుమంతుడు

శ్లో॥ అవర్ధత మహావీర స్సర్వకామ సమన్వితః
తస్మా దమాదినే దేవమ్ సమభ్య ర్చ్యాంజనాసుతమ్ ॥

తా॥ అన్ని కోర్కెలు తీరిన సర్వసమర్థుఁడై మహావీరుడై యుండెను. అందుచే నాంజనేయుఁడు వైశాఖమాస అమావాస్యయందు పూజనీయుఁడు.

శ్లో॥ ఫలపుష్పోపహారై శ్చ – విజయాఖ్యం జగత్పతిమ్
అష్టోత్తరశతం జప్త్వా – హునేద్ద్వాదశభా ఘృతమ్ ॥

తా॥ ఫల పుష్పోపహారముచే విజయుఁడు జగత్పతియగు నాతనిని నూట యెనిమిదిసార్లు జపించి పండ్రెండుసార్లు నేతితో హోమము చేయవలెను.

శ్లో॥ గురుం సంపూజ్య యత్నేన దత్వా చ గురుదక్షిణామ్
మంత్రసిద్ధి మవాప్నోతి నాత్రాకార్య విచారణా॥

తా॥ ప్రయత్నపూర్వకముగా గురువును పూజించి గురుదక్షిణను సమర్పించి మంత్రసిద్ధిని పొందగల్గును. ఇం దకార్యమని విచారించఁదగిన దేదియులేదు.

శ్లో॥ మార్గశీర్షే త్రయోదశ్యాం శుక్లాయాం జనకాత్మజా
దృష్టా దేవీ జగన్మాతా మహావీరేణ ధీమతా ॥

తా॥ ధీమంతుఁడు, మహావీరుఁడగు హనుమంతునిచే మార్గశిర శుద్ధ త్రయోదశినాఁడు జగన్మాతయగు, జనకుని కుమార్తె సీత చూడ బడెను.

శ్లో॥ తదా తయా వరో దత్తో య స్త్వా మభ్యర్చయిష్యతి
దుఃఖసంఘ నివృత్తిశ్చ సంపదాది మనోరథాన్ ॥

తా॥ అప్పుడామెచే నొకవరమీయఁబడెను. 'ఎవఁడయితే నిన్ను పూజించునో వాఁడు దుఃఖ నివృత్తిని, సంపద మున్నగుఁ గోర్కెలను

శ్లో॥ అవాప్నోతి న సందేహః ఇతి దే వ్యనుశాసనమ్

తస్మా త్తస్మిన్దినేఽ భ్యర్చ్య వాయుపుత్రం జగత్ప్రభుమ్ ॥

తా॥ పొందును సందేహము లేదు' అని సీతాదేవి యొక్క శాసనము. ఆ కారణమున నారోజు జగత్ప్రభుఁడగు వాయుపుత్రుని పూజించి

శ్లో॥ గురో రనుజ్ఞ యా మంత్రం- త్రిశతం ప్రజపే చ్ఛుచిః
సిద్ధాత్యేవ హి మంత్రోఽస్య- నాత్ర కార్యా విచారణా ॥

తా॥ గురుననుజ్ఞతో మూఁడువందలమార్లు శుచియై మంత్రమును జపించవలెను. మంత్రమతనికి తప్పక సిద్ధించును. ఇందు సందేహము లేదు.

శ్లో॥ నిత్యం ద్వివారం ప్రజపే-దష్టావింశతి మాదరాత్
రాత్రౌ దివా న పురుషో- మహాభాగ్యనిధి ర్భవేత్ ॥

తా॥ భక్తితో నిరువది యెనిమిదిమారులు చొప్పున నిత్యము రాత్రియందును, పగటియందును రెండువారములు జపించవలెను. అట్టి పురుషుఁడు మహాభాగ్యము నందువాఁడగును.

శ్లో॥ మాసార్ధే మండలార్థే వా- స్వప్నే దేవం ప్రపశ్యతి
అసాధ్య మపి దేవానాం-ద్వీపాంతరగతం చ యత్
లభతే సకలాభీష్టం-క్షిప్రమేవ న సంశయః ॥

తా॥ పదునైదు దినములందైన, మండలార్ధమగు నిరువది రోజుల లోపైనను కలలో సేవ్యుని జూచును. దేవతలకును సాధ్యముకాని, ద్వీపాంతర గమనము వంటి కష్టములు తీరి సకలాభీష్టములు క్షణకాలములో నిస్సందేహముగఁ బొందును.

శ్లో॥ అష్టోత్తరశతం జప్త్వా-రణం గచ్ఛతి యః పుమాన్
విజేతనా న్విమూఢాంశ్చ శస్త్రాస్త్ర కృత నిర్జితాన్ ॥

తా॥ నూటయెనిమిదిసార్లు జపించి యెవఁడు యుద్ధమున కేగునో అతఁడు మూఢులగు శత్రువులను శస్త్రాస్త్రములచే జయించును.

శ్లో॥ మాయాసైన్య పరిత్రస్తా - న్కాందిశీకాన్ కరోతి హి
విజిత్య శత్రు సంఘాతా-న్ప్రాప్నోతి విజయం ధ్రువమ్ ॥

తా॥ మాయాసైన్య సమేతులు భయపడి పరుగిడు వారిని జేయును. శత్రువుల ఎదురుతిరుగుటను జయించి తప్పక విజయముఁ బొందును.

శ్లో॥ భానువారే శ్వేతగుంజా-మూల ముద్ధృత్య యత్నతః
తా॥ ఆదివారమునాఁడు తెల్ల గురివింద వేరు ప్రయత్నించి పెళ్ళగించి

శ్లో॥ సువర్ణవేష్టిత శ్వేతగుంజామూలేన ముద్రికామ్
కృత్వా శేషం తు తన్మూలం-మంత్రేణానేన పంచధా ॥

తా॥ బంగారముతో చుట్టబడిన తెల్ల గురివింద యుంగరమును చేసికొని ఇంకను మిగిలిన వేరును మంత్రములతో నైదు భాగములుగా

శ్లో॥ కృత్వాభిమంత్రితం నిత్యం-తాంబూలేన తతః పరమ్
భక్షయిత్వా తతో గచ్ఛే-జ్జనవశ్యం మహాద్భుతమ్ ॥

తా॥ చేసి మంత్రించి రోజూ తాంబూలముతో భక్షించి వెళ్ళిన యెడల నద్భుతముగ జనవశ్యమగును.

శ్లో॥ శుభేదినే శుభేలగ్నే-గురుం సంపూజ్య యత్నతః
యద్వా వ్రతదినే ష్వేక-దివసే వా విశేషతః ॥

తా॥ శుభదినమునందు శుభలగ్నమున ప్రయత్నపూర్వకముగ గురువును పూజించి వ్రతదినమునందే కాని లేక వేఱొక విశేషదినమున

శ్లో॥ సింహాసనేశ్వరీవిద్యాం-పంచవక్త్ర హనూమతః
గురోస్సకాశాత్సంప్రాప్య-గృహ్ణీయన్ముద్రికాం శుభామ్ ॥

తా॥ పంచవక్త్ర హనుమత్సంబంధమగు సింహాసనేశ్వరీ విద్యను గురు సమీపమున చక్కగా పొంది శుభప్రదమగు ముద్రికను పొందవలెను

శ్లో॥ ధృత్వా తన్ముద్రికాం నిత్యం-మహావిద్యా మిమాం జపేత్
అష్టోత్తరశతం వాపి-అష్టావింశతి మేవ వా ॥

తా॥ ఆ ముద్రికను నిత్యము ధరించి ఈ మహావిద్యను నూట యెనిమిదిమార్లు కాని లేదా ఇరువది యెనిమిది మార్లయినను జపించనగును.

శ్లో॥ విపదో౽స్య వినశ్యంతి-లోకవశ్యం మహాద్భుతమ్
జనవశ్యం రాజవశ్య-మంగనావశ్య ముత్తమమ్ ॥

తా॥ అతనికి ఆపదలన్నియు నశించును. మహాద్భుతమగు జన వశ్యము, రాజవశ్యము, ఉత్తమ స్త్రీవశ్యము నగును.

శ్లో॥ యావజ్జీవం న సందేహం-లభే త్సకలసంపదః
సర్వత్ర విజయీ భూత్వా-విజిత్య సకలా నరీన్ ॥

తా॥ జీవితాంతము సంశయమే లేక సర్వసంపదలు పొందును. అంతటను విజయమందినవాఁడయి సమస్త శత్రువుల జయించి

శ్లో॥ ప్రాప్నోతి మహదైశ్వర్య-మచంచల మనుత్తమమ్
హనూమతః ప్రసాదేన-సతతం విజయీ భవేత్ ॥

తా॥ తరగనటువంటి సాటిలేని గొప్ప సంపదనందును. హను మంతుని యనుగ్రహముచే నంతట విజయము నందు వాఁడగును.

శ్లో॥ గ్రహణే స్పర్శ మారభ్య-మోక్షకాలాంత మాదరాత్
జపే దముం మహామంత్రం-తద్దశాంశం హునేద్ఘృతమ్ ॥

తా॥ గ్రహణసమముల స్పర్శ మొదలుకొని విడచిపెట్టు కాలము వఱకు శ్రద్ధతో నీ మంత్రమును జపింపనగును. అందు పదియవ వంతు నేతితో హోమము చేయవలెను.

శ్లో॥ తర్పయే త్తద్దశాంశేన-వటూన్ద్వాదశ భోజయేత్
సిద్ధమంత్రోభవే ల్లక్ష్మీః- కీర్తిర్భాగ్యనిధి స్సదా ॥

తా॥ అందు దశాంశము తర్పణ మీడనగును. పంన్రెండుమంది బ్రహ్మచారులకు భోజనము పెట్టవలెను. అట్టి యెడ సిద్ధించిన మంత్రము కలవాడై సంపద్వంతుఁడు, కీర్తిమంతుఁడు నగును.

శ్లో॥ స్వర్ణసంవేష్టిత శ్వేత-గుంజామూలేన ముద్రికామ్
సదా ధృత్వాకరే విద్యాం-ప్రాప్య శ్రీగుర్వనుగ్రహాత్ ॥

తా॥ బంగారముచే చుట్టబడిన తెల్లగురివింద వేరుతో చేసిన ముద్రిక నెప్పుడు చేతియందు ధరించి గురు ననుగ్రహముచే మంత్రము నంది

శ్లో॥ త్రిశతం ప్రజపేద్యస్తు-షణ్మాసం విజితేంద్రియః
అథశ్యాయా బ్రహ్మచారీ-సహ్యాభ్యర్చ్య జగత్పతిమ్ ॥

తా॥ ఎవ్వడయితే ఇంద్రియజయం కలవాఁడై క్రిందనే పరుండు వాఁడై బ్రహ్మచర్యనిష్ఠుఁడై జగత్పతిని ఆరునెలలు మూడువందల చొప్పున జపించునో అట్టివాఁడు

శ్లో॥ సాధకేంద్రో హనూమంతం చక్షుషా పశ్యతి ధ్రువమ్
అణిమాది గుణైశ్వర్యం-దదాత్యస్మైన సంశయః ॥

తా॥ ఇంద్రియసాధకుఁడై హనుమంతుని తప్పక కన్నులార చూడగల్గును. అట్టివానికి హనుమంతుఁడు నిస్సంశయముగా అణిమము మున్నగు గుణములకు సంబంధించిన అష్టసిద్ధుల నిడును. అష్టసిద్ధులు అణిమము, గరిమము, లఘిమము, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వమున్ను

శ్లో॥ లక్షమేకం జపిత్వా యో-దశాంశం కమలైర్హునేత్
నిధయ శ్శంఖపద్మాద్యా-స్తం సేవంతే న సంశయః ॥

తా॥ ఒక లక్షమార్లు జపించి అందు దశాంశం కమలములతో నెవ్వఁడు హోమముచేయునో అట్టివానిని శంఖ పద్మాది నిధులు తామ్మెడయు వానిని సేవించును. నవనిధులు మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము అనునవి.

శ్లో॥ పర్వతాగ్రే జపేద్యస్తు-లక్షత్రయ మతంద్రితః
అజరామరణో భూత్వా-పంచవింశతి వార్షికః ॥

తా॥ నిశ్చలుఁడై ఎవ్వఁడు పర్వతాగ్రమున నుండి మూఁడు లక్షలు జపించునో, అట్టివాఁడు వార్ధక్యము, మరణములేనివాఁడై, ఇరువది యైదు వత్సరముల యువకుఁడై

శ్లో॥ భేతాళసిద్ధి మాసాద్య-ఘూటికాంజన పాదుకామ్
ఖేచరః కామరూపీ చ- విజయీ సతతం భవేత్ ॥

తా॥ భేతాళసిద్ధిని, ఘూటికాంజన పాదుకాసిద్ధిని, ఆకాశ సంచార శక్తిని, కోరిన రూపమందగల శక్తిని పొంది యెప్పుడు విజయమందు వాఁడగును.

శ్లో॥ అథశ్యాయీ బ్రహ్మచారీ ప్రజపేత్పంచ లక్షకమ్
అజరామరణో భూత్వా-సదా వింశతి వార్షికః ॥

తా॥ క్రింద పరుండుచు బ్రహ్మచర్య నియమములతో నుండి యైదులక్షలు జపించిన యెడల వార్ధక్యము, మరణములేనివాఁడై యిరువది యేండ్ల ప్రాయుఁడుగ నుండును.

శ్లో॥ కల్పాయుష్యం సమాసాద్య-విమాన మధిరోహతి
రమతే దివ్యకన్యాభి-నందనాది వనేషు చ ॥

తా॥ బ్రహ్మదినమగు వేయి యుగముల కాల మాయువునంది దేవతా విమాన మధిరోహించును. నందనాది వనములందు దేవతా కన్యలతో విహరించును.

శ్లో॥ అనేనైవ శరీరేణ- సాక్షాత్కందర్ప కాంతిమాన్
అవ్యాహతాజ్ఞ స్సర్వత్ర-మోదతే కాల మక్షయమ్ ॥

తా॥ ఈ దేహముతోనే సాక్షాత్తు మన్మథుని వంటి కాంతి కల్గి అంతట నెదురులేనివాఁడై అక్షయమగు కాలము నానందముగ గడుపును.

శ్లో॥ కి ముక్తే నాథ బహునా-విద్యేయం సర్వసిద్ధిదా
సతతం నియతో యస్తు-ప్రజపేన్మంత్ర ముత్తమమ్ ॥

తా॥ మిగిలిన వన్నిటిని ఎన్నో చెప్పనేల ? ఈ విద్య సర్వసిద్ధుల నిడునది. ఇట్టి యుత్తమ మంత్రము నెవ్వఁ డెల్లప్పుడు నియమముతో జపించునో వాఁడు

శ్లో॥ అనే నైవ శరీరేణ-దివ్యా న్భోగా నవాప్య చ
జీవన్ముక్తో న సందేహ-స్సత్యం సత్యం వదా మ్యహమ్ ॥

తా॥ ఈ దేహముతోడనే దివ్య భోగముల ననుభవించి జీవన్ముక్తుడు నిస్సందేహముగ నగును. నేను చెప్పుచున్నాను. ఇది సత్యము. సత్యము.

శ్లో॥ అష్టావింశతిధా యస్తు-నిత్యం నియమవాన్ జపేత్
స ఆపత్సాగరా త్సర్వా-త్సము త్తీర్ణో మహీతలే ॥

తా॥ ఇరువది యెనిమిది పర్యాయముల చొప్పున నిత్యము నియమము గలవాఁడై ఎవఁడు జపించునో వాఁడు ఈ లోకమందలి ఆపదలను సముద్రములన్నింటిని దాటగలఁడు.

శ్లో॥ విజిత్య సకలా న్శత్రున్పరాం లక్ష్మీ మచంచలామ్
దీర్ఘ మాయుష్య మారోగ్యం-పుత్రా న్పౌత్రా ననుత్తమాన్ ॥

తా॥ సమస్తమగు శత్రువులను జయించి వారి యచంచల ధనమునంది, దీర్ఘాయువును, ఆరోగ్యమును శ్రేష్ఠులగు పుత్రులను, పౌత్రులను

శ్లో॥ జనవశ్యం రాజవశ్యం-నారీవశ్యం తథైవ చ
వాక్సిద్ధిం సకలా న్కామా-నాప్నో త్యత్ర న సంశయః ॥

తా॥ జనవశ్యమును, రాజవశ్యమును, నారీవశ్యమును, వాక్సిద్ధిని, సమస్తములగుఁ గోర్కెలను పొందును. ఇందు సందేహము లేదు.

శ్లో॥ అష్టోత్తర శతం నిత్యం ప్రజపే న్నియమేన యః
దీర్ఘాయుష్య మథారోగ్యం-ధనధాన్యచయం శ్రియమ్ ॥

తా॥ ప్రతిదినము నూటయెనిమిది చొప్పున నెవఁడు జపించునో అట్టివాఁడు దీర్ఘాయువును, ఆరోగ్యమును, ధన ధాన్యములను నిశ్చలమగు సంపదను

శ్లో॥ అచలాం పుత్రపౌత్రాం శ్చ-సౌభాగ్య మమలం శుభమ్
అవాప్య సకలా న్శత్రూ-న్జిత్వాఽహీ న్గరుడో యథా ॥

తా॥ పుత్రపౌత్రులను, సౌభాగ్యమును స్వచ్ఛమగు శుభమును పొంది పాములను గరుడుఁడెట్లో అట్లు సకల శత్రువులను జయించి

శ్లో॥ మహతీంసిద్ధి మాప్నోతి-క్షేమం సర్వత్ర విందతి
అనేనైవ శరీరేణ-వత్సర త్రయతఃపరమ్ ॥

తా॥ మూడు వత్సరములు జపించిన దేహముతో కూడియే మహత్సిద్ధిని పొందును. అంతట క్షేమము నందును.

శ్లో॥ ఘటికాత్పాదుకా ద్యష్టసిద్ధీనాం నాయకో భవేత్
ద్రవ్యాపేక్షా యథా తస్య-నిధిసిద్ధి స్తథాతదా ॥

తా॥ అష్టసిద్ధుల నందును. అతనికెప్పుడు ధనాపేక్షకల్గునో అప్పుడు నిధిసిద్ధి జరుగును.

శ్లో॥ దృష్ట్వైవాకర్షయ న్నారీం-నృపకన్యాశ్చ దుర్లభాః
సప్తద్వీపస్య పతయోఽ ప్యస్యదాసా భవంతి హి ॥

తా॥ స్త్రీని చూచిన వెంటనే యాకర్షింప గలఁడు. దుర్లభలగు రాజకన్యలను సైతమాకర్షింపగలడు సప్తద్వీపాధిపతులును వీనికి దాసులగుదురు.

శ్లో॥ స్థావరం జంగమం చాఽపి-కృత్రిమం చాఽపి య ద్విషం
ఏత త్కార స్పర్శనతః- సద్య ఏవ వినశ్యతి ॥

తా॥ స్థావరములగు శిలాదికమునకు సంబంధించిన విషము, జంగిమములగు సర్ప వృశ్చికాదుల విషము, కృత్రిమములగు పరస్పర విరుద్ధములగు పదార్థముల కూడికచే నేర్పడిన విషము - అన్నియు నీతని కరస్పర్శ జరిగిన వెంటనే హరించుకొనిపోవును.

శ్లో॥ చిరాయుష్యం సమాసాద్య-భుక్తే భోగాంశ్చ దుర్లభాన్
ఏకాహికా ద్వ్యాహికాది-జ్వరా నపి సుదారుణాన్ ॥

తా॥ అతడు దీర్ఘాయువునంది దుర్లభములగు భోగముల ననుభవించును. ఒకరోజు, రెండురోజులు వచ్చునవి, దారుణమైన జ్వరములను,

శ్లో॥ బ్రహ్మరాక్షస భేతాళ-భూత ప్రేత పిశాచకాన్
దృష్ట్వైవోచ్చాటయే త్సద్యో-నాత్ర కార్యా విచారణా ॥

తా॥ బ్రహ్మరక్షస్సు భేతాళులు, భూత ప్రేత పిశాచాదులు చూచినంతనే పారిపోవును. ఇందనుమానించవలసిన యవసరము లేదు.

శ్లో॥ కి మత్ర బహునో క్తేన-జీవన్ముక్తో భవే ద్ధ్రువమ్
అస్మి న్కలియుగే ఘోరే-లోభమాయా సమాకులే ॥

తా॥ అనేకము చెప్పనేల ? తప్పక అతడు జీవన్ముక్తుడగును. ఈ ఘోరమగు, లోభమను, మాయచేత కూడుకొన్న కలియుగమందు

శ్లో॥ అయమేవ పరోధర్మ స్త్విదమేవ పరంతపః
ఇయమేవ మహావిద్యా-ఇదమేవ పరంఫలమ్ ॥

తా॥ ఇదియే పరమధర్మము, ఇదియే శత్రు సంహారకము, ఇదియే మహావిద్య, ఉత్తమ ప్రయోజనము నిదియే.

శ్లో॥ సాధనేషు చ సర్వేషు-పూర్ణ శ్రీగుర్వనుగ్రహః
అస్తిచే త్సర్వసిద్ధి స్స్యా-దన్యథా నిష్ఫలం భవేత్ ॥

తా॥ సాధనముచే నన్నిట గురు ననుగ్రహమున్న యెడల సఫలమగును. అది లేకున్న వ్యర్థమగును.

శ్లో॥ స ఏవ కృతకృత్య స్యా-ద్యో గురౌ దృఢభక్తిమాన్
గురో రభావె తత్పత్నీం-తత్పుత్రం వా ప్రతోషయేత్
నాన్యథా సిద్ధి మాప్నోతి-పురశ్చర్యా శతై రపి ॥

తా॥ ఎవఁడైతే గురునెడ గొప్పభక్తి కల్గియుండునో వాఁడే కృతకృత్యుఁడు. గురువులేనియెడ నాతని భార్యను ఆ వారి పుత్రునికాని సంతృప్తి పరచవలెను. అట్లుకాక నూఱు పురశ్చర్యలున్నను సిద్ధి లభింపదు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం హనుమన్మంత్ర వివరణే
కామ్యసాధనం నామ తృతీయ పటలః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## చతుర్థ పటలః

## సోమదత్తచరితం – నీలకృత హనుమత్స్తోత్రం

మైత్రేయః –

శ్లో॥ హనుమద్వ్రత మిత్యుక్తం-పూర్వాధ్యాయే త్వయా మునే
కేన చాదౌ పురాచీర్ణం-తత్ఫలం వద మే విధిమ్ ॥

తా॥ మైత్రేయుఁడు చెప్పుచున్నాడు. ఓ పరాశర మహామునీ! మీచే వెనుకటి యధ్యాయమున హనుమద్వ్రతమని చెప్పబడినది. ఎవనిచేత పూర్వము దాని ఫలమందబడెను. ఆ విధము చెప్పఁగోరెదను.

శ్రీ పరాశరః –

శ్లో॥ అత్రానువర్ణయిష్యామి-కథాం పాప ప్రణాశినీమ్
యాం శ్రుత్వా మానవో నిత్యం – హనుమద్భక్తిమాన్ భవేత్ ॥

తా॥ పరాశరులు చెప్పుచున్నారు. దేనిని ప్రతిరోజు వినుట ద్వారా మానవుఁడు హనుమద్భక్తుఁడగునో యట్టి పాపనాశనకారియగు కథను వర్ణించెదను.

శ్లో॥ సోమదత్తో మహానాసీ-త్పురా సోమకులోద్భవః
రాజా పరమధర్మజ్ఞో-బంధుమా ననహంకృతిః ॥

తా॥ పూర్వము చంద్రవంశము నం దుద్భవించినవాఁడు, ధర్మము లన్నిటి నెఱిఁగినవాఁడు బంధుకోటితో కూడినవాఁడు అహంకార రహితుఁడు నగు రాజు సోమదత్తుఁడను మహనీయుఁడుండెను.

శ్లో॥ సత్యవాదీ సదామౌనీ-హ్యతిథేయో బహువతః
సత్సు పూజాం ప్రకుర్వాణః- కిం ను శత్రుపరాక్రమైః ॥

తా॥ అతఁడు సత్యము మాటాడువాఁడు, ఎల్లవేళల మౌనవ్రత నిష్ఠునివలె నుండి వాచాలత లేనివాఁడు, అతిథి పూజా నియమము మిక్కిలి కలవాఁడు, మంచివారిని పూజించువాఁడు, పరాక్రమవంతుడున్ను

శ్లో॥ బుభుజే భువ మవ్యగ్రః- స రత్నాకరమేఖలామ్
తేన సంపీడితా రాజ్ఞా-సమేతాః శత్రవః పరే ॥

తా॥ కలవరము లేనివాఁడై సముద్రమే మొలనూలుగాఁగల భూమిని పాలించెను. శత్రువులందఱను నాశనము చేయుచుండువాఁడు. అట్టి వారందఱు కూడి

శ్లో॥ మాహిష్మతీపురం యాతాః- తై రాహూతో రణేతు సః
అక్షౌహిణీ సహస్రైర్చ-హ్యయుతైః కరిణాం ఘటైః ॥

తా॥ మాహిష్మతీపురమున కేగిరి. సోమదత్తుడు వారిచే యుద్ధమున కాహ్వానింపబడెను. కొన్ని వేల అక్షౌహిణులసేనతోను, పదివేలనక్షౌహిణీల సేనతోను, ఏనుగుల సమూహముతోను కూడినవారితో రణరంగమున

శ్లో॥ అశ్వైః కాశ్మీరజై స్సైన్యు-లక్షకోటి సమన్వితైః
సంగ్రామస్తుములస్తస్య-సోమదత్తస్య తైరభూత్ ॥

తా॥ లక్షకోటుల కాశ్మీర దేశీయములగు గుఱ్ఱములతో కూడిన వారితో నా సోమదత్తునకు సంకుల సమరమేర్పడెను.

శ్లో॥ శక్తి తోమర ఖడ్గశ్చ-భిండివాలై స్తదాశ్మభిః
యథా దైవాసురం యుద్ధం-తథాభూత్కిం ను వర్ణ్యతే ॥

తా॥ బల్లెము, చిల్లకోల, ఖడ్గములు, ఇనుపమొనలు గల భిండివాలములను నాయుధములతోను, రాళ్ళతోను దేవదానవ సంగ్రామమువలె నా యుద్ధము జరిగెను. ఇంక నేమని వర్ణింపనగును ?

శ్లో॥ పరైర్జిత బలస్సంఖ్యే - నిశి సంగృహ్య దేవికామ్
స్త్రియమంతః పురాత్తస్మా - న్త్యాగా ద్గార్గ్యాశ్రమం ప్రతి ॥

తా॥ శత్రువులచే జయింపబడినవాఁడై రాజు దేవికతో నంతఃపురము నుండి గార్గ్య మహాముని యాశ్రమమున కేగెను.

శ్లో॥ తత్రైవ పంచమాసాస్తు-స్థిత్వా శోకసమన్వితః
పంగుత్వ మపి మూకత్వ-మంధత్వ మగమ న్నృపః ॥

తా॥ అక్కడనే శోకముతో కూడినవాఁడై అయిదు మాసములుండెను. పిదప కుంటి, మూగ, గ్రుడ్డితనములఁ బొందెను.

శ్లో॥ రాజ్యాద్భ్రష్టం పతిం ధీరా-ప్రాప్తుకామం పునః ప్రియమ్
ప్రలపంతం మహాఃపుత్రాన్ - హతాన్ యుద్ధేసు దుర్లభాన్ ॥

తా॥ ధైర్యముకల యతని భార్య రాజ్యభ్రష్టుడైన, మరల ఇష్టమును పొందగోరెడు పతిని గూర్చి మిక్కిలి విచారించుచున్న వానిని గూర్చి యుద్ధమునందు చనిపోయిన బిడ్డల విషయమై దుర్లభములగు

శ్లో॥ శ్రియం రాజ్యం చ భోగం చ-సముద్దిశ్య పునః పునః
ఆశ్వాసయంతీ సా దేవీ- జగౌ శ్లోక చతుష్టయమ్ ॥

తా॥ సంపద, రాజ్యము, భోగముల విషయమై, మాటి మాటికి నోదార్చునదై నాల్గు శ్లోకములను చెప్పెను.

శ్లో॥ ధైర్యం విపత్తౌ కర్తవ్యం సంపత్తౌ చ క్షమాపరా
వాచాలత్వం సభామధ్యే-తద్వై శాస్త్ర పురస్సరమ్ ॥

తా॥ ఆపదలందు ధైర్యము సంచిత సంపదలందు నోర్పు సభలయందు శాస్త్ర విషయముల బాగుగ మాటాడు గుణము కర్తవ్యము.

శ్లో॥ విక్రమం యుధి కర్తవ్యం – స్థిరత్వం శ్రీ సమీపతః
ఐశ్వర్యే చ తథా క్షాంతి-ర్భక్తి శ్శశ్వత్తు భూసురే ॥

తా॥ యుద్ధమునందు పరాక్రమము, శ్రీలకడ నచంచలత, సంపదలేర్పడినప్పుడోర్పు, బ్రాహ్మణుని యందు భక్తియుఁ గర్తవ్యము.

శ్లో॥ భవితవ్యం భవత్యేవ-నారికేళఫలాంబువత్
గంతవ్యం గచ్ఛతి సదా-గజభుక్త కపిత్థవత్

తా॥ కావగినది యగుచునేయుండును. కాకమానదు ఎట్లన కొబ్బరికాయలో నీరు ఎవ్వరు పోయకున్నను సమయమున నేర్పడు చుండునుకదా ! పోయేది యెట్లునుపోవును. ఎట్లన ఏనుగు వెలగపండును మింగగా దానిలో గుజ్జు హరించుకుపోయి శూన్యమగు డొల్ల తిరిగివచ్చును. కన్పడకుండ లోనిది మాయమగును.

శ్లో॥ యద్భావి తద్భవత్యేవ-యదభావి న తద్భవేత్
ఇతి నిశ్చిత బుద్ధీనాం-న చింతా బాధతే క్వచిత్ ॥

తా॥ ఏదికానున్నదో అది కాకమానదు. కాదగనది కాదుకూడ. ఈ యాలోచనను నిశ్చయించుకొనియున్న వారికి చింతయుండదు.

శ్లో॥ ఏవం మనీషిణః ప్రాహు-ర్నీతిశాస్త్రవిదో నృప ।
ముంచ శోకం చ మోహం చ-చింతాం దేహవినాశినీమ్ ॥

తా॥ ఈ రీతిగా నీతిశాస్త్రకోవిదులగు పండితులు చెప్పుదురు. కావున ఓ రాజా! నీవు శోకమును, పోయిన వానిపై ప్రేమను, దేహమును నాశనము చేయు చింతను వీడుము.

శ్లో॥ గార్గ్యాశ్రమోయం రాజేంద్ర—ప్రాపయిష్యే తదంతికమ్
స దాస్యతి ధర్మాత్మా—సర్వా న్కామా న్సుదుర్లభాన్ ॥

తా॥ రాజా ఇది గార్గ్యాశ్రమము. దాని సమీపమునకుఁ ప్రవేశించుచున్నాము. ఆ ధర్మాత్ముఁడు దుర్లభములగుఁ గోర్కెల నైతమీయ గలఁడు.

శ్లో॥ సాంత్వయిత్వా తతో వీరం—నృపతిం రాష్ట్ర వర్జితమ్
అశక్తం గమనే దేవీ—బిభ్రతీ నిజకందరే ॥

తా॥ అని యూరడించి పిదప రాష్ట్రము వీడిన వీరుడగు నాయ శక్తుడై నడవలేని వానిని ఆతని భార్య గుహలయందు ధరించుచు

శ్లో॥ ప్రాపయామాస ముదితా—గార్గ్యాశ్రమ మకల్మషమ్
పతిం తత్ర ప్రతిష్ఠాప్య—మునిం నత్వా పునః పునః ॥

తా॥ పాపరహితమగు నా గార్గ్యాశ్రమమును ఆమె చేర్చెను. అతని నటనుంచి పలుమార్లు మునికి నమ్రురాలై

శ్లో॥ కంపమానా తదా సాధ్వీ—పీనోన్నత పయోధరా
చంద్రాననా సుకేశీ చ— బింబోష్ఠీ మంజుభాషిణీ ॥

తా॥ అప్పుడు సాధ్వియైన, బలిసి యున్నతములగు కుచములు కల, చంద్రుని వంటి ముఖముకల, మంచి వెంట్రుకలుకల, దొండపండు వంటి పెదవికల, మధురముగ మాటాలాడగల,

శ్లో॥ కర్ణాంతనయనా బాలా—చంద్రి కామలినచ్ఛవిః
దేవికాదేవి మధ్యా సా—పంచవింశతి వార్షికా ॥

తా॥ చెవులవఱకు వ్యాపించిన నేత్రములుకల, వెన్నెలవలె స్వచ్ఛమగు కాంతికల, దేవికయను ఇరువదియైదేండ్ల ప్రాయముకల

శ్లో॥ కోమలాంగీతు సా దేవీ-శ్యామలా చోత్పలేక్షణా
మునిం ప్రోవాచ ధర్మిష్ఠా-పాహిపాహీతి మే పతిమ్ ॥

తా॥ కోమలములగు నవయవములు కలదియు, శ్యామలవర్ణము కలదియు, కలువకంటి వడకుచు ధర్మ రతికలదై మునిని 'రక్షింపుముపతిని రక్షింపు' మని వేడెను.

శ్లో॥ భగవ న్పతినాసార్ధ-మాగతా శత్రుపీడితా
రాజ్యభ్రష్టో హ్యాయం రాజా-త్వామేవ శరణం గతః ॥

తా॥ మహానుభావా : శత్రువులచే పీడింపబడి పతితో కూడి వచ్చితిని. ఈ రాజు రాజ్యము నుండి తొలఁగినవాఁడు. మిమ్మే శరణుపొంది యున్నవాడున్ను.

శ్లో॥ ముని స్తత్ర చిరం ధ్యాత్వా-ధ్యానమార్గేణ చక్షుషా
దృష్టవా న్సర్వ మేవైత-ద్రాజ్ఞ స్తస్య మహాత్మనః ॥

తా॥ ముని యప్పుడు మిక్కిలి ధ్యానము చేసి ధ్యానమార్గ నేత్రముతో చూచి సమస్తమగు విషయమును తెలిసికొనెను.

శ్లో॥ ఉవాచ మునిశార్దూలో-రాజానం మహిషీసఖమ్ ॥

తా॥ మునిసత్తముఁడగు గర్గుఁడు రాణి ప్రియుఁడగు రాజును గూర్చి యిట్లు చెప్పఁదొడఁగెను.

గర్గోవాచ—

శ్లో॥ యువయోః కష్ట మత్యుగ్రం-సర్వాభావం సు దుస్సహమ్
యేనేద మీ దృశం ప్రాప్తం-తద్బ్రవీమి హితేஉధునా
సకృద్వా ప్యుత్తమా విద్యా-నోపాస్తా విజయప్రదా ॥

తా॥ మీకేర్పడిన కష్టము చాలా గొప్పది. ఏమియు లేమిచే మిక్కిలి సహింపరానిది. దేనివలన నీ విధి యేర్పడినది చెప్పెదను. విజయమునీయగల ఉత్తమ మంత్రమును నీవనుష్ఠించలేదు.

శ్లో॥ కృతాని న త్వయా వీర-హ్యుత్తమాని వ్రతాన్యపి
తస్మాత్త్వ మీదృశం ప్రాప్తో-గతిం దురవబోధనామ్ ॥

తా॥ ఓ రాజా ! నీచే నుత్తమమగు వ్రతములు చేయబడలేదు అందుచే నీవిట్టి భరింపరాని గతులఁబడితివి.

రాజా ఉవాచ—

శ్లో॥ ఉపాసనాయ విద్యానా-మశక్తోஉహం వ్రతేషు చ
యథాశక్త్యా కరిష్యామి-తథాపి భగవన్మునే ॥

తా॥ రాజు చెప్పుచుండె – ఓ భగవంతుఁడవగు గర్గమునీ ! మంత్రోపాసన విషయమున, వ్రతమునందును నశక్తుఁడను. అయినను శక్తి కొలది చేయగలను.

శ్లో॥ సర్వమంత్ర మహారాజ-విద్యా మేకాం ఫలప్రదామ్
శ్రేష్ఠం వ్రతానాం సర్వేషా-మేకం దీనాయ మే వద ॥

తా॥ అన్ని మంత్రములకు మహారాజువంటి దానిని ఫలప్రదమగు నట్టి దానిని అన్ని వ్రతముల కంటె శ్రేష్ఠమైన ఒక మంత్రమును దీనుఁడ నగు నాకు చెప్పుఁడు.

శ్లో॥ వాత్సల్యవంత స్సర్వేషు-యూయం దీనేషు సర్వదా
యద్యపి మయి కారుణ్యం-కురుశిష్యో స్మ్యనుగ్రహమ్ ॥

తా॥ తమరు అందఱియందును వాత్సల్యముకలవారు ఎల్లప్పుడు దీనులయెడ ప్రేమకలవారు. నాయందును ఆ రీతి కరుణ గలవారై యున్నను నేను మీకు శిష్యుడనైతిని. అనుగ్రహింపుఁడు.

శ్లో॥ ఇత్యుక్తస్తేన రాజ్ఞాథ-వృద్ధగార్గ్యో మహామునాః
క్షణం ధ్యాత్వా నృపం ప్రాహ-శ్రూయతా మిహ పుత్రక ॥

తా॥ ఈ రీతిగా రాజుచేఁ జెప్పఁబడగా కీర్తిమంతుఁడగు నా వృద్ధగార్గ్యుఁడు క్షణము ధ్యానించి రాజుతో కుమారా ! వినుము.

శ్లో॥ రాజ న్సకలవిద్యానాం—సారభూతో హనూమతః
పంచవ క్త్రాఖ్య విద్యా స్తి-తాం దదామి నృపోత్తమ॥

తా॥ ఓ రాజా! సమస్త విద్యలకు సారభూతమైనహనుమత్పంచ వక్త్ర విద్యయనుపేర నొక విద్యకలదు నృపశ్రేష్ఠా! దాని నిచ్చెదను.

శ్లో॥ సద్యో దురితరాశిఘ్నీ-సకలార్తి నివారిణీ
అనాయసేన జయదా—సామ్రాజ్య ఫలదాయినీ ॥

తా॥ అది వెంటనే పాపములన్నింటిని పోగొట్టునది. సమస్తము లగు బాధలను నివారించునది సులభముగా జయము నిచ్చునట్టిది, సామ్రాజ్యమును నిచ్చునది.

శ్లో॥ తాం జపస్వ మహాబాహో-జయసిద్ధి ర్భవిష్యతి
అన్యచ్చ తవ వక్ష్యామి-వ్రతం శ్రీహనుమత్ప్రభోః ॥

తా॥ ఓ దీర్ఘభుజుఁడా దానిని జపించుము. వెంటనే జయసిద్ధి కల్గును. హనుమత్ప్రభువుని వ్రతముఁదెల్పెద వినుము.

శ్లో॥ సర్వస్వమ స్తఫలదం-సతతం విజయప్రదమ్
వైశాఖే దశమీ కృష్ణ-అమావాస్యా తతఃపరమ్ ॥

తా॥ అది వెంటనే సమస్తములగు ప్రయోజనముల నిచ్చునది. యెల్లప్పుడు విజయ మిచ్చునది. వైశాఖమాస కృష్ణపక్ష దశమినాడు లేదా ఆపై అమావాస్యనాడైన

శ్లో॥ మాఘాది పంచమాసేషు-ఏకస్మిన్ శుక్లపక్షకే
మందవాసర అన్యస్య-తారం మృగశిరోఽభిధమ్ ॥

తా॥ మాఘమాసము మొదలు ఐదుమాసములందు శుక్లపక్షమున మొదటి శనివారమునకాని మృగశిరా నక్షత్రమునకాని

శ్లో॥ శ్రావణే పౌర్ణమీ చైవ-కార్తికే ద్వాదశీ తథా
మార్గశీర్షే తథా శుక్లే-సంప్రోక్తా చ త్రయోదశీ ॥

తా॥ శ్రావణ మాసమున పౌర్ణమి యందుగాని, కార్తీకమాస శుద్ధద్వాదశియందు అట్లే మార్గశిర శుద్ధ త్రయోదశియందుగాని ఈ వ్రత మాచరింపదగియుండినది.

శ్లో॥ ఏతేషు దివసే ష్వేక-దివసే వ్రత మాచరేత్
భక్తిమాంశ్చే త్సర్వదినే ష్విదం వ్రత మథాచరేత్ ॥

తా॥ పైవానిలో నొకరోజు వ్రతమాచరింపవలెను. భక్తిమంతుం డైన మొదల నన్నిరోజులందు నీ వ్రత మాచరింపవచ్చును.

శ్లో॥ ఏకస్మిన్ తోరకం బద్ధ్వా-పూజామాత్రం తతఃపరమ్
కుర్యా ద్భ్రవాయుపుత్రస్య-దివసే ష్వపరే ష్వథ ॥

తా॥ వ్రతారంభముననే తోరమును కట్టుకొని పిదప పూజ నాచరింపవనగును. హనుమత్పూజను మిగిలినరోజులందును ఆచరింపవచ్చును. తోరము మాత్రము మార్చనవసరములేదు.

శ్లో॥ బ్రాహ్మీముహూర్తే సాయం వా-మధ్యాహ్నే ప్రాతరేవ వా
పూజయే దంజనాసూనుం-గురో రాజ్ఞాపురస్సరమ్ ॥

తా॥ ముందుగా గురుననుమతి పొందినవాఁడై బ్రాహ్మీ ముహూర్తమునందు అనగా తెల్లవారుఝాము వేదాధ్యయనము చేయువేళ అనగా సూర్యోదయమునకు ముప్పావుగంట ముందుకాని, సాయంత్రముకాని మధ్యాహ్నముకాని, యుదయముకాని హనుమంతునిఁ బూజింప నగును.

శ్లో॥ స్వర్ణ రాజిత తామ్రేషు-భూర్జే వా స్థండి లేంభసి
క్షౌమే వా పూజయే ద్ధీమాన్యంత్రే వా ప్రతిమాసు వా ॥

తా॥ బంగారము, వెండి, రాగి మొదలగు యంత్ర ములయందుఁ గాని భూర్జ పత్రమునందుగాని, పిండితో వేసిన యంత్రమందుగాని ఉదక పూరితమగు కలశ మందుఁగాని, పట్టుగుడ్డయందుఁగాని, ప్రతిమలయందుఁ గాని ఆవాహన మొనర్చి పూజింపనగును.

శ్లో॥ త్రయోదశ గ్రంధియుక్తం-ధృత్వా తోరక ముత్తమమ్
త్రయోదశ ఘృతపూప వాయనం తత్ర దాపయేత్ ॥

తా॥ పదుమూఁడు ముడులఁగూడిన తోరమును ధరించవలెను. పదమూఁడు నేతియప్పములు వాయనమీయవలెను.

శ్లో॥ గురుం సంపూజ్య విత్తాద్యై-ర్విత్తశాఠ్య వివర్జితః
విత్తశాఠ్యకృతం కర్మ-పుణ్యాం తన్నిష్ఫలం భవేత్ ॥

తా॥ ధనాదికముచే లోపముచేయక గురువును పూజింపవలెను, విత్తలోభముతో పూజించుట నిరర్థకమే.

శ్లో॥ బ్రాహ్మణై స్సహ భుంజీయా-ద్యథాశక్తి సమాహితః
త్రయోదశ చ వర్షాణి-సిద్ధికామ స్సమాచరేత్ ॥

తా॥ శక్తిననుసరించి బ్రాహ్మణ సమారాధనము గావించి వారితో భోజనము చేయనగును. సిద్ధిని కోరిన వాడై పదమూడేండిట్లు చేయ నగును. సకల కార్యసిద్ధులు సమకూడును.

శ్లో॥ అనేన సకలా శ్శత్రూ-స్దుర్ధరా సమరై రపి
విజిత్య సుమహ ద్రాజ్యం-చిరకాల మవాప్స్యసి ॥

తా॥ దీనిచే జయింప దుర్లభులగు శత్రువుల నందఱను, దేవతల నైనను జయించి చిరకాలము గొప్పరాజ్యము లభించినవాఁడవై యుందువు.

శ్లో॥ భవిత్రీ పూర్వసంపత్తి- స్తవ శ్రీః కీర్తిసంయుతా

తా॥ నీ వెనుకటి సంపద, కీర్తి, పుత్రులు అన్నియు కల్గును

శ్లో॥ అత్రార్థే సంప్రవక్ష్యామి-పూర్వవృత్తాంత మద్భుతమ్
విభీషణసుత శ్శ్రీమా-న్నీలోనామ మహాబలః
సర్వవిద్యాసు నిష్ణాతో-నిత్యం ధర్మపరాయణః ॥

తా॥ ఈ మధ్యలో నద్భుతమగు నొక పూర్వ వృత్తాంతముఁ దెల్పెదను విభీషణుని కుమారుఁడు నీలుఁడనువాఁడు మహాబలవంతుడున్ను, అన్ని విద్యలను నేర్చిన వాఁడు, నిత్యముధర్మకార్యములందుండువాఁడున్ను.

శ్లో॥ స ఏకదా మహారాజం-విభీషణ మరిందమమ్
ఉవాచ భగవ న్నస్మి-న్పురే లక్ష్మీ రచంచలా ॥

తా॥ నీలుఁడొకప్పుఁడు శత్రునాశకుఁడగు విభీషణుని చూచి ఇట్లు పల్కెను. ఓ ప్రభూ! ఈ లంకాపట్టణమున సంపద పూర్ణముగా నున్నది.

శ్లో॥ త్వదధీనం మహారాజ్య-మిదం లంకాపురస్య తే
ధనధాన్యాకులం సర్వ-మపి భోగసమన్వితమ్ ॥

తా॥ మీ యాధీనమునందున్న యీ లంకారాజ్యము ధనధాన్య సమృద్ధమై అన్ని భోగములతో కూడియున్నది.

శ్లో॥ అనర్ఘ ముక్తారత్నాద్యై-ర్దివ్య జాంబూనదాదికైః
ఇదం పురం చ రాష్ట్రం చ-సుఖసంప త్సమన్వితమ్ ॥

తా॥ ఎనలేని ముత్యములు, మున్నగువానితోను. సువర్ణాదికముతోను నీ పట్టణము, రాజ్యమంతయుఁగూడ సుఖసంపదలతో నున్నది.

శ్లో॥ తథాపి పుర్యాం రాష్ట్రే వా-తవ రాజగృహేపి వా
చింతామణిః కామధేనుః-కల్పవృక్షో న దృశ్యతే ॥

తా॥ అయినప్పటికి లంకాపట్టణమునఁగాని, రాష్ట్రమందుకాని తమరాజగృహమందుఁగాని చింతామణి, కామధేనువు, కల్పవృక్షము మాత్రము కాన్పించుటలేదు.

శ్లో॥ సాక్షాత్త్వం జానకీనాథ-చరణాంభోజ సేవయా
సంప్రాప్య మహదైశ్వర్యం-మహారాజోసి సువ్రత ॥

తా॥ సద్వ్రతనిష్ఠా గరిష్ఠుఁడా! నీవు సాక్షాత్తు జానకీ పతియగు శ్రీరామచంద్రుని పాదసేవచే గొప్పసంపదను పొంది మహారాజు వైతివి.

శ్లో॥ చింతామణ్యాదయో భోగా-న సంప్రాప్తాః కథం త్వయాది
య ద్యాజ్ఞా దీయతే మహ్యా-మానేష్యే త్త్రయం పునః ॥

తా॥ చింతామణి మొదలగు భోగములను నీవెందులకు పొంచలేదు? నా కాజ్ఞనిచ్చినయెడల నా మూడింటిని తీసికొని రాగలను.

విభీషణ ఉవాచ —

శ్లో॥ శ్రీరామ చరణాంభోజ-మకరంద సుధారసే
భృంగాయతే మమ మన-స్సతతం నీలబాలక ॥

తా॥ విభీషణుఁడు పల్కెను.- ఓ కుమారా! నీల! శ్రీ రామ చంద్రుని పాదమనెడు పద్మమునందలి తేనెకై నా మనస్సు తుమ్మెదగానై తిరుగుచుండును.

శ్లో॥ బ్రహ్మానంద రసాంభోధే-మగ్నోహాం తత్ప్రసాదతః
తత్ప్రసాదా న్మయా ప్రాప్తం-మహదైశ్వర్య మక్షయమ్ ॥

తా॥ ఆతని యనుగ్రహముచే బ్రహ్మానందమను సముద్రమున మునిగియున్నాను. ఆ శ్రీరాముని యనుగ్రహముచేతనే నాకు నాశముకాని గొప్ప ఐశ్వర్యము లభించినది.

శ్లో॥ దీర్ఘాయుష్యం చ సామ్రాజ్యం - దుర్లభం య త్సురైరపి
చింతామణిః కల్పతరుః-కామధేను స్స ఏవ మే॥

తా॥ అంతియకాక దీర్ఘాయువు, దైవతలకైనసాధ్యముకానిసామ్రా జ్యము లభించినవి. నా కా రాముఁడే చింతామణి, ఆతఁడే కల్పతరువు. కామ ధేనువు కూడ.

శ్లో॥ ఏకాంశేనాపి వై కుంఠే-హరే శ్చరణకింకరః
ఏకాంశేన మయా ప్రాప్తం-పరమైశ్వర్య మక్షయమ్॥

తా॥ ఒక్కయంశవలన నాచే నక్షయమగు మహైశ్వర్యము పొందఁ బడినది. ఒక్క అంశచే వైకుంఠమునందు హరికి చరణదాసుఁడనుకూడ నైతిని.

శ్లో॥ శ్రీ జానకీశ-కృపయా-శక్రాద్యా లోకపాలకాః
మద్వశే సంస్థితా దేవాః-కిము మర్త్యా మహీతలే ॥

తా॥ శ్రీ జానకీపతి దయవలన దేవేంద్రాది దిక్పాలు రందఱు నాకు వశులైయున్నారు. ఇక భూలోక వాసులగు మానవులఁగూర్చి చెప్పనేల?

శ్లో॥ కిమల్పసారై ర్శే సీల-చింతామణ్యాదికైరపి
ఇత్యుక్త్వాస మహారాజో-నీలం ధర్మపరాయణః ॥

తా॥ ఇక నల్పప్రయోజనముకల చింతామణ్యాదులతో నా కేమి కలదు పుత్రకా! నీలః అని ధర్మపరాయణుడగు విభీషణుఁడు నీలునితో ననెను.

శ్లో॥ అథాస్యాపి యశోభూయా-దితి ధ్యాత్వాఽబ్రవీత్పునః
చింతామణిః కల్పతరుః-కామధేను స్సురాలయే ॥

తా॥ అటు పిమ్మట తన పుత్రునకు కీర్తి రావలనని యోచించిన వాఁడై మరల పల్కెను. దేవలోకమున చింతామణి, కల్పతరువు కామధేనువు కూడ.

శ్లో॥ అమరై రేవ భుజ్యంతే-దివ్యరత్నాని సర్వదా ॥
తా॥ ఎల్లప్పుడు దేవతల చేతనే యనుభవింపబడుచున్నవి.

శ్లో॥ అకృత్వాచార్యశుశ్రూషా-మనుపాస్య చ దేవతాః
భోక్తుం న శక్యతే దివ్య-రత్నజాతం మహీతలే ॥

తా॥ ఆ దివ్యరత్న జాతము గురుశుశ్రూష చేయక, దేవతల నుపాసించక అనుభవించుటకీ భూలోకమున శక్యము కాదు.

శ్లో॥ తవాపేక్షాస్తి చే ద్దివ్య రత్నజాతేషు పుత్రక
కురు ష్వాచార్యశుశ్రూషాం-స తే శ్రేయః ప్రదాస్యతి ॥

తా॥ కుమారా! దివ్యరత్నములయెడ నీకు కోరికయున్న యెడల గురుశుశ్రూషను చేయుము. ఆతఁడే నీకు శ్రేయము లీయఁగలడు.

శ్లో॥ ఇత్థం విభీషణే నోక్తో-నీలః పుత్రో మహాత్మనా
ఆజ్ఞాం ప్రగృహ్య శిరసా-పితరం ప్రణిపత్యచ ॥

తా॥ ఈరీతిగా పుత్రుఁడగు నీలుఁడు మహాత్ముఁడగు విభీషణునిచేఁ జెప్పఁబడినవాఁడై ఆజ్ఞను శిరసావహించి తండ్రికి నమస్కరించి

శ్లో॥ జగామ భార్గవం శుక్రం-సేవార్థం గురు మాదరాత్
పాదసంవాహనాద్యైశ్చ దీప్త రత్నాదికార్పణై ః ॥

తా॥ గురువగు శుక్రాచార్యుని సేవింప నాదరముతో నేగెను. పాదములొత్తుట వంటివానిచేతను, ప్రకాశమానములగు రత్నాదుల నర్పించుట చేతను

శ్లో॥ భార్గవం తోషయామాస-దశ ద్వాదశ వత్సరాన్
సంతుష్య త్వేకదా తస్య-భార్గవ స్తపసాంనిధిః ॥

తా॥ పది పండ్రెండేండ్లు శుక్రాచార్యుని సంతోష పెట్టెను. సేవకు సంతోషించినవాడై తపోనిధియగు భార్గవుఁడొకప్పుడు

శ్లో॥ కిమభీష్టం కరోమీతి-నీలం ప్రాహ మహామతిః
సోఽపి విజ్ఞాపయామాస స్వాభీష్టం సర్వ మద్భుతమ్॥

తా॥ నీలుని నీ కోరిక యేమియో చెప్పుమని యా మహానుభావుఁడడిగెను. అతఁడు కూడ అద్భుతమగు తన కోర్కెను విన్నవించెను.

శ్లో॥ సుప్రీతో భార్గవః ప్రాహ-తతో నీలం మహాసురమ్
రాజ్ఞీం సకల విద్యానాం-సద్య స్సిద్ధి విధాయినీమ్ ॥

తా॥ అందుకు ప్రీతుఁడై రాక్షస జాతివాఁడగు నీలునితో భార్గవుఁడిట్లు చెప్పెను. అన్ని విద్యలకు మహారాణియనఁ దగిన వెంటనే సిద్ధించునట్టి

శ్లో॥ ఉపదేక్ష్యామి తే విద్యాం-వ్రతం చానుత్తమం భువి
యేన తే దివ్యరత్నానాం ప్రాప్తి శ్శక్రాదికై రపి ॥

తా॥ విద్యను, శ్రేష్ఠమగు వ్రతమును ఉపదేశించుచున్నాను. అది ఎట్టిదన దేనిచేత నీకు దివ్యరత్నములు ప్రాప్తించునో మఱియు దేవేంద్రాదులకైన

శ్లో॥ అజేయత్వ మవధ్యత్వం-దీర్ఘాయుష్య మనుత్తమమ్
కించ తే కీర్తి రచలా-జగతి స్థాస్యతి ధ్రువమ్ ॥

తా॥ జయింపనలవికాని, చంపశక్యముకాని గుణములను, శ్రేష్ఠమగు దీర్ఘాయువును నగునో, నీ కీర్తి స్థిరమై జగత్తున నిలవగలవో అట్టి దానిని

శ్లో॥ నక్షత్రం మృగశీర్షాఖ్యం-శ్వో నక్షత్రోత్తమం శుభమ్
కురు శ్రీరామదూతస్య-పంచవక్త్ర హనూమతః ॥

తా॥ రేపు నక్షత్రము మృగశిర. మృగశీర్ష నక్షత్ర మీ విద్యకు యోగ్యమైనది. కావున శ్రీరామునకు దూతయగు పంచవక్త్ర హనుమంతునకు సంబంధించిన

శ్లో॥ వ్రతం సమస్త ఫలదం-సద్య స్సిద్ధి విధాయకమ్
ఇత్యు క్త్వోపాదిశ ద్విద్యాం-ఆంజనేయస్య మారుతేః ॥

తా॥ వ్రతము సమస్త ప్రయోజనముల నొసగునది, వెంటనే సిద్ధించునది కూడ కాన నాచరింపుము అని ఆంజనేయ సంబంధమగు విద్య నుపదేశించెను.

శ్లో॥ కారయామాస హనుమ-ద్వ్రతం పరమశోభనమ్
వ్రతాంతే భార్గవగురుం-రత్నై రర్ఘైశ్చ పుష్కలైః
పూజయిత్వా మహావిద్యాం-జపన్నాస్తే సమాహితః

తా॥ పరమ శోభనమగు హనుమద్వ్రతముగూడ చేయించెను. నీలుడు వ్రతాంతమున గురుడగు భార్గవుని రత్నధనాదులతో నుచితరీతిని బూజించి యాతడొసగిన మహావిద్యను జపించుచు నుండెను.

శ్లో॥ తతః శ్రీరామచంద్రస్య-సచివానా మథాగ్రణీః
ప్రాదురాసీ త్త్రియస్త్రింశ-త్కోట్యర్బుదగణై ర్వృతః ॥

తా॥ ఇట్లు జపించినంతట శ్రీరామచంద్రునిదాసులలోముఖ్యుడగు హనుమంతుఁడు ముప్పది మూడు కోట్ల యర్బుదముల సేవకా గణముతో (అర్బుదమనఁగా వేయికోట్లు) ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ తం దృష్ట్వా సహ సోత్థాయ-ప్రాంజలిః పురతః స్థితః
తుష్టావ నీలో ధర్మాత్మా-స్తోత్రైః పవననందనమ్॥

తా॥ అట్లు ప్రత్యక్షమైన యా హనుమఁ జూచి వెంటనే లేచి ఎదురుగనున్నవాఁడై దోసిలొగ్గి యా నీలుఁడు వాయుసుతుఁడగు నా పవాత్మజు నాంజనేయుని ధర్మాత్ముఁడై యీ రీతిగాస్తోత్రము చేసెను.

## నీలకృత ఆంజనేయస్తోత్రమ్

ఓం జయ జయ ! శ్రీ ఆంజనేయ ! కేసరీప్రియనందన ! వాయుకుమార ! ఈశ్వరపుత్ర ! పార్వతీగర్భసంభూత ! వానర నాయక ! సకలవేదశాస్త్రపారగ ! సంజీవి పర్వతోత్పాటన ! లక్ష్మణ ప్రాణరక్షక ! గుహప్రాణదాయక ! సీతా దుఃఖ నివారణ ! ధాన్యమాలీ శాపవిమోచన ! దురండీబంధవిమోచన ! నీలమేఘ రాజ్యదాయక ! సుగ్రీవ రాజ్యదాయక ! భీమసేనాగ్రజ ! ధనంజయ ధ్వజవాహన ! కాలనేమిసంహార ! మైరావణ మర్దన ! వృత్రాసురభంజన ! సప్త మంత్రిసుతధ్వంసన ! ఇంద్రజిద్వధకారణ ! అక్షకుమారసంహార ! లంఖిణీ భంజన ! రావణమర్దన ! కుంభకర్ణవధపరాయణ ! జంబుమాలి నిషూదన ! వాలినిబర్హణ ! రాక్షసకుల దాహన ! అశోకవనవిదారణ ! లంకాదాహక ! శతముఖవధకారణ ! సప్తసాగరవాల సేతుబంధన ! నిరాకారనిర్గుణ సగుణస్వరూప ! హేమవర్ణ పీతాంబర ధర ! సువర్చలా ప్రాణనాయక ! త్రయత్రింశత్కోట్యర్బుద రుద్రగణపోషక ! భక్తపాలనచతుర ! కనకకుండలాభరణః రత్న కిరీటహార నూపుర శోభితః రామభక్తితత్పరః హేమరంభావన విహారః వక్షతాంకిత మేఘవాహకః నీలమేఘశ్యామః సూక్ష్మకాయః మహాకాయః బాలసూర్యగ్రసనః ఋష్యమూకగిరి నివాసకః మేరుపీఠకార్చనః ద్వాత్రింశదాయుధధరః చిత్రవర్ణః విచిత్రసృష్టి నిర్మాణకర్తః

అనంతనామః దశావతారః అఘటన ఘటనాసమర్థః అనంత బ్రహ్మాండ నాయకః దుర్జన సంహారః సజ్జనరక్షకః దేవేంద్రవందితః సకలలోకారాధ్యః సత్యసంకల్పః భక్త సంకల్పపూరకః అతిసుకుమార దేహః అకర్దమ వినోద లేపనః కోటిమన్మథాకారః రణకేళీమర్దనః విజృంభమాణః సకలలోక కుక్షింభరః సప్తకోటి మహామంత్ర తంత్రస్వరూపః భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ విధ్వంసనః శివలింగ ప్రతిష్ఠాపనకారణః దుష్కార్యవిమోచనః దౌర్భాగ్య నాశనః జ్వరాది సకలరోగహరః భుక్తి ముక్తి దాయకః కపటనాటకసూత్రధారీః కలావినోదాంకితః కల్యాణపరిపూర్ణః మంగళప్రదః గానలోలః గానప్రియః అష్టాంగయోగనిపుణః సకల విద్యాపారీణః ఆదిమధ్యాంతరహితః యజ్ఞకర్త యజ్ఞభోక్తః షణ్మత వైభవసానుభూతిచతురః సకలలోకాతీతః విశ్వంభరః విశ్వమూర్తే! విశ్వాకారః దయాస్వరూపః దాసజన హృదయకమలవిహారః మనోవేగగమనః భావజ్ఞనిపుణః ఋషిగణగేయః భక్తమనోరథదాయకః భక్త వత్సలః దీనపోషకః దీన మందారః సర్వస్వతంత్రః శరణాగతరక్షకః ఆర్త త్రాణపరాయణః ఏక అసహాయవీరః హనుమాన్! విజయీభవః దిగ్విజయీ భవః దిగ్విజయీభవః

ఇతిశ్రీ పరాశర సంహితాయాం పంచముఖ హనుమన్మంత్ర వివరణే పరాశర మైత్రేయ సంవాదే ఆంజనేయస్తోత్ర కథనం నామ చతుర్థ పటలః



# శ్రీ ఆంజనేయ చరిత్ర

## పంచమ పటలః

## సోమదత్త - నీలచరితం

శ్లో॥ అథస్తోత్రేణ సంతుష్టో-భక్త్యా నీలకృతేన చ
ఉవాచవచనం నీలం-హనుమా న్వాయునందనః ॥

తా॥ అటు పిమ్మట నీలునిచే చేయఁబడిన భక్తి పూర్ణమగు స్తోత్రముచే సంతసించినవాఁడై వాయునందనుఁడగు హనుమంతుఁడిట్లనెను.

శ్లో॥ అగ్రిగణ్యోఽసి భక్తానాం-మమ నీల సదాభవాన్
విభీషణ స్తవపితా-సఖా మమ మహామతే ॥

తా॥ ఓ నీలః నీవు నా భక్తులందరిలోను ఎల్లప్పుడు నగ్రగణ్యుఁడగు వాఁడవైతివి. ఓ బుద్ధిమంతుఁడా! నీ తండ్రియగు విభీషణుఁడు కూడ నాకు మిత్రుడే

శ్లో॥ జ్ఞాతంమయాతవాభీష్టం-తద్దదామి స సంశయః
శ్వో మహేంద్రపురం గత్వా-జిత్వాతి భువనేశ్వరమ్ ॥

తా॥ నీ కోర్కె నెఱిఁగితిని. నిస్సందేహముగా దానినీయఁగలను. రేపు అమరావతికేగి ఇంద్రుని జయించి

శ్లో॥ చింతామణ్యాదికం దివ్య-రత్నజాత మవాప్స్యసి ॥

తా॥ చింతామణి మున్నగు దివ్యరత్నములు పొందగలవు.

శ్లో॥ రూప శీల వయో భాగ్య-సహితా వనసుందరీ
రత్న భూతా సురస్త్రీణాం-సా చాపి ప్రాప్స్యతే త్వయా ॥

తా॥ ఇంకనూ దేవతా స్త్రీలలో రత్నమువంటి, అందము, శీలము యుక్తవయస్సు సౌభాగ్యముకల వన సుందరిని కూడ పొందగలవు

శ్లో॥ ఆగత్య తేంతికం పశ్చా-చ్చతుర్వక్త్రః పితామహః
అప్రార్థిత మభీష్టం చ - ప్రదాస్యతి మహామతే ॥

తా॥ విజ్ఞుడా! ఆ వెనుక పితామహుడగు బ్రహ్మ దేవుడు కూడ నీ సమీపమునకు వచ్చి నీవు కోరకున్నను వరము నీయగలడు.

శ్లో॥ మద్విద్యాం ప్రజపే ద్యస్తు-మద్వ్రతం కురుతే భువి
భవా న్యథా తథై వాసౌ-సద్య స్సిద్ధి మవాప్స్యతి ॥

తా॥ ఎవడైతే లోకమున నా మంత్రమును జపించి నా వ్రతము నాచరించునో అట్టివాడు నీ వలె వెంటనే ఫలితమును పొందును.

శ్లో॥ పురుషోత్తమ సంస్థానం-త్వన్నామ్నా ఖ్యాతి మేష్యతి
మృగశీర్షాఖ్య నక్షత్రం-భవనం తే భవిష్యతి ॥

తా॥ నీ పేరుమీద నీ చోటికి పురుషోత్తమ క్షేత్రమని కీర్తి కల్గును. నీకు మృగశీర్షా నక్షత్రము నిలయము కాగలదు.

శ్లో॥ మమ త్వం దక్షిణే భాగే-స్థితిం ప్రాప్య మహామతే
సర్వే మనోరథాః శ్రేష్ఠాః-ప్రాప్యంతే మత్ప్రసాదతః ॥

తా॥ బుద్ధిమంతుడా నీకు నా దక్షిణభాగము నీ స్థితి యేర్పడును. నా యనుగ్రహముచే నీ కన్ని గొప్ప గొప్ప కోర్కెలు నెరవేర గలవు.

శ్లో॥ ఇత్యుక్త్వా భగవ న్దేవః-శ్రీరామ ప్రియ కింకరః
అంతర్దధే రుద్రగణై-స్సురర్షి భి రభీష్టదః ॥

తా॥ భగవంతుడు దేవదేవుడు శ్రీరామునకు ప్రియ సేవకుడగు హనుమంతుడు పెరీతిగా బల్కి కోర్కెల నిడు నాతడు రుద్రగణముల తోను దేవర్షుల తోను అంతర్ధానమొందెను.

శ్లో॥ విభీషణసుత శ్శ్రీమా–నవా ప్త సక లేప్సితః
భార్గవస్య గురోః పాదౌ–భూయోభూయః ప్రణమ్య చ ॥
లంకా మాగత్య పితరౌ వ వందే వినయాన్వితః ॥

తా॥ సకలాభీష్టములనందిన విభీషణసుతుఁడు శ్రీమంతుఁడగు నీలుఁడు గురువగు శుక్రాచార్యుని పాదములకు మరల మరల ప్రణమిల్లి లంకకు వచ్చి వినయముతో కూడినవాఁడై తల్లిదండ్రులకు నమస్కరించెను.

శ్లో॥ తతో నీల శ్శౌర్యశీల–స్సర్వరక్షో హితంకరః
ఫలితోరు తపోవృత్తి–ర్మన స్యేవ మతర్కయత్ ॥

తా॥ అనంతరము ఫలించిన తపస్సులు కల్గిన, శౌర్యశీల సంపదలుకల, సమస్త రాక్షసగణమునకు మేలుచేయు నీలుఁడు మనమున నిట్లు చింతించెను.

శ్లో॥ వితథం బలిన శౌర్యం–శత్రుభీతి మకుర్వతః
కులధర్మ స్సురా న్జిత్వా–కీర్త్యుత్పాదన మేవ నః ॥

తా॥ శత్రువులను భయపెట్టని పరాక్రమము వ్యర్థము. మా కులధర్మము దేవతల జయించి కీర్తినందుచే

శ్లో॥ విచిం త్యేత్య సురాధీశో–దండయాత్రాం వితత్య చ
దూత మేకం సమాహూయ–బభాషే పరభీకరః ॥

తా॥ అని అసుర నాయకుఁడు, శత్రు భయంకరుఁడగు నీలుఁడు తలచి దండయాత్రను నిశ్చయించి ఒక్క దూతను పిలచి యిట్లు పల్కెను.

శ్లో॥ గచ్ఛ దూతామరావాసం–మద్వాచో వద వజ్రిణే
మమ జ్యేష్ఠపితృవ్య శ్చ–రావణో రణకర్కశః ॥

తా॥ ఓ దూతా ! అమరావతికేగి ఇంద్రునితో నా మాటగా చెప్పుము. నా పెదతండ్రియగు రావణుడు యుద్ధమునకతోరుచుడు.

శ్లో॥ పురా యోద్ధుం త్వ మాహూత-స్తేన క్రోధసుసంయుతః
సువయో రభప ద్యుద్ధం-భూరి మాయాస్త్రసాయకైః ॥

తా॥ పూర్వము వానిచే యుద్ధమునకు పిలువ బడిన వాడవై క్రోధమూనితివి నీవు. అప్పుడు గొప్ప మాయాస్త్రములతో మీకు యుద్ధము జరిగెను.

శ్లో॥ భవ న్త మగ్రజో వీర్యా-న్మే ఘనాద స్తదా ఖలు
ఆనయ చ్చ తదా లంకాం-తతో బ్యేత్య పితామహః ॥

తా॥ అప్పుడు నా సోదరుడగు మేఘనాధుడు నిన్ను లంకకుఁ గొనివచ్చెగదా! అప్పుడు బ్రహ్మ సమీపించి

శ్లో॥ విను తేఁంద్రజి దిత్యాఖ్యాం-తస్మై దత్వా మనోరథాన్
ప్రయయౌ మోచయిత్వా త్వాం-వేత్తి సర్వ మిదం భవాన్ ॥

తా॥ ఇంద్రజిత్ అనుపేరుతో పొగిడి అతనికిఅన్ని వరముల నిచ్చి నిన్ను విడిపించివెడలెకదా! ఇదియంతయు గురుతేకదా!

శ్లో॥ తస్మా ద్యోద్ధుం స తే శక్తి ర్దేహి దేవ భవా న్మమ
చింతామణ్యాదికం దివ్య-రత్నజాత మనుత్తమమ్ ॥

తా॥ రావున యుద్ధముచేయ నీకు శక్తి లేదు కాన నింద్రుఁడా! నీవు చింతామణి మొదలగు శ్రేష్ఠమగు దివ్య రత్నములను నాకిమ్ము

శ్లో॥ కామధేనుం చ దేహీతి-దూత స్తత్ప్రహితో యయౌ

తా॥ 'కామధేనువునుకూడానిమ్ము' అని చెప్పగా దూత వెడలెను.

శ్లో॥ అథ గత్వాఽమరావాసం-దదర్శ చ శచీపతిమ్ ॥
మహాద్రిపక్ష విచ్ఛేదన క్షమం బిభ్రతం పవిమ్ ॥

తా॥ అటుపిమ్మట స్వర్గపురికేగి శచీ దేవి భర్త యగు దూత దేవేంద్రునిచూచెను. అతఁడెట్టివాడనిన కొండల రెక్కనూడ్చుటయందు సమర్థమగు వజ్రాయుధము ధరించినవాఁడు.

శ్లో॥ పులోమజాలస ద్వామ-పార్శ్వం నిర్జర సేవితమ్
గంధర్వోద్గీతం-బృహస్పతికృతాశిషమ్ ॥

తా॥ శచీదేవితోఁడ ప్రకాశించు వామభాగము కల వాఁడును అనగా నెడమవైపున శచీదేవి యున్నవాఁడును దేవతలచే సేవింపబడు వాడును, గంధర్వాప్సరో గీతములచే కీర్తింపబడువాఁడును, బృహస్పతిచే నీయబడిన యాశిషములు కలవాఁడును,

శ్లో॥ పశ్యంత మప్సరో లాస్యం-భ్రాజమానం సభాంతరే
తతో నీలాసురే ణోక్తం-కథాయామాస గర్వతః ॥

తా॥ అతఁడు అప్సరాంగనలనృత్యము తిలకించుచు సభా మధ్య మున విరాజిల్లు చుండెను. అంతట దూత గర్వముగా నీలునిచ్చే చెప్పబడినది పలుకజొచ్చెను.

శ్లో॥ శ్రుత్వా దూతేరితం వాక్యం-కోపా దూచేశతక్రతుః
బల పాకాది జంభాద్యా-మ త్కరాశనినా హతాః ॥

తా॥ దూతచేఁ జెప్పఁబడిన వాక్యమునువిని దేవేంద్రుఁడు కోప ముతో నిట్లుపల్కెను. ఓయీ! బలుఁడు, పాకాసురుఁడు, జంభాసురుడు మున్నగువాఁరు నాచేతి యందలి వజ్రాయుధముచేఁ జంపబడిరి.

శ్లో॥ పాతాళే చ భయచ్ఛన్నాః-కేచి త్తే ష్వయ మాసురః
దైత్యేషు కేన వా తుల్యః-స్సంరంభాతిశయోజ్జ్వలమ్ ॥

తా॥ వారిలో కొందఱు రాక్షసులు పాతాళలోకమున దాగి భయముతో నుండిరి. అట్టి రాక్షసులలో నెవరితో నాతఁడు సమానుఁడు? ఆటో పాతి శయముతోఁ ప్రకాశించునట్టి

శ్లో॥ వజ్రం దధానం మా మత్ర-ప్రపశ్యతు పురందరమ్

తా॥ వజ్రాయుధమును ధరించిన దేవేంద్రుడనగు నన్ను యుద్ధ రంగమునఁజూడఁగలఁడు.

శ్లో॥ శతకోటి ప్రహారస్య-శతకోటి సూరారయః
న శక్తా స్సహనే యుద్దే-కీదృశో మే పురోఽసురః ॥

తా॥ వజ్రాయుధపు దెబ్బకు యుద్ధమున వందకోట్ల రాక్షసులకు సహించ శక్యముకాదు. ఇక నిలుఁడన నెట్టివాఁడు?

శ్లో॥ ఉక్త్వా దూతం ససంరంభ-మవాదీ త్పార్శ్వవర్తినమ్
దూతస్య హింసా నోకార్యా-త దస్య కరబంధనమ్ ॥

తా॥ అని సంరభమునఁ బల్కినవాఁడై తన ప్రక్కనున్న వానితో నింద్రుఁడు దూతను హింసించరాదు, కావున వీని చేతులను బంధించి

శ్లో॥ కృత్వా వితనుత క్షిప్రం-శిఖాచ్ఛేద మహంకృతః
శ్రుత్వా చ తే తథాచక్రు-స్స చ ఖేదం పరం గతః ॥

తా॥ వెంటనే ఈ యహంకారికి శిఖ తెగ చేసి 'పొమ్మను' అనెను. అది విని వారట్లేచేసిరి. ఆ దూత మిక్కిలి దుఃఖించెను

శ్లో॥ ఆతుర స్తత్క్షణం గత్వా -ప్రచఖ్యౌ నిలరక్షసే
సచాపి కుపితో ఘోరం-భేరీ నినద భిన్నదిక్ ॥

తా॥ వెంటనే ఆక్షణమే వెళ్లి దూత యాతురకుడై నీలునితోఁ జెప్పెను. ఆతండును కోపగించినవాఁడై భేరీ నినాదములచే దిక్కులన్నింటిని భేదించుచు

శ్లో॥ రథకేతూద్ధ పవన-జాల క్షుభ్య న్నదీజలః
కరస్ఫురిత కౌక్షేయ-రుచిచ్ఛన్న జనేక్షణః ॥

తా॥ రథముల చక్రములచేనెగయు గాలులచే క్షోభచెందు నదీ జలములుకల్గి, సేన చేతులందలి కత్తుల కాంతిచే జనుల కనులఁగప్పు వాఁడై

శ్లో॥ సేనాంగ చరణాఘాత-చూర్ణీకృత గిరిస్థలః
ససైన్యః ప్రస్థల ద్దైత్యైశ్శతమన్యు ముపాద్రవత్ ॥

తా॥ కాల్బలపు పాదఘట్టనచే పొడిపొడి చేయబడిన కొండ ప్రదేశములు కలవాఁడై సేనతో కూడి దీనత వీడి ధైర్యముగా సింద్రుని చేరెను

శ్లో॥ గత్వా విలయకాలోత్థ-మేఘ స్తనిత భీకరమ్
అట్టహాసం చకా రోచ్చై-ర్వివ్యథు ర్ది గధీశ్వరాః
ససైన్యా స్సహసా గత్వా-పరివవ్రు ర్బలాంతకమ్॥

తా॥ ప్రళయకాల మేఘగర్జనతో సమమగు భయంకరమగు నట్టహాసము చేయ దిక్పాలకు లందఱు కలతఁబడి వెంటనే సేనతోఁగూడినవారై వెడలి ఇంద్రుని చుట్టూ చేరిరి.

శ్లో॥ తైస్సమేతః స్ఫుర త్తీవ్ర-ధార వజ్ర లస త్కరః
జగా మాయోధన భువం-జిష్ణుః పార్శ్వగతామరః ॥

తా॥ వారితో కూడినవాఁడై, ఒప్పెడు గొప్పపదునుగల వజ్రాయుధముఁచే ప్రకాశించు చేయికలవాడై, దేవతలు ప్రక్కనఁగూడ జయశీలుఁడగు నింద్రుఁడు యుద్ధభూమికి వెడలెను.

శ్లో॥ అథాదితేయ దైత్యానాం-బభూ వాయోధనం మహత్
జగతాం భయదం భూరి-సింహనాద సమాకులమ్॥

తా॥ అటు పిమ్మట దేవతలకు రాక్షసులకు జగత్తునకు మిక్కిలి భయము కల్గించు, భీకర సింహనాదములతో కూడిన గొప్ప యుద్ధము జరిగెను.

శ్లో॥ తారాః పేతు రథ క్షీణా-వార్ధయ శ్చీతగు ర్భ్రమన్
యయౌ ది క్ష్వపథా త్సూర్య-శ్చచాల చ వసుంధరా ॥

తా॥ అప్పుడు నక్షత్రములు నేలఁబడెను. సముద్రము లింకెను. చంద్రుఁడు భ్రమసెను. సూర్యుఁడు మార్గము వీడి పయనించెను. భూమి సంచలించెను.

శ్లో॥ వవు ర్మహానిలా వేముః-ఫణీంద్రస్య ఫణాజనాత్
ఏవం ప్రవృత్తే తుములే-సంయుగే సుర రక్షసామ్॥

తా॥ ఆదిశేషుని పడగలు వెగముతో మహావాయువుల వ్యాపింపఁజేసెను. ఇట్లు దేవదానవులకు సంకుల సమర మేర్పడగా

శ్లో॥ నిర్మాయ మాయా మసురా-స్సురా న్మగ్నాని వాంబుధౌ
విధాయ మోహితా న్సర్వా-స్సింహనాదా న్ప్రచక్రముః

తా॥ రాక్షసులు మాయను నిర్మించి దేవతలను సముద్రమున మునింగినట్లు మాయలో ముంచి వారు మాయామోహితులుకాగా సింహనాదము లొనర్చిరి.

శ్లో॥ అశక్తాః స్థాతు మమరాః-పలాయంత దిశో భయాత్
మఘవా న్వీక్ష్య సకలా-నమరా న్కోపదీపితః ॥

తా॥ నిలబడు శక్తి లేనివారై దేవతలు భయముతో నలువైపులకుఁ బరుగిడుఁజొచ్చిరి. అట్టి దేవతలనందఱును చూచి ఇంద్రుఁడు కోపముతో కరాడినవాఁడై

శ్లో॥ ఘోరారి భేరీ రవణ-మారుహ్యా ధవళం గజం
ప్రత్యర్థి మర్మ దళనం-కులిశం పాణినా దధత్॥

తా॥ భయంకరమగు శత్రుభేరీ శబ్దములవిని తన తెల్లని యేనుగగు నైరావతము నెక్కినవాఁడై శత్రుకీలకమును భేదించగల వజ్రాయుధమును చేతఁబూని

శ్లో॥ దైత్యానాంగణ హుంకారై-రహంకారం విజృంభయన్
జంభారి రభ్యయా స్నీలం-రయాద్దానవనాయకమ్ ॥

తా॥ రాక్షస సమూహముయొక్క హుంకారములచే నహంకారమును విజృంభింపఁజేయుచు వేగముగా రాక్షస నాయకుఁడగు నీలు నెదుర్కొనెను.

శ్లో॥ అబ్రవీచ్చ సమాసాద్య-రాక్షసాధిపతిం రుషా
మ దాత్మసంభవో వాలీ-త్వ త్పితృభ్రాతరం పురా ॥

తా॥ సమీపించినవాఁడె కోపముతో రాక్షసనాయకుని గూర్చి యిట్లు పల్కెను నా కుమారుఁడగు వాలి పూర్వము నీ తండ్రి సోదరుఁడగు రావణుని

శ్లో॥ లాంగూలరోమ్ణా తం బద్ధ్వా-రావణం వారిరాశిషు
మజ్జయామాస తత్సర్వం-పితృవ్యాన్న శ్రుతం కిము॥

తా॥ తోక వెంట్రుక చేతనే బంధించి సముద్రము లందు ముంచెత్తెను. ఆ వృత్తాంతము నీ పెదతండ్రి నుండి వినలేదా ?
నీల ఉవాచ :-

శ్లో॥ శక్రః త్వా మ్మగహీ ద్యుద్ధే-మేఘనాధో మదగ్రజః
స్వగృహం చానయ ద్బద్ధ్వా-చేంద్రజి ద్బిరుదాంకితః ॥

తా॥ నీలుఁడు పల్కెను. ఇంద్రుఁడా నా సోదరుఁడు మేఘనాధుఁడు యుద్ధమున నిన్ను బంధించి ఇంటికిఁగొని వచ్చి 'ఇంద్రజిత్' అను బిరుదమందెను.

శ్లో॥ ఏత ల్లోకత్రయం వేత్తి-తథా ఇంద్ర ! న లజ్జసే
బల పౌరుష సంఖ్యానో భవన్యపి సముద్ధతః॥

తా॥ ఈ విషయము ముల్లోకములెఱుఁగును. బల పౌరుషాదు లున్నను పూనుకొని యోడితివి. అందుకు సిగ్గు పడుటలేదా? అంత బల పౌరుష ములు కల్గియు

శ్లో॥ జారో గౌతమ జాయాయా-సంగత్యై కుక్కుటీ భవాన్
అకార్షీః ఖలు తే లోకే-విదితం శక్రపౌరుషమ్॥

తా॥ జారుడవగు నీవు గౌతముని భార్యను సంగమింపఁగోడి వైతివికదా! ఇంద్రుఁడా నీ పౌరుషము లోక విదితమే.

శ్లో॥ ఇతి సోల్లుంఠనా ముక్త్వా-సజ్యం కృత్వా స కార్ముకం
నీలో విధాయ ధనుషా-బాణా న్ప్రాయుంక్త వాసవే॥

తా॥ అని పరిహాసములఁబల్కి ధనుస్సు నాయత్తము చేసి నీలుడు ఇంద్రునిపై బాణముల వైచెను.

శ్లో॥ సంఛిత్వా తా నక్షణ్బాణై-ర్ధను శ్చిచ్ఛేద రక్షసః
సోఽ న్యం గృహీతవాం శ్చాపం-బహుధేం ద్రోభినచ్ఛతమ్

తా॥ ఆ బాణములన్నిటి నింద్రుఁడు క్షణములో ఛేదించినవాఁడై నీలుని వింటిని కూడ విరుగవైచెను అతఁడు మఱియొక వింటినిఁగొన వాని నింద్రుఁడనేక రీతులఁ గొట్టెను.

శ్లో॥ నీలోఽథ చంద్రహాసేన-దంభోళిం కుంఠితం వ్యధాత్
తత శ్శచీపతిః కోపా-దవరుహ్య గజా త్సృణిమ్॥

తా॥ అటు పిమ్మట నీలుఁడు చంద్రహాసముతో వజ్రా యుధమును మొక్కవోవునట్లు కొట్టెను. అంతట ఇంద్రుఁడు కోపముతో నైరావతము నుండి దిగి అంకుశమును

శ్లో॥ గృహిత్వా తేన దేవారి-మాజఘాన ఘనధ్వనిః
గదా మాదాయ స తదా-బభం జాంకుశ మాసురః ॥

తా॥ తీసికొని దానితో మేఘధ్వనికల ఇంద్రుఁడు రాక్షసుఁడగు నీలునిఁగొట్టెను. అప్పుడాతఁడు గదను తీసుకొని అంశకుమును త్రుంచెను.

శ్లో॥ శక్రం గృహీత్వా ఖడ్గేన-నీలో హంతుం సముద్యతః
విదిత్వా తత్క్షణా దేత్య-విధిర్బ్రహ్మా సాహసం కురు ॥

తా॥ పిదప దేవేంద్రుఁబట్టి కత్తితోఁజంప నీలుఁడు సమకట్టిన వాఁడు కాగా నెఱిఁగి యాక్షణముననే బ్రహ్మదేవుఁడువచ్చి నీల, సాహసించవద్దు.

శ్లో॥ ఇత్యుక్త్వా తత్కరం రుద్ధ్వా-తరసాత మవోచత
నీల నిశాపతే ర్భక్తో-జనక స్తే విభీషణః ॥

తా॥ అని పల్కి వానిచేతనాపి వెంటనే వానితో నిట్లనెను. ఓ నీలుఁడా! నీ తండ్రియగు విభీషణుఁడు విష్ణుదేవునకు భక్తుఁడు.

శ్లో॥ ముకుందస్యాగ్రజ శ్చాయం-మహేంద్రః శ్రుణు మే వచః
మైత్రీం విధాయ విపులాం-త్వ మనేన పవింత్యజ ॥

తా॥ ఈ ఇంద్రుఁడా విష్ణువున కగ్రజుఁడు. కాన నా మాట వినుము. ఈ తనితో మిక్కిలి స్నేహముచేసి వజ్రాయుధమును వీడుము.

శ్లో॥ చింతామణిం కల్పతరుం-కామధేను మహం చ తే
ప్రదాస్యే దేవరాజేన-మైత్రీయుక్త స్సదా భవ ॥

తా॥ చింతామణిని, కల్పవృక్షమును, కామధేనువును నీకు నేనిచ్చెదను ఎల్లప్పుడు దేవేంద్రునితో స్నేహము కలవాడవైయుండుము.

శ్లో॥ అన్యచ్ఛ శ్రుణు వక్ష్యామి-విభీషణవరాత్మజః
పూర్వం హిమాచలే త్వం-చచా రాత్రి ర్మహ త్తపః ॥

తా॥ విభీషణుని యుత్తమ పుత్రుఁడా! వేఱొకటి చెప్పుచున్నాను. వినుము. పూర్వము మహాతపస్సంపన్నుఁడగు నత్రి మహాముని హిమావల పర్వతమున మిక్కిలి సంచరించెను.

శ్లో॥ తన్నేత్రా దుదభూ చ్చైకం-దివ్యం తేజ స్తపోమయం
తద్వై వృక్షేషు బహుధా-జర్జరం మారుతః స్వయమ్ ॥

తా॥ అతని నేత్రములనుండి యొక తపోమయమగు దివ్య తేజస్సు వెలువడెను. అదియె వృక్షములందుఁ బెక్కు రీతుల వ్యాపించెను. అట్టిదానిని స్వయముగా వాయువు

శ్లో॥ రాశిద్వయం చకారాథ-చంద్ర స్తత్రైకరాశితః
సౌందర్యైకనిధి ర్జజ్ఞే-ద్వితీయా ద్రాశిత స్తతః ॥

తా॥ రెండు రాసులుగాఁజేసెను. అందొక రాశినుండి సౌందర్య నిధియగు చంద్రుఁడుద్భవించెను. పిమ్మట రెండవ రాశినుండి

శ్లో॥ త్రిలోకకన్యకా శ్రేష్ఠా-కన్యా చ వనసుందరీ
ఓషదీశ స్తతో జాత-శ్శంభో ర్మూర్ధని భూషణమ్

తా॥ ముల్లోకములందలి కన్యకలకంటె శ్రేష్ఠమగు వనసుందరీ కన్య యుద్భవించెను. అటు పిమ్మట చంద్రుండు శివుని శిరోభూషణ మయ్యెను.

శ్లో॥ మధునావర్ధయత్తాం తు-కన్యకాం వనసుందరీమ్
దుహితృత్వం గతా తస్య-ప్రాప్య సంపూర్ణ యౌవనమ్॥

తా॥ అతనిచే నీ వనసుందరీ కన్య మధువుచే పెంచెను. అట్టి యామె కూతురనమునంది సంపూర్ణమగు యౌవనం నంది

శ్లో॥ అతులేన చకోరాక్షీ-సౌందర్యేణ విరాజతే
తాం చ దేవీం ప్రదాస్యామి-చింతామణ్యాదిభి స్సహ॥

తా॥ సాటిలేని సౌందర్యముతో, ప్రకాశించుచున్నది. ఆమెను కూడఁ జింతామణ్యాదులతో నీకీయగలను.

శ్లో॥ భవతోపాసితా విద్యా-సర్వసింహాసనేశ్వరీ
శ్రీరామ సచివాగ్రస్య-సాక్షా చ్ఛ్రీహనుమత్ప్రభోః ॥

తా॥ నీచే సమస్త విద్యలకు రాజ్ఞియనదగు రామభక్త శ్రేష్ఠుఁడగు శ్రీ హనుమత్ప్రభువుని మంత్ర ముపాసింపబడినది.

శ్లో॥ వ్రతం కృతం హనుమతో-నక్షత్రే మృగశీర్షకే
అస్మదాదిభి రభ్యర్చ్య-స్తేనాసి సుమహామతే ॥

తా॥ ఆ హనుమద్వ్రతము మృగశీర్షా నక్షత్రమునఁ జేయబడినది. అందుచే నో బుద్ధిమంతుఁడా! మా బోంట్ల చేతను నీవర్చింపదగిన వాఁడ వైతివి.

శ్లో॥ రహస్య మన్య ద్వక్ష్యామి-సద్య స్సకలసిద్ధిదమ్
మయా నోక్త మితఃపూర్వం-యస్యకస్యాపి సువ్రత ॥

తా॥ సువ్రతుఁడవగు నీలుఁడా! వెంటనే సకలము సిద్ధించు రహస్యమగు వేఱొకదానిని చెప్పుచున్నాను. ఇది యింతకుపూర్వమెవ్వరికిని నాచేఁజెప్పబడలేదు.

శ్లో॥ మాఘే శ్రీ రుద్రదైవత్యే-ఫాల్గునేఽ దితిదైవతే
చైత్రే పుష్యేఽ ర్కనక్షత్రే-పూజయే ద్ధనుమత్ప్రభుమ్ ॥

తా॥ మాఘమాసమున రుద్రదేవతాకమగు నార్ద్రా నక్షత్రమునను, ఫాల్గునమాసమున నదితి యధిష్ఠాన దేవతగాఁగల పునర్వసు నక్షత్రమందు చైత్రమాసమున పుష్యమి నక్షత్రమున - పుష్యమీ నక్షత్రాధి దేవత బృహస్పతి అందే సవితృ దేవతాకమగు హస్తనక్షత్రమునను హనుమత్ప్రభువుని పూజసల్పవలెను.

శ్లో॥ జ్యేష్ఠమా స్యథవా కుర్యా-ద్వ్రతం నక్షత్రపంచకే
పూర్వోక్తస్యైవ తోరస్య-పూజాం కుర్యా ద్దినేదినే ॥

తా॥ లేకున్న జ్యేష్ఠమాసమునందు పై మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, హస్త అను నక్షత్ర పంచకమందును నీ వ్రతము సేయనగును. పై వ్రత సంబంధి తోరమునే దినదినముఁ బూజింపనగును.

శ్లో॥ ఏతభుక్తో హ్యథశ్శాయీ–బ్రహ్మచారీ జితేంద్రియః
జపే దష్టోత్తరశతం–పంచవక్త్రి మహామనుమ్ ॥

తా॥ ఒక్కపూటే తినుట, నేలపై పరుండుట ఇంద్రియజయుఁడై బ్రహ్మచర్యనిష్ఠ నుండుటతో పంచవక్త్రి హనుమన్మహామంత్రమును నూటి యెనిమిది పర్యాయములు జపించనగును.

శ్లో॥ యంకంచిదపి తన్మంత్రం–జపే త్సర్వదినే ష్వపి
విప్రేభ్యః పంచసంఖ్యేభ్యో–దద్యా ద్వాయన ముత్తమమ్ ॥

తా॥ ఎంతయైన నా మంత్రము ప్రతిదినము జపించవలెను. ఐదుగురు బ్రాహ్మణులకు చక్కగా దానమీయవలెను.

శ్లో॥ అపూపపంచకం నీల–ఫలపంచక సంయుతమ్
ఆచార్యం పూజయే త్పశ్చా–ద్విత్తశాఠ్య వివర్జితః ॥

తా॥ నీలుఁడా! ఆ వాయనమును ఐదైదు అప్పములతోను, ఐదైదు పండ్లతోను ఈయవలెను. పిదప ధన లోపము చేయక గురువును పూజించ వలెను.

శ్లో॥ పూజయే ద్వటుకా న్పంచ–బ్రాహ్మణానపి భోజయేత్
అస్మిన్వ్రతే కృతే సాక్షా–ద్ధనూమత్కథయాఽ న్వితే ॥

తా॥ ఐదుగురు బ్రహ్మచారులను పూజించి తగినంత బ్రాహ్మణ సమారాధన సేయవలెను. సాక్షాత్తు హనుమంతుని కథతో కూడఁజేయు నీ వ్రతమువలన

శ్లో॥ ఆయురారోగ్య మతులం–ధనధాన్యాది సంపదః
విజయః పుత్రపౌత్రాశ్చ–సౌభాగ్య మమలం శుభమ్॥

తా॥ ఏనలేని యాయురారోగ్య ధనధాన్యాది సంపదలేర్పడును. విజయము సిద్ధించును. పుత్రపౌత్రాదులు కల్గి మంగళకరమగు సౌభాగ్యము చేకూరును.

శ్లో॥ కిముక్తేనాథ బహునా-సర్వసిద్ధి ర్భవిష్యతి
తస్మా త్త్వం కురు యత్నేన-ప్రహ్మ మేత దనుత్తమమ్ ॥

తా॥ ఇంకఁ జెప్పు మాటలేల? దీని వలన సర్వము సిద్ధించును. కావున నీవు జాగరూకుఁడవై శ్రేష్ఠమగు నీ వ్రతము నాచరింపుము.

శ్లో॥ భవిష్యతి మహాసిద్ధి-స్సతతం విజయప్రదా
శతవర్ష సహస్రాణి-భుక్త్వా భోగా న్మనోరథాన్ ॥

తా॥ ఎల్లప్పుడు విజయము చేకూర్చు మహాసిద్ధి యేర్పడఁగలదు. అనేకవేల వందల సంవత్సరములు వలయుఁ గోర్కెలను, భోగములను ననుభవించి

శ్లో॥ ఏకాంశేనాపి వైకుంఠే-భగవ త్కింకరాగ్రణీః
నీలాద్రిరితి విఖ్యాతం-క్షేత్రం శ్రీపురుషోత్తమమ్ ॥

తా॥ ఒక్క యంశతో వైకుంఠమునందు భగవత్కింకరులలో శ్రేష్ఠుఁడవౌదువు. వేఱొకయంశతో నీ 'నీలాద్రియ'ని జగద్విఖ్యాతిఁగన్న పురుషోత్తమక్షేత్రమున

శ్లో॥ జగన్నాథ ప్రియో భూత్వా-చైకాంశేన మహీతలే
దర్శనా న్ముక్తిదో నౄణాం-సుందర్యాసహ సంతతమ్ ॥

తా॥ భూలోకమున విష్ణుప్రియుఁడవై ఎల్లప్పుడు వనసుందరీ సమేతుఁడవై చూచుటచేతనే ముక్తి నిచ్చుచూ నుందువు

శ్లో॥ కీర్తి స్తే లోకవిఖ్యాతా-భవిష్యతి న సంశయః॥

తా॥ నీకు జగత్ప్రసిద్ధమగు కీర్తి రాగలదు.

శ్లో॥ ఇత్థం బహూ న్వరా ల్లబ్ధ్వా-నీలో రత్నాదిభిస్సహ
భుక్త్వా భోగా న్మహాయోగీ-భగవచ్ఛంకరోఽభవతే ॥

తా॥ ఇటుల ననేక వరములనంది నీలుం రత్నములతోఁగూడి భూలోకమున భోగములననుభవించి భగవచ్ఛంకరుఁడయ్యెను.

శ్లో॥ ఇత్యుక్తో గార్గ్యమునినా-సోమదత్తో మహీపతిః
పత్న్యాసార్ధం మహావిద్యాం-పంచవక్త్రహనూమతః ॥

తా॥ ఈః రీతిగా గార్గ్యమహామునిచే-సోమదత్తుడు పంచవక్త్ర హనూమత్సంబంధమగు మహావిద్యను భార్యాసహితుఁడై చెప్పఁబడినవాఁడై

శ్లో॥ గురో స్సమీపే కృత్వాథ-వసన్ తద్వ్రత ముత్తమమ్
సంప్రాప్య సద్య శ్చాయుష్మాన్-కందర్పసమ రూపవాన్ ॥

తా॥ గురు సమీపమునసేయుండి యాయుత్తమ వ్రతము నానర్చినవాఁడై వెంటనే యాయుష్మంతుడు, మన్మథసమానమగు రూపము కలవాఁడు నగు నతఁడు

శ్లో॥ హనూమతః ప్రసాదేన-ఖడ్గసిద్ధి మవాప్తవాన్
తత స్సమస్తాఁగణా-నేకాహ్నై వ విజిత్య చ॥

తా॥ హనుమదనుగ్రహముచే ఖడ్గసిద్ధినందినవాఁడాయెను. ఆటు పిమ్మట ఒక్క పగటియందే సమస్త శత్రువులను జయించి

శ్లో॥ స్వరాజ్యం పాలయామాస-గార్గ్యం కృత్వా పురోహితమ్
స్వర్ణ కోటి సహస్రాణి-తస్మా ద్గార్గ్యో మహామునిః ॥

తా॥ గార్గ్య మహామునిని పురోహితునిగాఁ జేసికొని తన రాజ్యమును పాలింపజొచ్చెను. అందుచే గార్గ్య మహాముని కోటి సహస్రముల బంగారునాణెములు

శ్లో॥ సంప్రాప్త వర్ష సాహస్రం-సత్రయాగి మథాకరోత్
శప్తద్వీపవతీం ధాత్రీం-గార్గ్యానుగ్రహముతో నృపః ॥

తా॥ పొంది వేయి సంవత్సరములు సత్రయాగము చేసెను. గార్గ్యానుగ్రహమువలన రాజగు సోమదత్తుఁడు సప్తద్వీపపతియగు భూమిని

శ్లో॥ పాలయామాస ధర్మాత్మా, త్రింశ ద్వర్ష సహస్రకమ్
అష్టాన్ పుత్రా నవాప్యాథ-జ్యేష్ఠం రాజ్యేఽ భిషిచ్య చ ॥

తా॥ మూడువందల సంవత్సరములు ధర్మాత్ముఁడై పాలించెను. ఎనమండుగురు పుత్రులనుఁబడిసినవాడై పెద్దకొడుకుని రాజ్యాభిషిక్తునిచేసి

శ్లో॥ బ్రహ్మలోక మవా పాంతే-పత్న్యాసహ మహాయశాః
హనుమతో వ్రత స్యైవం-ప్రభావో మునిపుంగవ ॥

తా॥ చివరకు నాకీర్తివంతుఁడు భార్యతోఁగూడినవాఁడై బ్రహ్మలోకమందెను. ముని శ్రేష్ఠుఁడవగు మైత్రేయా! హనుమంతుని వ్రతము యొక్క ప్రభావమిట్లుండును.

శ్లో॥ శ్రుతోవా పఠితో య్యై శ్చ-సర్వదా విజయప్రదః
అథాపరం ప్రవక్ష్యామి-సర్వ వ్రతఫల ప్రదమ్ ॥

తా॥ ఈవ్రతమును విన్నను, పఠించినను ఎల్లప్పుడు విజయము నిచ్చును. ఇఁక సర్వవ్రతముల ఫలమునిచ్చు వేఱొక వ్రతమును చెప్పు చున్నాను.

శ్లో॥ వ్రతం హనుమతో గోప్యం-సద్యో విజయసిద్ధిదమ్
ఆదిత్యహస్తానక్షత్రే-పూర్వవ త్ప్వాజయే ద్విభుమ్ ॥

తా॥ ఈ హనుమద్వ్రతము రహస్యమైనది, వెంటనే సిద్ధినిచ్చునది కూడ. ఆదివారముతో కూడిన హస్త నక్షత్రమున వెనుకటి రీతిగనే హనుమత్ప్రభు నర్చింపనగును.

శ్లో॥ ఫలాశివా హవిష్యాశీ-క్షీరాహారోథ వా మునే!
పూర్వోక్తాం ముద్రికాం స్పృష్ట్వా-మను మేకశతంజపేత్ ॥

తా॥ మైత్రేయమహాముని: పండ్లనుగాని, హవిస్సునుగాని, పాలను గాని యాహారముగఁగొనుచు వెనుక తెలిపిన ముద్రిక ధరించి వందమార్లు మంత్రమును జపించనగును.

శ్లో॥ తోరంతు గ్రథితం ధృత్వా-యద్వా యజ్ఞోపవీతకే
కృత్వా. శూద్రాది సంస్పర్శ-రహితం సాధకోత్తమః ॥

తా॥ తోరమును కట్టుకొని ధరించి లేదా జందెమున నుంచుకొని సాధకుఁడగువాడు శూద్రాదుల స్పర్శలేని వాఁడై

శ్లో॥ ఆదిత్య హస్తా నక్షత్రే-ముద్రికాం పూజయే త్సదా
వర్షే సమాప్తే తోరం తు ధారయే దన్య దుత్తమమ్ ॥

తా॥ సవితృ దేవతాకమగు హస్తానక్షత్రమందెప్పుడు ముద్రికను పూజించవలెను. సంవత్సరము పూర్తికాగా వేఱొక క్రొత్తతోరమును ధరించవలెను.

శ్లో॥ స్వర్ణవేష్టిత పూర్వోక్త-ముద్రి కైకై వ సంతతమ్
అస్పృష్టాధారయే ద్యస్తు-శూద్రాద్యైస్సతతం నరః ॥

తా॥ వెనుక చెప్పిన బంగారముతో చుట్టబడిన ముద్రిక నొక్క దానినే జపించు నరుఁడు శూద్రాదులతో నెప్పుడు తాకబడని దానినే ధరించ వలెను.

శ్లో॥ హస్తార్కే కురుతే యస్తు-వ్రత మేత దనుత్తమమ్
పరేద్యుర్వాయనం దద్యా-దుర్గంసపూజ్యయత్నతః ॥

తా॥ ఆదివారమునవచ్చు సవితృ దేవతాకమగు హస్తా నక్షత్ర మున నీ వ్రతమును చేయువాఁడు ప్రయత్నపూర్వకముగ గురుపునర్చించి వాయనమీయనగును. అట్లిచ్చినవాఁడు

శ్లో॥ హనుమత్కథయా యుక్త – స్సతతం విజయీభవేత్
ధన ధాన్యాకులాం లక్ష్మీం-పుత్ర పౌత్రయుతా మపి ॥

తా॥ హనుమత్కథ జెప్పుకొన్నవాఁడై యెల్లప్పుడు విజయము నందువాఁడగును. ధనధాన్య సమృద్ధి, పుత్రపౌత్రాదికమును

శ్లో॥ అవాప్య శక్ర సంకాశో-నృపాన్నారీన్నరాధికాన్
దాస భూతా న్కరోత్యేవ- ప్రాణైరపి ధనైరపి ॥

తా॥ పొంది దేవేంద్ర సమముగ నున్నవాఁడై రాజులను స్త్రీలను, నరాధిపులందఱిఁ దమ ప్రాణధనములతోసహ దాసులుగఁజేసికొనును.

శ్లో॥ దీర్ఘ మాయుష్య మారోగ్యం - వాక్సిద్ధిం విపులా మపి
అవాప్య మహతీ మృద్ధిం - భుక్త్వా భోగా న్మనోరథాన్ ॥

తా॥ దీర్ఘాయువును, ఆరోగ్యమును, గొప్ప వాక్సిద్ధిని గొప్ప సమృద్ధినంది సకలభోగములననుభవించి కోర్కెల నన్నిటిఁబొంది

శ్లో॥ అంతే శ్రీ తారకం బ్రహ్మన్ లబ్ధ్వా ముక్తో భవే న్నరః
అష్టాక్షరేణ వా కుర్యా - ద్యేనకేనాపి వా మునే ! ॥

తా॥ చివరకు పరమున తారక బ్రహ్మమునంది ముక్తుఁడగును. ఓ మైత్రేయ మహాముని! ఈ హనుమద్వ్రతమును అష్టాక్షరి మంత్రముతోఁ జేయనగును.

శ్లో॥ మంత్రరాజేన వా కుర్యా - ద్యేనకేనాపి వా మునే
పురా పార్థో మహాబాహు - ర్జునః కృష్ణ సారధిః ॥

తా॥ ఏ శ్రేష్ఠమగు హనుమన్మంత్రముతో నయినఁజేయనగును. పూర్వము శ్రీకృష్ణుఁడు రథసారథిగాఁ గల మహా బాహుండగు నర్జునుఁడు

శ్లో॥ హస్తాదిత్యవ్రతం కృత్వా - ప్రజ ప్యాష్టాక్షరం మనుమ్
అతుల్యం బలమాసాద్య - విజయం ప్రాప్త సంతతమ్ ॥

తా॥ హస్తాదిత్య వ్రతమాచరించి యష్టాక్షర మంత్రమును జపించి సాటిలేని బలమునంది యెల్లప్పుడు విజయమును పొందెను.

శ్లో॥ నక్షత్ర పంచకే కృత్వా-కృత్వా హనుమతః పరం
భీమసేనో మహాబహు-ర్జితవా న్సకలా నరిన్ ॥

తా॥ భీమసేనుఁడు మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, హస్తల యైదు నక్షత్రములందు హనుమద్వ్రతముచేసి సమస్తములగు శత్రువుల జయించెను.

శ్లో॥ కే వా న పూజయంతీహ-ప్రత్యక్ష వరదాయకమ్
అర్చయంతి హనూమంతం-బ్రహ్మ విష్ణు శివా అపి

తా॥ ప్రత్యక్షముగనే వరప్రదాతయగు నా మహనీయునిఁ బూజించనిది యెవరు? ఆ హనుమంతుని బ్రహ్మ, విష్ణు, శివాదులుసైతము నర్చించుచున్నారు.

శ్లో॥ హనుమ త్సదృశం దైవం-నాస్తి నాస్త్యేవ భూతలే
అనేనైవ ప్రమాణేన-జయసిద్ధికరం పరమ్

తా॥ హనుమంతునితో సమానమగు దెవతమీ భూతలమునకు లేనేలేదు. ఈ ప్రమాణమే హనుమద్వ్రతమే శ్రేష్ఠమగు జయసిద్ధినిదునది యని తెల్పును.

శ్లో॥ తస్మి న్సంపూజితే భాను ర్బ్రహ్మా గౌరి మహేశ్వరః
శ్రీ జానకీపతి స్సాక్షా-న్నారాయణః ప్రభుః ॥

తా॥ శ్రీ హనుమంతుడు పూజింపబడుటవలన సూర్యుడు, బ్రహ్మ, గౌరి, మహేశ్వరుడు, జానకీ పతియగు శ్రీరాముడు, సర్వ సమర్థుఁడగు సాక్షాన్నారాయణుఁడు,

శ్లో॥ ఈశ శక్రాది దిక్పాలాః-కుమారో గణనాయకః
బ్రహ్మర్షయో వశిష్ఠాద్యా-స్సనకాద్యాశ్చ యోగినః ॥

తా॥ ఈశాన, దేవేంద్రాది దిక్పాలురు, కుమార స్వామి, వినాయకుడు, వశిష్ఠాది బ్రహ్మర్షులు. సనకాది యోగులు,

శ్లో॥ పితరో వసవో రుద్రాః-పూజితాస్యు ర్న సంశయః

తా॥ పితరులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు అందఱు పూజింపబడుదురు. అనగా హనుమత్పూజ చేసిన పై వారందఱిని పూజించినట్లే.

శ్లో॥ హనూమంతం మహాత్మానం-జయకామః ప్రపూజయేత్
తస్మా త్సర్వప్రయత్నేన-శ్రీరామ ప్రియకింకరమ్ ॥

తా॥ అందుచే జయమునుకోరువాఁడు మహాత్ముఁడు, శ్రీరామ ప్రియసేవకుఁడగు హనుమంతుని సప్రయత్నుఁడై పూజింపనగును.

శ్లో॥ య ఇదం శృణుయా న్నిత్యం-శ్రావయేద్వా సమాహితః
స లబ్ధ్వా సకలాభీష్టాన్-బ్రహ్మలోకే మహీయతే ॥

తా॥ ఎవ్వఁడు నిత్యము దీనిని వినునో, లేక శ్రద్ధతో వినిపించునో అతఁడు సమస్తములగు గోర్కెలు పొంది బ్రహ్మలోకము నందును.

శ్లో॥ చంద్రహీనా యథా రాత్రి-ర్ధనహీనో యథా నృపః
వృథా ప్రబంధో హనుమ-న్నామహీన స్తపోధన॥

తా॥ చంద్రుఁడులేనిరాత్రి, ధనములేనిరోజువలె నూ మైత్రేయా! హనుమన్నామములేని ప్రబంధము వ్యర్థమగును.

శ్లో॥ మైత్రేయ నీల విజయ ధ్వ జద త్తగాల
మైం దాంగదాంశ్చ విజయం భరతం సుషేణం
హారిత కశ్యప సుపుష్కర సోమదత్తాన్
పుణ్యాం స్మరామి హనుమత్పదపద్మ భక్తాన్ ॥

తా॥ మైత్రేయా! హనుమద్భక్తులు, పుణ్యమూర్తులగు సిబి, విజయ ధ్వజదత్త, గాల, మైంద, అంగద, భరత, సుషేణ, హారీత, కశ్యప పుష్కర, సోమదత్తులను స్మరించుచున్నాను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖ హనుమన్మంత్ర
వివరణే పరాశరమైత్రేయ సంవాదే సోమదత్త సింకథనం
నామ పంచమః పటలః

ఓం

శ్రీ హనుమతేనమః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

## షష్ఠః పటలః

## హనుమజ్జన్మ కథనము

మైత్రేయః

శ్లో॥ భగవన్హనుమన్మంత్ర-ప్రభావో భవత శ్రుతః
తస్యోత్పత్తిం స్వరూపం చ-శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ॥

తా॥ ఓ మహానుభావా? తమవలన హనుమన్మంత్ర ప్రభావము వింటిని. నేను ఆ హనుమంతుని జననమును, స్వరూపమును కూడ వినగోరుచున్నాను.

శ్లో॥ హనుమన్నామ వాకోఽసౌ-కస్య పుత్ర స్స కీదృశః
కిం కర్మా తస్య చోత్పత్తిః-కథం బ్రహ్మ న్వదస్వ మే ॥

తా॥ హనుమంతుడను పేరుగల యాతడెవరు? ఎవరి కుమారుడు? ఆతడెట్టివాడు? ఏమి చేయువాడు? ఓ మునీంద్రా అతని జనన మెట్టిదియో చెప్పుము.

పరాశరః

శ్లో॥ ఇతిహాసం పురా వక్ష్యే-మైత్రేయ శ్రుణు తత్త్వతః
ఛాయా నామ మహాసాధ్వీ-తనూజా విశ్వకర్మణః ॥

తా॥ మైత్రేయా! పూర్వము జరిగిన విషయమును చెప్పు చున్నాను. శ్రద్ధతోవినుము. విశ్వకర్మకు మహాసాధ్వియగు ఛాయ యను పేరుగల కుమార్తెకలదు.

శ్లో॥ స తాం దదౌ భాస్కరాయ-సా న సేహే రవేః ప్రభామ్
మాత్రా పృష్టాఽవద త్కన్యా-దుర్గమః పతి సన్నిధిః ॥

తా॥ ఆ విశ్వకర్మ ఆమెను సూర్యునకిచ్చి వివాహము చేసెను. ఆమె సూర్యుని తేజస్సును సహింపలేకపోయెను. అంత తల్లిచే అడుగ బడినదై, పతికడ తా నుండలేని రీతిని చెప్పెను.

శ్లో॥ మాత ర్మమాభూ దధునా-తస్య తీక్ష్ణకరేణ వై
పుత్రికా వచనం శ్రుత్వా-సా వచత్స్వపతేః ప్రసూః ॥

తా॥ సూర్యుని తీక్ష్ణములగు కిరణములకు నిలువలేకున్నా నను కొనిన కుమార్తె మాటలను విని ఛాయాదేవి తల్లి భర్తతో చెప్పెను.

శ్లో॥ భార్యాయా వచనం శ్రుత్వా-విశ్వకర్మా ప్రభాకరమ్
శాణత స్తం స్వల్పప్రభం-చక్రే స కర దీధితమ్ ॥

తా॥ భార్యమాటను విన్నవాడై విశ్వకర్మ సూర్యుని సానబట్టిన వాడై తక్కువ తేజస్సుకలవానినిగా చేసెను.

శ్లో॥ భానోచ్ఛిన్నకరచ్ఛాయా-త్కన్యా జాతా సువర్చలా
బ్రహ్మాదయో లోకపాలా-స్తత్సౌందర్యా ద్విసిష్మిరే ॥

తా॥ సూర్యునినుండి వేరైన కిరణములనుండి సువర్చలయను కన్య పుట్టెను. బ్రహ్మాదిదేవత లందఱు నామె సౌందర్యమున కాశ్చర్య చకితులైరి.

శ్లో॥ బ్రహ్మాణం పరి పప్రచ్ఛు-ర్దేవా ఇంద్ర పురోగమాః
ఏనాం ధృత్వా పతిః కోవా-భూయా ద్బ్రహ్మన్వదస్వ నః ॥

తా॥ ఇంద్రుని ముందుంచుకొని దేవతలు బ్రహ్మవద్దకేగి "ఓ బ్రహ్మదేవా! ఈమెకు భర్త యెవ్వరు కాగలరు? మాకు చెప్పవలసినది" అని యడిగిరి.

బ్రహ్మోవాచ
శ్లో॥ ఈశ్వరస్య మహత్తేజో-హనూమా న్దివి భాస్కరమ్
ఫలబుద్ధ్యాతు గృహ్ణీయాత్-తస్య భార్యా భవిష్యతి ॥

తా॥ బ్రహ్మ ఇట్లనెను- 'పరమేశ్వరుని మహత్తేజమగు హనుమంతుడు ఆకాశమున సూర్యుని పండు అనుకొని పట్టుకొనగలడు. ఆ హనుమంతున కీమె భార్య కాగలదు' అని దేవతలందఱు వెళ్ళిరి. పిమ్మట-

శ్లో॥ రాక్షసైః పీడితా దేవా-బ్రహ్మాణం శరణం యయుః
బాధంతే రాక్షసా నిత్యం-బ్రహ్మ న్లోకా నృషీంశ్చ నః ॥

తా॥ దేవతలు రాక్షసులచేత బాధింపబడినవారై బ్రహ్మను శరణు వేడి ఇట్లనిరి- ఓ బ్రహ్మదేవా, ప్రతి క్షణము రాక్షసులు లోకములను, ఋషులను, మమ్ము పీడించుచున్నారు.

శ్లో॥ తేషాం కురు వధోపాయం-త్వం హి నః పరమాగతిః
ఇత్యుక్తః ప్రాహతా న్దేవాన్-మయా న జ్ఞాయతే వధః ॥

తా॥ వారు నాశనమగు నుపాయము చేయుము. మాకు నీవే కదా దిక్కు- అనగా వారితో బ్రహ్మదేవు డిట్లనెను. "దేవతలారా వారిని వధించు నుపాయము నాకు తెలియదు.

శ్లో॥ శంకరం పరిపృచ్ఛామో గచ్ఛామో రజతా చలం
తత్ర గత్వా మహాదేవ-మూచు స్తే స పితామహాః ॥

తా॥ కైలాసమునకు పోవుదము. శంకరు నడుగుదము" అని, అంత వారు బ్రహ్మతో కూడినవారై కైలాసమున కేగి పరమేశ్వరుని

శ్లో॥ రాక్షసానాం వధోపాయం-కురు రుద్ర మహాప్రభో ॥

తా॥ "ఓ మహానుభావా! రాక్షసులను వధించు నుపాయము మాకు చెప్పుము" అని యడిగిరి.

శంకర ఉవాచ

శ్లో॥ నర నారాయణం దేవ-మార్తానాం చ పరాయణమ్
తిష్ఠంతం పరమక్షేత్రే-నిత్యం బదరికాశ్రమే
తం పృచ్ఛామః సురశ్రేష్ఠా- గచ్ఛామ స్తత్ర మాచిరమ్॥

తా॥ శంకరుడు పల్కెను- "ఓ దేవతాశ్రేష్ఠులారా! ఉత్తమ స్థలమగు బదరికావనమున నిత్యముండునట్టి, శరణాగత రక్షణమే ప్రధాన మగు దేవుడు నరనారాయణు నడుగుదము త్వరగా వెళ్ళుదము" అనిన అంత-

శ్లో॥ బ్రహ్మేశాది సురా స్సర్వే-నరనారాయణప్రభుమ్
నమస్కృత్య జగన్నాథం-ప్రపచ్ఛు రిద మాదరాత్ ॥

తా॥ బ్రహ్మ, ఈశ్వరుడు మున్నగు దేవత లందఱు జగన్నాథుడగు నరనారాయణ ప్రభువునకు నమస్కరించినవారై ఆదరముతో నిట్లు పల్కిరి-

శ్లో॥ బాధంతే రాక్షసానిత్యం-నరనారాయణప్రభో
ఏ తేషాం తు వధోపాయం-క్షిప్రం కర్తుమిహార్హసి ॥

తా॥ ఓ నరనారాయణప్రభూ! రాక్షసులు మమ్ము నిత్యము బాధించుచున్నారు, వెంటనే నీవు వారిని చంపు సుపాయము చేయవలయును అనగా

శ్లో॥ సముహూర్తమివధ్యాత్వా-ప్రోవాచ సకలాన్సురాన్
భవిష్యతి నసందేహో - రాక్షసానాం వధ స్సురాః॥

తా॥ నరనారాయణుండు ఒక్కక్షణకాల మాలోచించి 'దేవత లారా! రాక్షసనాశము తప్పక జరుగును సందేహములేదు'. అని దేవతలతో చెప్పెను.

శ్లో॥ ఇత్యుక్త్వా స్వాత్మనస్తేజ-స్స మాకృష్య జనార్దనః॥
బ్రహ్మణశ్చ సురాణాంచ-తేజసా సాక మీశితుః॥

తా॥ అట్లు చెప్పినవాడై జనార్దనుడు బ్రహ్మయొక్క దేవతల యొక్క తేజస్సులతో తన తేజస్సును సంగ్రహించినవాడై

శ్లో॥ పిండీకృత్యదదౌరుద్రం-పపోసర్వ్యామరాత్మకమ్
అథోవాచ హరి వ్యక్తి-రేతత్తేజోద్భవస్సురాః॥

తా॥ ముద్దగాచేసి ఈశ్వరునకిచ్చెను. దాని నీశ్వరుడు మింగెను. అంత విష్ణువు దేవతలారా ఈ తేజస్సునుండియే బలవంతుడగు వానరుడు పుట్టును.

శ్లో॥ హరం త్యక్త్వాసు రా స్సర్వే-గచ్ఛతేతి యథా గతమ్॥

తా॥ శివునివీడి మీరందరు వెళ్ళి పోవలసినది అనెను.

శ్లో॥ తతఃకాలే మహాదేవః-పర్యట న్పృథివీ మిమాం
పార్వతీసహిత శ్శ్రీమాన్-వేంకటాఖ్యం గిరిం గతః॥

తా॥ అనంతరకాలమం దీశ్వరుడు భూమండలమంతయు పర్యటించుచున్నవాడై పార్వతితో కూడి వేంకటాచలమును చేరెను.

శ్లో॥ నిత్యం సన్నిహితోయత్ర-శ్రీనివాసస్సతాం గతిః
లభంతే పౌరుషానర్థాన్-యస్మిన్పండి తపామరాః॥

తా॥ ఆపరత్వము సత్పురుషులకు శరణ్యుడగు శ్రీనివాసు డెల్లప్పుడు నుండునది. అందు పండితులు మొదలు పామరులు సైత మాదేవుని యనుగ్రహముచే కోర్కెలు పొందుచుందురు.

శ్లో॥ తౌ తత్ర దంపతీచైకే-శేషాఖ్యే చిత్రకాననే
శేరతుః పరమామోదే-నిర్మలోద సద్వనే॥

తా॥ ఆదంపతు లిర్వురు అట్టి శేషశైలమునందు చిత్ర వనమున మిక్కిలి ఆనందము కల్గించు స్వచ్ఛజలములతోడి సరస్సులు కలచోట కొంతకాలము విశ్రమించిరి.

శ్లో॥ ఏకదా పరమప్రీతా-పార్వతీ పతి దేవతా
క్రీడంతం సురతాసక్తం-కపియుగ్మం దదర్శహ॥

తా॥ ఒకప్పుడు పతినేదైవముగా దలచునట్టి ఆనందముచే నొప్పు నట్టి పార్వతీదేవి రతిగాంధిష్టముకల్గి యాడుకొను కోతిజంటను చూచెను.

శ్లో॥ తతస్సా హ్రీమతీ బాలా-మహాదేవస్యపశ్యతః
పుష్పసాంద్రేషు కుంజేషు-తదా రంతుం మనోదధే ॥

తా॥ అటుపిమ్మట పరమశివునిపత్ని సిగ్గుతోడనేచూచి పుష్పము లచే దట్టమగు పొదరిండ్లయందు సుఖించుటకు ఇష్టపడెను.

శ్లో॥ సర్వజ్ఞస్త దభిప్రాయం-జ్ఞాత్వా స కపిరూపధృత్
రమయామాస తాం దేవీం-కపిరూపధరాం శివామ్ ॥

తా॥ సర్వజ్ఞుడగుటవలన అతడు పార్వతీదేవి యభిప్రాయము తెలిసికొనినవాడై కపిరూపము ధరించినవాడై కపిరూపముధరించిన మంగళ రూపయగు పార్వతిని కూడెను.

శ్లో॥ సహస్రాబ్ద ప్రమాణేన-క్రీడిత్వా సమహాద్యుతిః
తత్తేజః పార్వతీగర్భే-నిధాయ విరరామహ ॥

తా॥ ఆ మహానీయుడగు శివుడు వేయిసంవత్సరము లామెతో క్రీడించినవాడై విష్ణువుచే నీయబడిన తేజస్సును ఆ పార్వతీదేవి గర్భము నందు ప్రవేశపెట్టి రతి చాలించెను.

శ్లో॥ అగ్నౌ చిక్షిప తత్తేజః-పార్వతీ ధారణాక్షమా
సచా ప్యశక్త స్తద్వాయౌ-నిక్షిపన్ విసర్జహ॥

తా॥ ఆ తేజస్సును ధరింపలేనిదై పార్వతి దానిని అగ్ని యందుంచెను అగ్నిదేవుడు కూడ దానిని దాల్చ నశక్తుడై వాయువునందు ప్రవేశపెట్టెను.

శ్లో॥ తస్మిన్కేసరిణో భార్యా-కపిసాధ్వీ వరాంగనా
అంజనాపుత్ర మిచ్ఛంతీ-మహాబల పరాక్రమమ్ ॥

తా॥ ఆ సమయమున కేసరి భార్యయగు, వానరజాతి స్త్రీయు, మంచిదియునగు అంజనాదేవి గొప్పబలవంతుడగు పుత్రుని కోరినదై-

శ్లో॥ తపశ్చచార సుమహ-న్ని యతేంద్రియమానసా
తస్యై వాయుః ప్రసన్నాత్మా-ప్రత్యహం ఫల మర్పయన్ ॥

తా॥ ఇంద్రియములన్నింటిని నిగ్రహించినదై తపస్సు చేసెను. ఆమె యందనుగ్రహము కలవాడై వాయువు ప్రతి దినము ఫలము నర్పించుచు-

శ్లో॥ భక్షార్థ మేకదా తస్యా-స్తత్తేజ శ్చార్పయ త్కరే
ఫలబుద్ధ్యా తు తత్తేజ-స్సా ప్య భక్షయ దంగనా ॥

తా॥ ఒకప్పుడు తినుటకై ఆమెచేతిలో నీ తేజస్సు నర్పించెను. ఆమె దానిని ఫలమనుకొని భక్షించెను.

శ్లో॥ నాతి దీర్ఘేణ కాలేన-చాంజనా పతిదేవతా
స్వాంగేషు గర్భచిహ్నాని-సా దృష్ట్వా హిమనాహ్యభూత్ ॥

తా॥ ఆ పిదప తక్కువకాలమునకే పతివ్రతయగు ఆ అంజనా దేవి తన అవయవములందు గర్భ చిహ్నముల గుర్తించి సిగ్గుపొందినది దాయెను.

శ్లో॥ విస్మయా విష్టచిత్తాం తాం-వ్రతభంగవిశంకితాం
ధ్యాయంతీం భయవిత్రస్తా-మాభాష్యాహా శరీరిణీ ॥

తా॥ ఆ గర్భచిహ్నములచే ఆశ్చర్యమునంది నట్టి, అట్టి అకారణ గర్భముచే తన పాతివ్రత్యమునకు భంగము కల్గెనేమో యని శంకకల్గినట్టి ధ్యానమునందున్నదియు, భయముతోనున్న ఆ అంజనతో ఆకాశవాణి ఇట్లనెను

శ్లో॥ మా భూ త్తే వ్రతభం గోఽయం-మావిషీద వరాననే
దేవప్రసాదా త్తే గర్భే-మహావ్య క్తి ర్భవిష్యతి ॥

తా॥ ఓ అంజనాదేవీ! నీకు వ్రతభంగమేమియుకాలేదు దుఃఖింపవలదు. భగవదనుగ్రహమువలన నీ గర్భమున గొప్పవ్యక్తి పుట్టగలడు.

శ్లో॥ ఏవ ముక్తా తు సా దేవీ-ముదా పరమయా యుతా ॥
తా॥ ఇట్లు చెప్పబడినదై ఆమె మిక్కిలి ఆనందము నందెను.

శ్లో॥ వైశాఖేమాసి కృష్ణాయాం-దశమీ మందసంయుతా
పూర్వ ప్రోష్ఠ పదాయుక్తా-తథా వైధృతి సంయుతా ॥

తా॥ వైశాఖమాసమున కృష్ణపక్షమున దసమి తిథి శనివారము కాగా పూర్వాభాద్రానక్షత్రము వైధృతియోగము కల-

శ్లో॥ తస్యాం మధ్యాహ్నవేళాయాం-జనయామాసవై సుతమ్
మహాబలం మహాసత్వం-విష్ణుభ క్తిపరాయణమ్ ॥

తా॥ నాటి మధ్యాహ్నసమయమున అంజన పుత్రుని కనెను. అతడు మహాబలసంపన్నుడు, మిక్కిలి శక్తి కలవాడు, విష్ణుభక్తి, తత్పరుడున్ను;

శ్లో॥ సర్వదేవమయం వీరం-బ్రహ్మవిష్ణుశివాత్మకమ్॥
వేదవేదాంగత త్వజ్ఞం-సర్వవిద్యావిశారదమ్ ॥

తా॥ సర్వదేవతలు తానేయయినవీరుడు, బ్రహ్మయు, విష్ణువు పరమేశ్వరుడును తానేయయిన సృష్టి స్థితి లయాత్మకుడు, అనంతవేదముల తదంగముల తత్త్వమెఱిగినవాడు, అన్ని విద్యలయందును మేటియు:

శ్లో॥ సర్వబ్రహ్మవిదాం శ్రేష్ఠం-సర్వదర్శనసమ్మతం
మాణిక్యకుండలధరం-దివ్యపట్టాంబరాన్వితమ్॥

తా॥ సమస్త బ్రహ్మజ్ఞలోకమున శ్రేష్ఠుడు, దర్శనములన్నియు తమవాదములచే నంగీకరింపదగినవాడు, మాణిక్యములు పొదిగిన కుండలమును ధరించినవాడు, దివ్యమగు పట్టువస్త్రముల ధరించినవాడున్ను;

శ్లో॥ కనకాచల సంకాశం-పింగాక్షం హేమ మాలినం
స్వర్ణయజ్ఞోపవీతం చ-మణినూపురశోభితమ్ ॥

తా॥ బంగారుకొండయగు మేరుపర్వతముతో సమానుడు గోరోజనము రంగుగల కండ్లుకలవాడు స్వర్ణమాలికలను: స్వర్ణమయమగు జందెమును ధరించినవాడు, మణులుపొదిగిన నూపురములచే నొప్పువాడున్ను.

శ్లో॥ ధ్వజవజ్రాంకుశచ్ఛత్ర-పద్మరేఖాంఘ్రి సంయుతం
దీర్ఘలాంగూలసహితం-దీర్ఘకాయం మహాహనుమ్ ॥

తా॥ ధ్వజము, వజ్రాయుధము, అంకుశము, ఛత్రము, పద్మము అను రేఖలతోకూడిన పాదములు కలవాడు, పొడవగు తోక కలవాడు, గొప్పదేహముకలవాడు, పెద్ద దవడకలవాడున్ను-

శ్లో॥ కౌపీన కటిసూత్రాభ్యాం-విరాజితం మహాభుజం
ఆశ్చర్యభూతం లోకానాం-వజ్ర సంహననం కపిమ్ ॥

తా॥ కౌపీనము. మొలత్రాడులచే నొప్పువాడు. గొప్ప బాహువులు కలవాడు, లోకముల కాశ్చర్యముకల్గించు వజ్రదేహముకలవాడు, కపిరూపు గలవాడున్ను;

శ్లో॥ సర్వలక్షణసంపన్నం-కిరీటకనకాంగదం
ప్రభయాఽమితయా విష్ణో-రవతారమివావరమ్॥

తా॥ సమస్త సుభలక్షణములు కలవాడు; కిరీటము, బంగారు భుజకీర్తులుకలవాడు; అమితమగు కాంతిచేత వేఱొక విష్ణువుయొక్క అవతారమా యనిపించునట్లుండెను.

శ్లో॥ ప పాత పుష్పవృష్టిశ్చ-నేదు ర్దుందుభయో దివి
ననృతు ర్దేవ గంధర్వా-స్తుష్టవు స్సిద్ధ చారణాః
వవౌ వాయు స్సుఖస్పర్శం-సరితో నిర్మలోదకాః ॥

తా॥ ఆ సమయమున పూవుల వర్షము కురిసెను. స్వర్గమున దేవదుందుభులు మ్రోగెను. దేవగంధర్వులు నృత్యము చేసిరి. సిద్ధులు, చారణులు స్తోత్రముచేసిరి. వాయువులు వనమున సుఖముగా వీచినవి. నదులు స్వచ్ఛములైనవి.

శ్లో॥ యదాంజనా కేసరిధర్మపత్నీ-హ్యసూతబాలం కపిసార్వభౌమం
ప్రదక్షిణాకారశిఖం మనీనాం-తదైవ వహ్నిత్రితయంవిరేజే॥

తా॥ ఎప్పుడైతే కేసరి ధర్మపత్నియగు అంజనాదేవి కపిశ్రేష్ఠుడగు బాలునిప్రసవించెనో ఆసమయమున మనులయొక్క గార్హపత్యాహవనీయ దాక్షిణాగ్నులు మూడును ప్రదక్షిణాకారమగు జ్వాలలతో ప్రకాశించినవి.

శ్లో॥ ప్రసూతి గంధానిలసంభృతేషు-వనేషుమత్తామకరందనిర్ఝరైః
మిళింద సంఘావిచ రంతిసర్వతః-సకోరకైఃపల్లవిత ద్రుమేషు॥

తా॥ పూవులవాసనలు గుబాళించుగాలులుకల, మొగ్గలతో కూడి చిగిరించియున్న, చెట్లుకల, పూలలోని తేనెలు ప్రవహించు వనములందంతట తుమ్మెదలు తిరుగాడినవి.

శ్లో॥ పతంతి రత్నాని సురేతరాణాం-కిరీటకోటిగ్రథితా న్యకాండే
తదంగనా మానసగహ్వరేషు-సగర్భకం పం భయమావివేశ॥

తా॥ ఆ అంజనేయ జననసమయమున రాక్షసుల కిరీట శిఖరములందు పొదిగిన రత్నము లకారణముగా పడెను, ఆ రక్కసుల మనస్సులందు పుట్టని గర్భస్థశిశువులు సైతము కంపించిపోయెడు భయమావేశించెను.

శ్లో॥ తతః ప్రోవాచ తాంబాల శ్చతుష్పం చ దినాంతరే
అమాయాం మాతరం దృష్ట్వా-ఆహారో మే ప్రదీయతామ్॥

తా॥ అటుపిమ్మట నాలుగైదు రోజులలోవచ్చిన అమావాస్యనాడు తల్లినిచూచి యాబాలుడు 'నాకు ఆహారము పెట్టవలసినది' అని అడిగెను.

శ్లో॥ ఇత్యుక్తా ప్రాహతందేవీ-లాలయంతీ సుతం సతీ
సుపక్వం చ ఫలంసూనో-యత్తత్రాపి భుజ్యతామ్ ॥

తా॥ అప్పుడామె బిడ్డనులాలించుచు 'నాయనా: ఎక్కడైన బాగుగ పక్వమునకు వచ్చిన పండులభించిన తినుము' అనెను.

శ్లో॥ ఆంజనేయః ప్రహృష్టాత్మా-దివ ముత్పత్య వేగతః
శిశురుద్యంత మాదిత్యం-ఫల బుద్ధ్యా గృహీతవాన్ ॥

తా॥ అందుల కాంజనేయు డానందించినవాడై వేగముగా నాకసమునకెగిరి ఉదయించుచున్న బాలసూర్యుని ఫలమనుకొని పట్టుకొనెను.

శ్లో॥ ముఖేన గ్రసితం భానుం-దృష్ట్వా కోపాత్పురందరః
చింతయా మాస కోన్వేష-మహా సత్త్వః ప్రదృశ్యతే॥

తా॥ సూర్యుని నోటగరచుటచూచినవాడై దేవేంద్రుడు ఈతడు మహాబలవంతుడులా కన్పట్టుచున్నాడు ఎవడో? యని విచారించెను

శ్లో॥ ఇతి విస్మయ మాపన్నో-వజముద్యమ్య వృత్రహా
బాలే చిక్షేప రోషాచ్చ-రోమ్ణా వజ్రమపోథయత్ ॥

తా॥ అట్లు ఆశ్చర్యచకితుడైన దేవేంద్రుడు వజ్రాయుధమునెత్తి యాబాలునిపై విసరెను. ఆంజనేయుడు ఆ వజ్రాయుధమును రోమముతో నడ్డెను.

శ్లో॥ మోఘంతత్ కులిశం దృష్ట్వా-బ్రహ్మాణోఽస్త్రమయోజయత్
తచ్చాపిరోమ్ణాచిక్షేప-విస్మితాశ్చాభవన్సురాః ॥

తా॥ వ్యర్థమైన ఆ వజ్రాయుధమునుచూచి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. దానిని కూడ ఆంజనేయుడొక్క రోమముతోనెట్టెను. అది చూచి దేవతలాశ్చర్యము నొందిరి.

శ్లో॥ తత స్సంప్రార్థయాంచక్రుః-పితామహ పురోగమాః
అంజనా సుప్రజావీర-పార్వతీశ్వరసంభవ!
సమర్థోఽసిమహావీర-మహాబల పరాక్రమ!
నరాణాం చ సురాణాం చ-ఋషీణాం చ హితాయవై ॥

తా॥ అంత బ్రహ్మాదిదేవతలు ఆతని నిట్లు ప్రార్థించిరి. ఓ అంజనాదేవికి పుత్రుడగువీరుడా! పార్వతీ పరమేశ్వరులవలన పుట్టినవాడా ! మహావీరుడా! మహాబల పరాక్రమముకల నీవు మానవులకు, దేవతలకు, ఋషులకు మేలుచేయ సమర్థుడవు.

శ్లో॥ జగత్ప్రాణ కుమారస్త్వం-అవతీర్ణోఽసి భూతలే
సత్క్రియా న ప్రవర్తంతే-వేదోక్తాః క్రతవ స్తథా
త్యజ సూర్య మితిప్రోక్త-స్సముమోచ ప్రభాకరమ్ ॥

తా॥ ఓ ఆంజనేయా నీవు లోకమునకే ప్రాణమైన వాయువునకు కుమారుడవై అవతరించితివి. వేదోక్తములగు క్రతువులతో సహా సత్క్రియ లన్నియు ఆగిపోయినవి. కావున సూర్యుని విడుము, అని ఇట్లు ప్రార్థించగా నాతడు సూర్యుని విడచెను,

శ్లో॥ ఏ త దాశ్చర్య మాలోక్య-కులిశం మేఘవాహనః
సమర్థమపి చాపల్యాత్-క్రీడాస క్తం శిశుం కపిమ్
హనౌ చిక్షేప వేగేన-స పపాత శిలాతలే ॥

తా॥ ఈ యాశ్చర్యవిషయము గ్రహించిన ఇంద్రుడు సమర్థుడైనను ఆటయందలి ఆసక్తిచే నేమరుపాటుగనున్న బాలుడగు నాంజనేయుని దవుడపై వజ్రాయుధముతో కొట్టెను. వెంటనే అతడు శిలాతలముసపడెను.

శ్లో॥ మూర్ఛితం బాలకం దృష్ట్వా-వాయుః పరమకోపనః
ప్రాణాన్సర్వశరీరేషు-నిగృహ్యా స చ చాలహ॥

తా॥ మూర్ఛనందిన పుత్రునిచూచి వాయువు మిక్కిలి కోపము నందినవాడై అందరి దెహములందలి వాయువులను నిగ్రహించి పీచక నుండెను.

శ్లో॥ ప్రాణేషు నిగృహీతేషు-సప్రవృత్తాః క్రియాస్తతః
అచేతనవ దత్యంత-సమ్మూఢ మభవ జ్జగత్॥

తా॥ ప్రాణములట్లు నిగ్రహించుటచే లోకవ్యాపారములన్నియు నాగిపోయెను. జగత్తంతయు మిక్కిలిగా చైతన్యము కోల్పోయినదై మూఢ ప్రాయమయ్యెను.

శ్లో॥ తతో దేవా స్సగంధర్వాః-సిద్ధాశ్చపర మర్షయః
బ్రహ్మా విష్ణుశ్చ శంభుశ్చ-శక్రశ్చాపి సమాగతః ॥

తా॥ అంతట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు బ్రహ్మ, విష్ణువు, శంభువు, దేవేంద్రుడుసైతము వచ్చిరి.

శ్లో॥ వరైస్తం ఛందయామాసుః-వాయుం విబుధదుర్లభైః
దీర్ఘమాయుర్బలం శౌర్యం-ఽరోగ్యంచాఽప్యధృష్యతాం
బుద్ధిం విద్యాస్తపస్తేజో-వాక్పటుత్వం ప్రసన్నతామ్॥
చాతుర్యం ధైర్యవైరాగ్యే-విష్ణుభక్తిం కృపాళుతాం
పరనారీషు వైముఖ్యం-అపచార సహిష్ణుతామ్ ॥

తా॥ వాయువునుగూర్చి దేవతలంకే లభ్యనుముగాని వరము లొసంగుదు మనుచు ప్రార్థించిరి. దీర్ఘాయువును, బలమును పరాక్రమమును ఆరోగ్యమును, పరులకు సమీపింపశక్యముకాని గుణమును, బుద్ధిని, విద్యలను తపస్సును, తేజస్సును, వాక్పటుత్వమును, ప్రసన్నతను, చతురతను, ధైర్యమును, వైరాగ్యమును, విష్ణుభక్తిని, దయామయతను, పరస్త్రీ విముఖతను, అపచారమును సహించగల్గు శక్తిని,

శ్లో॥ అజేయత్వం చ సర్వాస్త్రైః-సర్వైర్దేవాసురైరపి
ఏతా నన్యాంశ్చ కల్యాణ-వరా న్దత్వా యయు స్సురాః ।
తత స్తుష్టా వాంజనేయం-బ్రహ్మలోక పితామహః ॥

తా॥ ఏ అస్త్రములతోను సమస్తదేవగణ రాక్షసగణములతోను జయింపబడని శక్తిని. ఇంకను పలురకముల శుభప్రదములగు వరముల నొసంగి దేవతలు వెడలిరి. పిదపలోక పితామహుడగు బ్రహ్మ ఆంజనేయు నీరీతిగా స్తుతించెను.

బ్రహ్మోవాచ-

శ్లో॥ సాక్షాద్విష్ణురివశ్రీమాన్-దేవా నుద్ధార యిష్యసి
సర్వరాక్షస సంహరం-కరిష్యసి యథా హరః ॥

తా॥ బ్రహ్మ ఇట్లనెను. ఆంజనేయా! నీవు విష్ణువువలె దేవతల నుద్ధరించగలవు. శివునివలె రాక్షసులందఱిని సంహరింపగలవు.

శ్లో॥ లంకా దైత్యవధం కృత్వా-రామకార్య పరాయణః
సంజీవనాచలం నీత్వా-లక్ష్మణం జీవయిష్యసి॥

తా॥ లంకయందలి రాక్షసులను చంపి రామకార్యమునందు నిమగ్నుడవై సంజీవన పర్వతమును తెచ్చి లక్ష్మణుని బ్రతికించగలవు.

శ్లో॥ సీతాప్రవృత్తి మానీయ-రామం సంతోషయిష్యసి।
త్వం బుద్ధిమాన్ మహాసూరో-మహాబలపరాక్రమః
భవానజేయ స్సర్వాస్త్రైః-తథాపి ప్రార్థనాన్మమ
అంగీకార్యం త్వయా వీర-క్షణం బ్రహ్మస్త్రబంధనమ్॥

తా॥ సీతాదేవియొక్క ఉనికిని కనుగొనినవాడవై రాముని సంతోష పెట్టగలవు. ఓ ఆంజనేయా! నీవు బుద్ధిమంతుడవు. గొప్ప పరాక్రమబలములు కలవాడవు. నీ వేయస్త్రముతోను జయింపబడవు. అయినను నా ప్రార్థన నాలించి ఒక్క క్షణము మాత్రము బ్రహ్మాస్త్రమునకు కట్టుబడియుండుటన్గీకరించుము

శ్లో॥ మహాదేవ ప్రభావాద్ధి-రుద్రస్యామితతేజసః
తేజసోఽపి సురాణాంత్వం-ఐశ్వరంతేజ ఊర్జితమ్॥

తా॥ మహాదేవుడు రుద్రునితేజస్సువలన దేవతల తేజస్సును మించిన ఈశ్వరతేజోదార్ఢ్యవంతుడవు.

శ్లో॥ పార్వతీగర్భసంభూతేః-పార్వతీగర్భనామవాన్
అగ్నినాధాన్యమాణత్వాత్-అగ్నిగర్భోభవాన్భవేత్॥

తా॥ పార్వతీగర్భమున సంభవించుటచే పార్వతీగర్భుడను పేరుగలవాడవు, అగ్నిచే ధరింపబడుటవలన అగ్ని గర్భుడను పేరుగల వాడవు నౌదువు.

శ్లో॥ వాయుప్రసాదజననాత్-వాయుపుత్రోసిగద్యసే
ఆంజనాగర్భజననాత్-ఆంజనేయ స్తతోభవాన్ ॥

తా॥ వాయువుయొక్క అనుగ్రహముచే పుట్టుటవలన వాయు పుత్రుడవని, అంజనాగర్భమున జనించుటచే ఆంజనేయుడవని పిలువ బడుదువు.

శ్లో॥ కేసరిక్షేత్రజన్యత్వాత్-పుత్రః కేసరిణః కపేః
హనూవజ్రప్రహారాద్ధి-హనూమానితి నామతే ॥

తా॥ కేసరి సతియందుపుట్టుటచే వానరుడగు కేసరిపుత్రుడవు

హనువు అనగా దవడ, హనువునందు వజ్రాయుధము తాకినదికాన హనుమంతుడని నీకు పేరు.

శ్లో॥ బ్రహ్మవిష్ణుశివాంశత్వాత్-త్రిమూర్తిరితివిశ్రుతః
సర్వదేవాంశసంభూతేః-సర్వదేవమయః స్మృతిః ॥

తా॥ త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అంశల నంది యుండుటచే త్రిమూర్త్యాత్మకుడవని కీర్తికల్గును. సర్వదేవతల అంశలనందుట వలన సర్వదేవమయుడవని తెలియ బడుదువు

శ్లో॥ హనూమత్పూజయాతస్మాత్-పూజితాస్సర్వదేవతాః ॥
ప్రతిగ్రామనివాసశ్చ-భూయాద్రక్షోనివారణే

తా॥ కావున హనుమంతుని పూజించుటవలన అందఱు దేవతలను పూజించినట్లే. హనుమంతునర్చించుటచే సకల దేవతలు తృప్తినందుదురు. ప్రతిగ్రామమునందు రాక్షసులు నశించుటకు చెడుగులునశించుటకు నీకు నివాసమేర్పడగలదు. అనగా బాధలన్నియుతీరి దేవతలందరు తృప్తి నందుటకు ప్రతిగ్రామమున హనుమంతుడుండవలెనని బ్రహ్మయనెను.

శ్లో॥ ఇత్యుక్త్వాలోకనాథోఽపి-తత్రైవాంతరధీయత
తా॥ ఇట్లని లోకనాథుడగు బ్రహ్మదేవుడంతర్ధానమందెను.

శ్లో॥ ఆంజనేయ స్తతఃకాలే-బ్రహ్మచర్యపరాయణః
సమర్థోఽపి మహాతేజః-సంపశ్య న్లోకసంగ్రహమ్ ॥
సూర్యమండల ముత్పత్య-వేదాధ్యయనకారణాత్
సప్రశ్రయ మువాచేదం-నమస్కృత్య దివాకరమ్ ॥

తా॥ అటుపిమ్మట బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుడై తాను సర్వజ్ఞుడు సర్వసమర్థుడునైనను లోకసంగ్రమును దృష్టియందుంచుకొని వేదాధ్యయనము కారణముగా చేసికొని సూర్యమండలమున కేగివాడైన సూర్యునకు నమస్కరించి వినయ పూర్వకముగా నిట్లనెను.

శ్లో॥ సాంగోపనిషదోవేదాన్-మమ వక్తుం త్వ మర్హసి
రవిః ప్రోవాచాంజనేయం-ఆవకాశో న విద్యతే ॥
ఈశ్వరస్యవశేతిష్ఠన్-భ్రమామీహ తదాజ్ఞయా ।

తా॥ ఓ సూర్యదేవా! వేదములను, వేదాంగములను, ఉపాంగము లను సర్వమున నాకు నీవుబోధించవలెను అనగా సూర్యు డాంజనేయునితో నేను ఈశ్వరవశుడనై ఆ సర్వేశ్వరాజ్ఞచే నెప్పుడు తిరుగుచున్నాను. కావున నీకు విద్య చెప్పునవకాశము నాకులేదు

శ్లో॥ ఇత్యుక్తో హనుమాన్కోపాత్-నిరున్ధే తస్య పద్ధతిమ్।
త్వమేవోపాయ వక్తేతి-సాంత్వయామాస తం రవిః॥

తా॥ అనగా హనుమంతుడు కోపముతో సూర్యుని మార్గము నడ్డగించెను. అంత సూర్యుడు ఆంజనేయానీవే ఉపాయము చెప్పుముఅట్లు చేయు దమని చల్లబరచెను.

శ్లో॥ సూర్యోన్ముఖం పృష్ఠగతో-హనూమా నేకవాసరే
ఇంద్రవ్యాకరణం సూర్యాత్-ధారయశ్చమహాత్మనః।

తా॥ అంత హనుమంతుడు సూర్యునివైపుతిరిగి అతడు నడుచు వైపు వెనుకకునడుచుచుపోవుచు, ఒక్కవారములో ఇంద్రవ్యాకరణమును సూర్యునికడ నేర్చెను.

శ్లో॥ తతో హనూమానేకంస్వం-పాదం కృత్వోదయాచలే
అస్తాద్రావేక పాదం చ-తిష్ఠన్నభిముఖోరవేః।
సాంగోపనిషదోవేదాన్-అవాప్య కపిపుంగవః
భాస్కరంతోషయామాస-సర్వవిద్యవిశారదః॥

తా॥ అటుపిమ్మట హనుమంతుడు ఒకపాదమును ఉదయాద్రి యందు, ఒకపాదమును పశ్చిమాద్రియందు నుంచి సూర్యునెదురుగనిలువ బడినవాడై సాంగోపాంగ ముగ వేదముల నభ్యసించి సర్వవిద్యావిశారదుడై తన గురువగు సూర్యుని సంతోషపరచెను.

శ్లో॥ తస్యబుద్ధిం చ విద్యాం చ-బల శౌర్యపరాక్రమాన్
విచార్య తస్మైప్రదదౌ-స్వస్యకన్యాం సువర్చలామ్॥

తా॥ ఆ హనుమంతుని బుద్ధిని, విద్యను, బల, శౌర్య, పరాక్రమములను గ్రహించిన సూర్యుడు తన కుమార్తెయగు సువర్చలను ఆతనికి సమర్పించెను.

శ్లో॥ తాముద్వాహ్యమహాతేజా-హనుమాన్మారు తాత్మజః
భూయః కిలకిలాంకుర్వన్-పునరాయాన్మహా కపిః ॥

తా॥ ఆ మారుతాత్మజుడు, మహాతేజుడు అగు హనుమంతుడు ఆమెను వివాహమాడి సుఖముండెను.

శ్లో॥ ఇదం హనూమచ్చరితం-యేశ్రుణ్వంతి పఠంతి చ
లిఖంతి పుస్తకే వాఽపి-సర్వాన్కామా నవాప్నుయుః ॥

తా॥ ఈ హనుమంతుని చరిత్రను ఎవరెతేవిందురో, ఎవరు పఠింతురో లేక యెవరీకతను పుస్తకమునందు లిఖింతురో వారు సమస్తములైన కోర్కెలను పొందుదురు.

శ్లో॥ సువర్చలాసమేత శ్రీ-హనుమద్ద్వాదశాక్షరం
యేజపంతి మహాత్మానః-లభంతే తే మనోరథాన్ ॥

తా॥ సువర్చలాసమేత శ్రీహనుమంతుని ద్వాదశాక్షర మంత్రము నేమహాత్ములు జపింతురో వారు కోర్కెల నన్నిటిని పొందుదురు.

శ్లో॥ జయంతీనామ పూర్వోక్తా-హనూమజ్జన్మవాసరః
తస్యాం భక్త్యాకపివరం-నరానియత మానసాః ॥
జపంతశ్చార్చయంతశ్చ-పుష్పపాద్యార్ఘ్యచందనైః
ధూపైర్దీపైశ్చ నైవేద్యైః-ఫలైర్బ్రాహ్మణభోజనైః॥
సమంత్రార్ఘ్య ప్రదానైశ్చ-నృత్యగీతైస్తథైవ చ
తస్మాన్మనోరథా న్సర్వాన్-లభంతే నాత్రసంశయః ॥

తా॥ వెనుకటి విషయముననే హనుమంతుడు పుట్టిన రోజును హనుమజ్జయంతి యని చెప్పితిమి. ఆ దినమున మానవులు శ్రద్ధతోకూడిన

వారై భక్తిగలిగి వానరశ్రేష్టుడగు ఆ హనుమంతుని జపించినను పుష్పములు పాద్యము, అర్ఘ్యము, చందనము, ధూప, దీప, నైవేద్య, ఫలములతోను, బ్రాహ్మణులకు భోజనము పెట్టుటతోను, మంత్రయుక్తముగ సర్వ ప్రధానముతోను నృత్యగీతాదులతోను తృప్తిపరచిన సమస్తములగు కోరికలు వెంటనే సిద్ధించును. ఇందులో సందేహములేదు.

శ్లో॥ ఏకోదేవ స్సర్వద శ్రీహనుమాన్
ఏకో మంత్రశ్శ్రీహనూమత్ప్రకాశః
ఏకామూర్తిః శ్రీహనూమత్స్వరూపా
చైకం కర్మ శ్రీహనూమత్సపర్యా ॥

తా॥ సర్వమును ప్రసాదించగల హనుమంతుడొక్కడే దేవుడు. హనుమన్మంత్రమే మంత్రము. శ్రీహనుమంతుని రూపముగల విగ్రహమే విగ్రహము. శ్రీహనుమంతునికిచేయు సపర్య ఒక్కటియే నిజమైనకర్మ. హనుమత్సేవయే కర్తవ్యము.

శ్లో॥ జలాధీనాకృషిస్సర్వా–భక్త్యధీనంతుదైవతం
సర్వం హనుమతోఽధీనం–ఇతి మే నిశ్చితామతిః ॥

తా॥ వ్యవసాయమంతయు నీటిపై ఆధారపడియున్నది. దైవము భక్తికధీనుడైయున్నాడు. కాని సమస్తము హనుమంతుని కధీనమైయున్నది. ఇదియే నా నమ్మకము. అనిపరాశరుడు పల్కుచు ఇంకను

శ్లో॥ హనూమాన్కల్పవృక్షో మే–హనూమాన్మమకామధుక్
చింతామణిస్తుహనుమాన్–కోవిచారః కుతోభయమ్ ॥

తా॥ హనుమంతుడు నాకు కల్పవృక్షము హనుమంతుడే నాపాలి కామధేనువు, హనుమంతుడే సమస్తము నొసంగు చింతామణికూడ. ఇందనుమానములేదు. ఇక భయముకూడలేదు. వానిని నమ్మినవారికి. అని మైత్రేయునితో పల్కెను.

"అథ పూజాంతే అర్ఘ్యప్రదానం కర్తవ్యమ్"

హనుమత్పూజ యెప్పుడుచేసినను పూజచేయగనే ఈమంత్రములతో అర్ఘ్యప్రధానము చేయవలెను. 'అర్ఘ్యం సమర్పయామి' అని అన్నపుడెల్ల ఆంజనేయునిముందు జలమును విడువవలెను."

(అర్ఘ్యప్రధానమంత్రములు)

శ్లో॥ దశమ్యాం మందయుక్తాయాం-కృష్ణాయాం మాసిమాధవే
పూర్వాభాద్రాఖ్యనక్షత్రే-వైధృతౌ హనుమానభూత్ ॥
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ వైశాఖమాసమున కృష్ణపక్షమున దశమితిథియగు శనివారమున పూర్వాభాద్రానక్షత్రము వైధృతీయోగమున హనుమంతుడు పుట్టెను.

శ్లో॥ జాతః కపికులాంభోదౌ-స్వర్ణరంభావనాశ్రయః
భక్తసంరక్షణార్థాయ-గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి

తా॥ కపికులమున పుట్టినవాడా! బంగరు అరటితోట ఆశ్రయముగా గలవాడా! భక్తులను రక్షించుటకొఱకు అర్ఘ్యమును గ్రహింపుము. నీకు సమస్కారము.

శ్లో॥ దుష్టానాం శిక్షణార్థాయ-శిష్టానాం రక్షణాయ చ
రామకార్యార్థసిద్ధ్యర్థం-జాతః శ్రీహనుమాన్కపిః ॥
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి.

తా॥ దుష్టులను శిక్షించుటకొఱకు, శిష్టులను రక్షించుటకొఱకు, రామకార్యమును నెరవేర్చుటకున్ను హనుమంతుడుదయించెను.

శ్లో॥ అంజనాగర్భసంభూత-హనూమన్పవనాత్మజ
గ హాణార్ఘ్యం మయాదత్తం-కపివర్య నమోస్తుతే ॥
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి.

తా॥ అంజనాదేవికి పుట్టినవాడా! హనుమంతుడా! వాయుపుత్రుడా నాచే సీయబడు అర్ఘ్యమును గ్రహింపుము. కపిశ్రేష్ఠా! నీకు నమస్కారము.

శ్లో॥ పూర్వాభాద్రా కుంభరాశౌ -మధ్యాహ్నేకర్కటాంశకే
కౌండిన్యవంశే సంజాతో-హనూమా నంజనోద్భవః ।
శ్రీసువర్చలాసమేత హనుమతేనమః ఇద మర్ఘ్యం సమర్పయామి.

తా॥ పూర్వాభాద్రానక్షత్రముతోకూడిన కుంభమున, అనగా పూర్వాభాద్ర నాల్గవపాదం మీనారాశి. చంద్రలగ్నమది కాదని యర్థము. ఇట్లనుటచే పూర్వాభాద్ర మొదటి మూడుపాదములలో దేనితోనో కూడిన కుంభరాశియనుట అట్టి కుంభరాశి చంద్రలగ్నముకాగల మధ్యాహ్నసమయమున, కర్కాటకము జననలగ్నముకాగా కౌండిన్యవంశమున అంజనాదేవికి హనుమంతుడు పుట్టెను

మంత్రము

శ్లో॥ శ్రీశబ్దా ద్ధనుమచ్ఛబ్దో-జయశబ్ద స్తతఃపరం
హనుమాన్జయశబ్దం హి-సంపుటీకరణం పరః
జయద్వయావధి శ్శోర్ధ్వ హనుమన్నామపై తతః
మంత్రోయం షోడశార్ణస్తు-మహాపాతకనాశకః

తా॥ 'శ్రీ' వర్ణము, పిదప 'హనుమన్' అపై 'జయ' శబ్దము పిమ్మట 'హనుమాన్జయ' శబ్దము మరల 'జయ' శబ్దమని, హనుమన్' అని పిదప అననలెను. ఇదిషోడశాక్షరమంత్రము. అనగా 16 అక్షరములు. మహాపాతకములను హరించునట్టి మంత్ర మిది.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పంచముఖహనుమ న్మంత్ర వివరణే పరాశర మైత్రేయ సంవాదే హనుమజ్జన్మకథనంనామ షష్ఠపటలః

## సప్తమ పటలః

# శ్రీ సువర్చలా హనుమ ద్ద్వాదశాక్షర మంత్ర కథనం

శ్రీమైత్రేయః–

శ్లో॥ అంజనేయస్వరూపం త స్యోత్పత్తి ర్మంత్రవైభవః
కథితాని త్వయా బ్రహ్మన్–శ్రుతానీహ మయా ప్రభో॥

తా॥ మైత్రేయుఁడుచెప్పుచున్నాఁడు. ఓ సమస్తశపగు పరాశర మహామునీ! నీచే అంజనేయస్వరూపము, అతని జననము. మంత్రవైభవము చెప్పబడగా నేను వింటిని,

శ్లో॥ సువర్చలాసమేత శ్రీ–హనుమద్ద్వాదశాక్షరః
కీదృశ స్తత్పురశ్చర్యా–తస్యోత్పత్తిశ్చ కీదృశీ ?

తా॥ ఓ మహానుభావా సువర్చలాసమేత శ్రీహనుమంతుని ద్వాదశాక్షరమహామంత్రము ఎటువంటిది? ఆ మంత్రముయొక్క పురశ్చర్య ఎట్లు? ఆ మంత్రముయొక్క పుట్టుక ఎటువంటిది?

శ్లో॥ పురా కే వా పురశ్చర్యాం–కృత్వా సిద్ధి మవాప్నువన్ ?
శ్రోతు మిచ్ఛామి తత్సర్వం–వర్ణ్యతాం భగవన్! మునే!

తా॥ పూర్వమెవరైన, ఆపురశ్చర్యనొనర్చి సిద్ధినందిరేమో విన గోరుచున్నాను. కాన దయయుంచి చెప్పవలసినది.

శ్రీపరాశరః–

శ్లో॥ సప్తకోటిమహామంత్రాః–ప్రోక్తా గౌర్యైహి శంభునా
శైవాశ్చ వైష్ణవా స్సౌరాః–గాణాపత్యా శ్శివాత్మికాః ॥
కౌమారా భైరవా శ్చాన్యే–కేచి న్మంత్రా హనూమత ః
కేచి ద్భుక్తిం ప్రయచ్ఛంతి–కేచి న్ముక్తిం దిశంతి చ ॥

తా॥ పరాశరులిట్లనుచున్నారు. మైత్రేయా! పరమేశ్వరునిచే పార్వతీదేవికి ఏడుకోట్ల మహామంత్రములు చెప్పబడినవి. అందుకొన్ని శివ సంబంధమైనవి. కొన్ని విష్ణు సంబంధులు, కొన్ని సూర్యునకు, కొన్ని గణపతికి కొన్ని గౌరికి సంబంధించినవి, వానిలోకొన్ని కుమారస్వామికి, భైరవస్వామికి సంబంధించినవి, మఱికొన్ని హనుమత్సంబంధమైనవి. వానిలోకొన్ని లౌకిక ప్రయోజనమగు భుక్తినీయ మఱికొన్ని ముక్తి నొసంగుచున్నవి.

శ్లో॥ దేవతానాం యథా విష్ణుః-నక్షత్రాణాం యథా శశీ
గ్రహాణాం తు సహస్రాంశుః-నదీనాం జాహ్నవీ యథా
తథాసువర్చలాయుక్త-హనుమ ద్ద్వాదశాక్షరః
మంత్ర శ్శ్రేష్ఠతర శ్శీఘ్రం-భుక్తిం ముక్తిం ప్రయచ్ఛతి॥

తా॥ దేవతలలో విష్ణువు, నక్షత్రములలో చంద్రుడు గ్రహము లలో సూర్యుడు, నదులలో గంగయు గొప్ప యగునట్లు మంత్రములలో శ్రీహనుమద్ద్వాదశాక్షర మంత్రము శ్రేష్ఠమై భుక్తిని, ముక్తిని ఇచ్చు చున్నది.

శ్లో॥ న కాలదేశనియమో-నారిమిత్రాది శోధనమ్
ప్రసన్నో పాసక గురో-ర్లబ్ధ్వా మనుం త్వియమ్ ॥

తా॥ ఒకకాలమందనికాని యొకప్రదేశమందనికాని నియమము లేదు. శత్రుమిత్రవిచారములేదు. అర్ణవ పరిశోధనముకూడ అవసరము లేదనుట, ఈ మంత్రమును ప్రసన్నుడు, ఉపాసకుడు అగు గురువు కడ నుపదేశము పొంది

శ్లో॥ గురుం సంతోషయే ద్ధీమాన్-శుశ్రూషా స్స్వర్ణభూషణైః
వస్త్రై ర్మాల్యై ర్ధూపదీపై-రభీష్టైః మృష్టభోజనైః ॥

తా॥ బుద్ధిమంతుడగునతఁడు గురునకు శుశ్రూషనొనర్చుట చేతను, బంగారునగలు, వస్త్రములు, మాలికలు, ధూపదీపాదికములు, ఇష్ట భోజనములు మున్నగువానిచే గురువును సంతృప్తునిచేయవలెను.

శ్లో॥ గురో స్సంతోషణె నైవ-హనుమాన్ భక్తవత్సలః
సంతుష్య సకలాభీష్టాన్-దదా తీహ న సంశయః ॥

తా॥ గురువు సంతోషించినయెడల భక్తవత్సలుఁడగు హనుమంతుఁడు సంతోషమునంది సమస్తములగు కోర్కెలను తీర్చును. ఇందు సందేహములేదు

శ్లో॥ అత్యాశ మతిలుబ్ధం చ-దాంభికం జ్ఞానవర్జితమ్
అసంతుష్ట మసాంతం చ-న పాపం గురు మాశ్రయేత్॥

తా॥ మిక్కిలి ఆశకల, లోభగుణముకల, డాంబికముకల, జ్ఞానములేని, సంతృప్తిలేని శాంతాత్ముఁడుకాని పాపాత్ముఁడగు గురువు నాశ్రయింపరాదు

శ్లో॥ నాస్తికాయ కృతఘ్నాయ-వంచకా యాతిలోభినే
అనాచారాయ పాపాయ-నైతన్మంత్రం ప్రదాపయేత్॥

తా॥ వేదప్రామాణ్యము నంగీకరింపనివారికి, చేసిన మేలుమరచు వానికి, మోసగానికి, లోభికి, ఆచారములేనివానికి, పాపాత్మునకు ఈ మంత్రము నుపదేశింపరాదు,

శ్లో॥ జగత్ప్రాణతనూజత్వాత్-జగతః ప్రాణఏవ సః
తదధీనం జగత్సర్వ మితి మే నిశ్చితా మతిః ॥

తా॥ లోకమునకు ప్రాణమగు వాయువుయొక్క కుమారుడగుట వలన హనుమంతుఁడు జగత్తునకు ప్రాణమే. లోకమంతయు అతనికి లొంగియుండునదే అని నాదృఢమగు నభిప్రాయము

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య-శ్రీబీజం త దనన్తరమ్
తత శ్శీవర్ణ ముచ్చార్య-సువర్చలాపదం తథా ॥

హనుమత్పద ముచ్చార్య-నమశ్శబ్దం తతఃపరమ్
ద్వాదశాక్షరమంత్రోఽయం-పురశ్చర్యావిధిం శ్రుణు ॥

తా॥ మొదట 'ఓం'ను ఉచ్చరించి పిదప 'హ్రౌం' అను బీజమును, పిమ్మట 'శ్రీ' వర్ణము నుచ్చరించి 'సువర్చలా' పదము, హనుమతేపదము నుచ్చరించి 'నమః' శబ్దము ననవలెను, ఇది ద్వాదశాక్షర మంత్రము. ఇకపురశ్చర్యావిధి వినుము.

శ్లో॥ అహమేవ ఋషి స్తత్ర-గాయత్రీ ఛందఏవ వా
సువర్చలామేత శ్రీ-హనుమాన్ దేవతా తథా॥

తా॥ మంత్రమునకు నేనే ఋషిని అనగా పరాశరః ఋషిః గాయత్రీ ఛందస్సు. శ్రీ సువర్చలాసమేతహనుమన్ దేవత.

శ్లో॥ మారుతాత్మజ బీజం చ-అంజనాసుత శక్తి చ
కీలకం వాయుపుత్రస్తు-మమ శ్రీ పద ముచ్చరేత్॥

తా॥ మారుతాత్మజబీజం, అంజనాసుత శ్శక్తిః వాయుపుత్రో కీలకం చెప్పి 'మమశ్రీ' అని

శ్లో సువర్చలేశహనుమ-త్ప్రసాదే వినియోజనమ్
అంగన్యాసం కరన్యాసం-కుర్యాద్వై మూలమంత్రతః॥

తా॥ 'సువర్చ లేశహనుమత్ప్రసాదే వినియోగః' అని విని యోగము చెప్పి మూలమంత్రమునసుసరించే అంగన్యాస కరన్యాసములు చేయవలయును.

శ్లో॥ అంజనాసుతాయేతి చ-తతో వైరుద్రమూర్తయే
వాయుసుతాయేతి తథాగ్నిగర్భాయ తతః పరమ్॥
శ్రీరామ ముఖ్యదూతశ్చ-బ్రహ్మాస్త్రాది నివారణః
భూర్భువస్సువరో మితి-దిగ్బంధనపదం వదేత్॥

తా॥ 'అంజనాసుతాయ' అనియు, పిమ్మట 'రుద్రమూర్తయే' అని, 'వాయుసుతాయ' అని. 'అగ్నిగర్భాయ.' శ్రీరామ ముఖ్య దూతాయ,' "బ్రహ్మాస్త్రాదివారణాయ భూర్భువస్సువరోమితి దిగ్బంధః". అనవలెను.

ధ్యానమ్–

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామభాగమ్
వీరాసనస్థం కపిబృందం సేవ్యమ్
స్వ పాదమూలం శరణంగతానామ్
అభీష్టదం శ్రీహనుమంత మీడే॥
పిదప ధ్యానమ్ అని పై శ్లోకముచదు వవలెను.

తా॥ సువర్చలాదేవి అధివసించినిన వామభాగముగల వీరాసనమున కూర్చొనియున్న, కోతిమూకచే సేవింపబడు, తనపాదములకు శరణుజొచ్చినవారికోర్కెలుతీర్చు శ్రీహనుమంతుని సేవించుచున్నాను.

గ్రంథాంతరే–

శ్లో॥ భక్తకల్పతరుం సౌమ్యం–లోకోత్తరగుణాకరమ్
సువర్చలాపతిం వన్దే–మారుతిం వరదం సదా ॥

తా॥ కొన్ని గ్రంథములలో ఇది ధ్యానశ్లోకముగానున్నది–భక్తులకు కల్పవృక్షమువలె కోర్కెలిచ్చువానిని, సౌమ్యుడైన, లోకమునందెల్ల గొప్ప గుణములుకల సువర్చలా పతియగు వరములనిచ్చు మారుతికి యెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో॥ పద్మాసనం సమాస్థాయ–పూర్వాభిముఖతో నరః
ప్రాతఃకాల ఉపక్రమ్య–అపరాహ్ణే జపే న్మనుమ్ ॥

తా॥ పద్మాసనమందుకూర్చొని తూర్పుదిక్కునకు తిరిగి ప్రాతఃకాలమున నారంభించి మధ్యాహ్నముదాటు వఱకు మంత్రమును జపించవలెను

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చేత్-పూజితా స్సర్వదేవతాః
హనుమన్మహిమా శక్యో-బ్రహ్మణాపి న వర్ణితుమ్ ॥

తా॥ ఆంజనేయుడు పూజింపబడినచో సర్వదేవతలు పూజింపబడినట్లే. హనుమంతుని మహిమ వర్ణించుటకు బ్రహ్మకైన శక్యముకాదు.

శ్లో॥ సింధు సంగమమధ్యే తు-నదీతీరే విశేషతః
హనుమత్సన్నిధౌ వాపి-గృహమధ్యే విశేషతః ॥

తా॥ ఆజపమును నదీసముద్రములు కలియుచోటుగాని, నది యొక్క ఒడ్డునకాని, ఇంటియందు హనుమంతునెదుటగాని

శ్లో॥ అశ్వత్థతరుమూలే తు-పర్వతాగ్రే తథైవ చ
అయుతం తు పురశ్చర్యా-మితాహారో జితేంద్రియః

తా॥ రావిచెట్టుమొదటకూర్చొనికాని, కొండ పైభాగమున కాని మంత్రపురశ్చర్యచేయవలెను. అట్టిసమయమున పరిమితమగు భోజనము తీసుకొనువాడగును. ఇంద్రియనిగ్రహముకలవాడుగను నుండవలెను.

శ్లో॥ జపమధ్యేఒప్యథశ్శాయీ-హవిష్యం భక్షయే త్తతః
ప్రథమేఒహ్ని యథాహారః-అసమాప్తి తథైవ చ

తా॥ జపము చేయుకాలమున నేలపై పరుండవలెను. హోమము చేయగా మిగిలిన పదార్థమునే భుజింపవలెను. మొదటిరోజెట్టి నియమములతో నాహారము తీసికొనెనో చివరివరకు నట్లే గ్రహించవలెను.

శ్లో॥ దశాంశం తర్పయే ద్ధీమాన్-తద్దశాంశం హునే త్తథా
పాయ సాపూప దధ్యన్నైః-బ్రాహ్మణాన్ భోజయేత్తతః॥

తా॥ జపించిన దానిలో పదవవంతు తర్పణము, అందు పదవవంతు హోమము ఆచరించి పాయసము, అప్పములు, దధ్యోదనములతో పిదప బ్రాహ్మణులకు తృప్తిగా భోజనము పెట్టవలెను.

శ్లో॥ గోక్షీర శర్కరాజ్యైశ్చ-తర్పణం తు సమాచరేత్
మధ్వాజ్య శర్కరాభిశ్చ అపూపైశ్చ హునే త్తతః॥

తా॥ ఆవుపాలు, పంచదార, ఆవునేతులతో తర్పణము చేయ వలెను, పిమ్మట తేనె, నేయి, పంచదార, అప్పములతో హోమము చేయ వలెను.

శ్లో॥ ఖర్జూర కదళీభిశ్చ-నారికేళఫలై స్తథా॥
మల్లికా జాతిపుష్పై శ్చ-చంపకైః స్తథా॥
హునే దష్టోత్తరశతం-కుబేరపదృశో భవేత్
సురరాజసమం లోకే-ఐశ్వర్యం శాశ్వతం ధ్రువమ్॥

తా॥ ఖర్జూర పండ్లు, అరటి పండ్ల కొబ్బరికాయలు, మల్లి జాజి, సంపెంగమున్నగుపూలతోను నూటయెనిమిది పర్యాయములుహోమముచేసిన నతడు కుబేరునితో సమానుడగు ధనవంతుఁడగును. దేవేంద్రునివలె అచంచల మగు ఐశ్వర్యమేర్పడును,

శ్లో॥ హనుమత్ప్రజయా నిత్యం-సర్వలోకో వశో భవేత్
ఏతస్యైవ జపే నేంద్రో-వృత్రాసుర మసూదయత్॥

తా॥ హనుమదనుగ్రహముచే నట్టివానికి లోకమంతయు వశీభూత మగును. ఈ జపముచేతనే ఇంద్రుఁడు వృత్రాసురుని సంహరించెను.

శ్లో॥ ఇమం జప్త్వా భీమసేనో-జరాసంధ మసూదయత్
స్వాత్రవికార సిద్ధ్యర్థ-మేత ద్బ్రహ్మా జజాపహ॥
ఏనం విభీషణా ల్లబ్ధ్వా-తాక్షర్యోఒప్యమృత మాహరత్॥

తా॥ ఈ మంత్రమును జపించియే భీముడు జరాసంధుని సంహ రించెను. బ్రహ్మకూడ తన అస్త్రము సఫలమగుటకు జపించెను. విభీషణుని వలన ఈ మంత్రమును పొంది గరుడుడమృతమును తీసికొనిపోగల్గెను.

శ్లో॥ గర్గాచార్యా దిమం లబ్ధ్వా-సీతా సా జనకాత్మజా
ఇఘాన లీలయా పూర్వం-శతానన మహాసురమ్॥
ఏత న్మంత్రపురశ్చర్యా-కృతా పూర్వం మహాత్మభిః॥

తా॥ గర్గమహామునివలన జనకుని కుమార్తెయగు సీత ఈ మంత్రమునంది శతకంఠరాక్షసుని సునాయాసముగా చంపెను. పూర్వ మీ మంత్ర పురశ్చర్య అనేకులగు మహాత్ములచే చేయబడినది.

## శ త కం ఠ వ ధ

శ్రీమైత్రేయః

శ్లో॥ శతాననవధం సీతా-కథం కృతవతీ పురా
రామే చ లక్ష్మణే చైవ-శత్రుఘ్నే భరతే స్థితే ॥

తా॥ మైత్రేయమహాముని ఇట్లడిగెను. ఓపరాశరమహామునీ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులుండగా శతాననుని సీత ఎందుకు వధించ నది?

శ్లో॥ హనూత్యపి సుగ్రీవే-తత్సర్వం వర్ణ్యతాం మునే!
శ్రోతు మిచ్ఛామ్యహం బ్రహ్మన్-పరం కౌతూహలంహి మే॥

తా॥ హనుమంతుడు,సుగ్రీవుడును కలరు కదా!అట్లు సీతఎందు! చంపెనో చెప్పవలసినది. వినగోరుచున్నాను.ఓ మహామునీ నా కా చరితము విన మిక్కిలి యుత్సుకత దిగుచున్నది.

శ్రీ పరాశరః-

శ్లో॥ సీతాయా శ్చరితం వక్ష్యే-కల్యాణం శ్రుణు తత్త్వతః
యా లోకమాతా శ్రీ విష్ణోః-వల్లభా జగదీశ్వరీ॥

తా॥ శ్రీపరాశరు లిట్లు చెప్పిరి. లోకమాతయు, విష్ణుమూర్తికి భార్యయు, జగదీశ్వరియైన సీతయొక్క మంగళప్రదమగు చరిత్రను తెల్పుచున్నాను. వినవలపినది.

శ్లో॥ రామః కమలపత్రాక్షః-సేతుం బద్ధ్వా మహోదధౌ
సుగ్రీవసచివ శ్రీమాన్-అవధీ ద్రావణం రణే ॥

తా॥ కమలలోచనుడగు రాముఁడు సముద్రమున వారధి గట్టి సుగ్రీవుఁడు మంత్రిగాఁగలవాడై యుద్ధమున రావణుని సంహరించెను.

శ్లో॥ స్వాత్మానం రాఘవో మేనే-కృతార్థం దైత్యనాశనాత్
ఏతస్మి న్నంతరే వాణీ-అంతరిక్షే జగాద తం ॥

తా॥ శ్రీరాముఁడు యుద్ధమున దైత్యనాశనమొనర్చి కృతార్థుఁడనైతినని యనుకొనుచుండ ఆకాశవాణి ఇట్లు పల్కెను

శ్లో॥ శతయోజనభూతాబ్ధౌ-కియాన్ దశముఖాసురః
సహ స్రయోజనాబ్ధౌ తు-గగనే పరివర్తితః

తా॥ నూరామడలదూరంలో సముద్రమున కావలను పదితలలు కల రావణుని దేమున్నది? శ్రీ రామా! వేల యామడల దూరమువనుండు ఆకాశమునందు తిరుగు మహా బలపరాక్రమములుకల నూఱుతలల వాడున్నాడు.

శ్లో॥ అజేయ స్సర్వభూతానాం-జహి తందైవవైరిణమ్

తా॥ వాడు సర్వప్రాణులకు జయింపనలవికాడు కాన నీవు ఆదేవతాశత్రువును చంపుము.

శ్లో॥ తచ్ఛ్రుత్వా రాఘవో ధీమాన్-అభూ చ్చింతాపరాయణః
శతయోజనవి స్తీర్ణం-సముద్రే సేతుబంధనం
కృత్వా కష్టదశాం ఘోరాం-సంప్రాప్తా వానరా ఇతి॥

తా॥ అదివిని రాముడు ఇట్లాలోచించెను శతయోజన ముల సముద్రసేతుబంధనము నేర్పరచి వానరులు మిగుల కష్టపడసంభవించియున్నారు

శ్లో॥ సాహస్రయోజనాంభోధౌ-సేతోర్బంధనం యథా
అతీవదుస్తరం హ్యేత-దితి చింతాం కరోతి సః ॥

తా॥ వేయియోజనములదూరము సముద్రమునకు వారధి కట్టుట మిక్కిలి అసాధ్యముకదా యని అతడు చింతించెను.

శ్లో॥ త మువాచ మహాతేజా-హనుమాన్ మారుతాత్మజః

తా॥ అప్పుడాతనితో మహాబలవంతుడగు వాయుపుత్రుడగు హనుమంతుఁ డిట్లనెను.

శ్లో॥ ప్రసార్య లాంగూల మహం-సహస్రయోజనా వతి
అత్యంతకాయ సంయుక్తః-తిష్ఠామి వరుణాలయే ॥

తా॥ నేను వేయియోజనములుమించి తోకనుపెంచి మిక్కిలి పెద్దదైన దేహముదాల్చి సముద్రమునందుండెద.

శ్లో॥ స ప్తసాగరపర్యన్తం-వర్ధయిష్యామి సేతువత
లాంగూలే నాంబుధిం తీర్త్వా-జహి తం హి శతాననమ్ ॥

తా॥ సప్తసముద్రములవఱకును వంతెనవలె నాతోకను పెంచుదును. ఆతోక ఆధారముతో సముద్రమునుదాటి ఆ శతాననుని చంపుము

శ్లో॥ ఇత్యుక్త్వా దీర్ఘలాంగూలం-ప్రసార్య పవనాత్మజః
మార్గం కృత్వా సముద్రాంత-మతిష్ఠత్తత్ర సంస్థితః ॥

తా॥ అని పల్కి ఆంజనేయుడు తోకనుపొడిగించి సముద్రమంతను చివఱవఱకు మార్గమేర్పడునట్లు నిలిచెను.

శ్లో॥ మూర్ఛితాన్ రాఘవాన్ దృష్ట్వా-సీతా చింతాకులాభవత్
ఏతస్మి న్నంతరేగర్గః-సమాగత్య మహామునిః
ద్వాదశార్ణం మనుం తస్యై-దదౌ సీతా జజాప చ
తస్మా త్ప్రసన్నో హనుమాన్-అభవ ద్విశ్వరూపభృత్॥

తా॥ మూర్ఛనందిన రామాదులను చూచి సీత మిక్కిలి వగచెను. ఇంతలో గర్గమహాముని వచ్చి సీతకు ద్వాదశాక్షరమంత్రము నుపదేశింప నామె జపించెను. అందుల కనుగ్రహించిన హనుమంతుడు విశ్వరూపము దాల్చెను.

శ్లో॥ వానరం ముఖ మేకం తు-ద్వితీయం సింహవక్త్రకమ్
తృతీయం గారుడం వక్త్రం-చతుర్థం సౌకరం ముఖమ్॥
హయాననం పంచమం చా-ప్యేకైకం నయనై స్త్రిభిః
దశబాహు సమోపేతం-దశాయుధ సమన్వితమ్॥

తా॥ఆ విశ్వరూపమున మొదటిది కోతి ముఖము, రెండవది సింహ ముఖము, మూడవది గరుత్మంతుని ముఖము. నాల్గవది పంది ముఖము, ఐదవ వది గుఱ్ఱపుముఖమునై ఒక్కొక్కటి మూడు నేత్రములుకలదై యుండ పదిచేతులు, పది చేతులందు పది ఆయుధము లు నుండెను

శ్లో॥ తదా ప్రభృతి కథితః-పంచాస్యోహనుమా నితి
రూపం తస్య బభౌ యద్వత్-రుద్రస్య పురఘాతినః॥

తా॥ అప్పటినుండి ఆంజనేయుడు పంచముఖ హనుమానుడు అనియనబడెను. అతని రూపము త్రిపురాసుర సంహారమందలి రుద్రుని ముఖమువలె ప్రకాశించెను.

శ్లో॥ శతాననానాం సర్వేషాం-యావంతి వదనాని వై
తావంతో పంచవదనా-బభూవ కపికుంజరః

తా॥ శతాననులందరికికలసి యెన్ని ముఖములున్నవో అన్ని పంచముఖాంజనేయ రూపములుగా ఆతడయ్యెను.

శ్లో॥ తతో హనూమాన్ స్వస్కంధే-చారోప్య జనకాత్మజామ్
భయ మాపాదయామాస-రాక్షసానాం దురాత్మనామ్॥

తా॥ పిమ్మట హనుమంతుఁడు సీతామతల్లిని తన భుజముపై ఎక్కించుకొని దుర్మార్గులగు రాక్షసులకు భయమును కల్గించెను.

శ్లో॥ తత స్సీతా భగవతీ-కాళీరూపం దధౌ ద్రుతమ్
భయంకరీ బభూ వాథ-యుయుధే శరవర్షిణీ॥

తా॥ పిమ్మట లోకమాతయగు నామె వెంటనే కాళీరూపమై భయంకరమై బాణములు కురిపించుచు యుద్ధమొనర్చెను.

శ్లో॥ తద్యోద్ధ మభవ ద్ఘోరం-సీతాయా రక్షసాం తథా
రక్షో రక్తార్ద్రి రేణూత్థ-రక్షసాన్వీక్ష్యవిస్మితః

తా॥ ఆ సీతామతల్లికి రాక్షసులకు జరిగిన యుద్ధము భయంకరమయ్యెను. రాక్షసుల రక్తముచే తడిసిన రేణువుల నుండి యేర్పడు రాక్షసులను చూచి హనుమంతుఁడాశ్చర్యమందెను.

శ్లో॥ తస్తో విస్తీర్య లాంగూలం-హనుమాన్ రక్తపాతనే
అభావా ద్రక్తపాతస్య-క్షితౌ నష్టా శ్శతాననాః॥

తా॥ అంత హనుమంతుఁడు తన తోకను బాగుగా విసరింప జేసి రక్తము పడుచోటంతను వ్యాపించెను. రక్తము నేలపై పడకపోవుటచే పడిపోయిన రాక్షసులు నష్టమై తరిగిపోజొచ్చిరి.

శ్లో॥ సీతాయా శ్శరవర్షేణ-చైక ఏ వావశేషితః
తత స్సీతా మహాఘోరం-శర మగ్నిశిఖోపమమ్
సంధాయ ధనుషి శ్రేష్ఠ-మీద మహ సుమధ్యమా ॥

తా॥ సీతయొక్క బాణవర్షముతో ఒక్క శతాననుడు మాత్రము మిగిలెను, అంత సీత భయంకరమగు అగ్నిజ్వాలలతో పోల్చదగిన బాణమును వింటియందుగూర్చి నెన్నడుముకల ఆమె ఇట్లనెను.

శ్లో॥ ఏకపత్నీవ్రతో రామో-యద్యహం పతిదేవతా
పత త్యనేన బాణేన-శతానన శిరో మహత్ ॥

తా॥ శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతుడైతే, నేను పతియే దైవముగానెంచుదాననైతే ఈ బాణముచేతనే శతాననుని శిరస్సు పడిపోవలెను.

శ్లో॥ ఇత్యుక్త్వా జానకీ బాణాత్-పాతయామాస తచ్ఛిరః
తా॥ అని సీతాదేవి బాణమువీడి వానిశిరస్సును పడవైచెను.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ-నేదు ర్దుందుభయో దివి-
వానరాశ్చ నరాశ్చైవ-సంతుష్టా స్సకలాభవన్ ॥

తా॥ దేవతలు పుష్పవర్షము కురిపించిరి, దేవదుందుభులు మ్రోగినవి. నర వానరాదు లందఱు మిక్కిలి సంతసించిరి.

శ్లో॥ తేషాం సంతోషఘోషేణ-రాఘవా స్సహసోత్థితాః
సీతాంద్రుష్ట్వా హనూమంతం-శ్రీరామో వాక్య మబ్రవీత్ ॥

తా॥ వారందఱి సంతోష శబ్దములతో సోదరులతోడి రాముడు హఠాత్తుగాలేచెను. సీతను హనుమంతునిచూచి శ్రీరామచంద్రు డిట్లనెను.

శ్లో॥ యువయో ర్విశ్వరూపం చ-మమ దర్శయితుం క్షమమ్
సీతా చ హనుమాంశ్చైవ-తదా శ్రీరామ మూచతుః ॥

తా॥ మీ మీ విశ్వరూపములను నాకు చూపవలసినది అని. అంత సీతామతల్లియు, అంజనేయుఁడును శ్రీరామ చంద్రునితో నిట్లనిరి.

శ్లో॥ స్వరూప మావయోర్దృష్ట్వా-భీత స్త్వం భవసి ధ్రువమ్
ఉవాచ ప్రహసన్ వాక్యం-తా వుభౌ రఘునందనః ॥

తా॥ మా నిజరూపములనుచూచిన మీరు తప్పకభయము నందెదరు. అనగా శ్రీరామచంద్రుఁడు నవ్వుచు వారితో నిట్టనెను.

శ్లో॥ జ్ఞాత ఏవ ప్రభావో వా-మతిదేవోఽతిదానవః
ఇతి ప్రశంస్యమానౌ తౌ-పరమాం ముద మాపతుః ॥

తా॥ మీఇర్వురియొక్క ప్రభావము మానవులకు, దేవతలకు, రాక్షసులకు మించినదియే అని కొనియాడగా వారిరువురు నానందించిరి.

శ్లో॥ హనూమంతం చ సీతాం చ స్తుత్వా జగ్ము ర్యథాకతాః
సీతాయా విజయం చైవ-ప్రభావం చ హనూమతః
యః పఠేచ్ఛృణుయా ద్వాపి-సర్వాన్కామా నవాప్నుయాత్।

తా॥ అచటివారెల్లరు హనుమంతుని, సీతను స్తోత్రము చేసి వారివారితావుల కేగిరి. సీతయొక్క విజయము, హనుమంతుని ప్రభావము ఎవరు పఠింతురో లేక విందురో వారు సమస్తములగు కోర్కెలను పొందుదురు.

యంత్రోద్ధారము-

శ్లో॥ అథ పూజా విధానార్థం-యంత్రలక్షణ ముచ్యతే
సర్వయంత్ర శ్రేష్ఠతమం-భుక్తిముక్తి ఫలప్రదమ్॥

తా॥ ఇక పూజావిధానము కొఱకు యంత్ర లక్షణము చెప్పబడుచున్నది. ఇది అన్ని యంత్రములకంటెను శ్రేష్ఠమైనది. భుక్తిని, ముక్తిని ప్రసాదించునదికూడ.

శ్లో॥ ప్రథమం వర్తులం లేఖ్యం-అష్టకోణం చ విన్యసేత్
తద్బహిర్వృత్త మాలిఖ్య-షోడశాబ్జం చ లేఖయేత్॥

తా॥ మొదట పెద్ద వృత్తమును గీచి దానియందు ఎనిమిది కోణముల నుంచవలెను. దానివెలుపల వేఱొకవృత్తముగీచి దానికి పదునారు దళములను వ్రాయవలెను,

శ్లో॥ తద్బహి ర్వృత్తమాలిఖ్య-లేఖయే ద్భూపురద్వయమ్
తతఃపరం చతుర్ద్వారం-సుందరంత ద్విలేఖయేత్॥

తా॥ దానివెలుపల వేఱొకవృత్తము గీచి దానిపై భూపురములు రెండు గీయవలెను, అనంతరము నాలుగుమార్గు సుందరరీతి లిఖింపవలెను.

శ్లో॥ పరమోత్కృష్ట మోంకారం-యంత్రమధ్యే విలేఖయేత్
అష్టాక్షరీ మహామంత్రం అష్టకోణేషు లేఖయేత్॥

తా॥ శ్రేష్ఠమగు "ఓం" కారమును యంత్రమధ్యమున వ్రాయ వలెను. ఎనిమిదికోణములందును అష్టాక్షరీ మహా మంత్రమును లిఖింప వలెను.

శ్లో॥ ఏకాక్షరీ మహామంత్రం-దేవస్య శ్రీహనుమతః
షోడశాబ్దే చతుర్ష్వేవ-దళే ష్వేవం విలేఖయేత్ ॥

తా॥ శ్రీ హనుమంతుని ఏకాక్షరీ మహామంత్రమును పదునారు దళములు కలవానిలో నాల్గింట వ్రాయవలెను.

శ్లో॥ షోడశాబ్జే మహారమ్యే-పత్త్రేషు ద్వాదశ స్వపి
సువర్చలా హనుమతో-ర్లేఖయే ద్ద్వాదశాక్షరీమ్ ॥

తా॥ షోడశదళములలోని మిగిలిన పండ్రెండు దళములందు శ్రీ సువర్చలా హనుమద్ద్వాదశాక్షరి వ్రాయవలెను.

శ్లో॥ భూపురాణాం షోడశాబ్జ-దళానాం మధ్యభాగతః
అష్టాక్షరీమంత్రరాజం-చతురాశాసు లేఖయేత్ ॥

తా॥ షోడశాబ్జదళ పద్మపు భూపురముల మధ్యభాగమున నాల్గు దిక్కులందును అష్టాక్షరీ మంత్రరాజమును లిఖింపవలెను

శ్లో॥ చతుర్వింశ త్యక్షరం చ-భూపురేషు విలేఖయేత్

తా॥ భూపురములందు హనుమచ్చతుర్వింశత్యక్షరమంత్రమును వ్రాయవలెను.

శ్లో॥ యథా మాతా సుతం రక్షేత్-యథా యుద్ధేషు కంచుకమ్
తథా రక్షేత్ మహాయంత్రం-త దేహే యస్య చాస్తి చేత్ ॥

తా॥ యెవని ఇంటియందీయంత్రముండునో వానిని ఈ మహ యంత్రము బిడ్డను తల్లి సంరక్షించునట్లు, యుద్ధమున కవచము రక్షిం నట్లు రక్షించును.

శ్లో॥ తామ్రే వా రజతే వాథ-సువర్ణే వా విశేషతః
యంత్రం లిఖిత్వ ప్రాణస్య-ప్రతిష్ఠా మాచరే త్తతః ॥

తా॥ రాగిరేకునకాని, వెండి రేకున లేదా విశేషముగా బంగారురేకునకాని యంత్రమును లిఖించి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. యంత్ర విధాన మంతయు గురుముఖతః గ్రాహ్యము.

శ్లో॥ సూర్యేందు గ్రహణే కాలే-పుణ్యక్షేత్రే నదీతటే
అష్టోత్తరశతం సూర్య-సంఖ్యాక్షరమనుం జపేత్॥

తా॥ సూర్యచంద్రగ్రహణసమయముల పుణ్యక్షేత్రమున లేదా నదీతీరమున ద్వాదశాక్షరమంత్రమును నూటయెనిమిదిమార్లు జపింపవలెను.

శ్లో॥ మధ్వాజ్య శర్కరా క్షీరైః-అభిషేకం సమాచరేత్
షోడశై రుపచారైశ్చ-పూజయే ద్యంత్ర ముత్తమమ్ ॥

తా॥ తేనె, ఆవునేయి, పంచదార, ఆవుపాలతో అభిషేకము చేయవలెను. పిదప ఉత్తమమగు నాయంత్రమును షోడశోపచారములతో పూజింపవలెను.

శ్లో॥ సర్వకామప్రదం నృణాం-మందవారే విశేతః
ప్రత్యహం పూజయే ద్యంత్రం-తత్ర లక్ష్మీ రచంచలా॥

తా॥ ఈ యంత్రము మనుజులకు అన్ని కోర్కెలను తీర్చును. ప్రతిదినము దీనిని పూజింపవలెను. శనివారము పూజించుటచే విశేషఫలము. ఎచ్చట ఈ యంత్రము పూజింపబడునో అచ్చట లక్ష్మి స్థిరముగానుండును.

శ్లో॥ యంత్రపూజా యస్యగేహే-తత్ర చోరాగ్ని నాశనమ్
రక్షో భూతపిశాచేభ్యో-భయం నాస్తి న సంశయః ॥

తా॥ ఈ యంత్రపూజ జరుగునింట దొంగ, నిప్పు, రాక్షస, భూత, పిశాచ భయములుండవు. ఇది నిశ్చయము.

శ్లో॥ రాజద్వారే రణద్వారే-యంత్రధారీ న సీదతి
అరణ్యే వ్యాఘ్రసింహాద్యే-న హి తస్య భయం క్వచిత్॥

తా॥ ఈ యంత్రమును ధరించినవానికి రాజద్వారమున, యుద్ధమున భయములేదు; పులులు సింహములుకల అరణ్యమునందును అట్టి వానికి ఏమాత్రము భయములేదు.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పంచముఖ హనుమన్మహామంత్ర వివరణే పరాశర మైత్రేయ సంవాదే శ్రీసువర్చలాంజనేయద్వాదశాక్షరమంత్ర కథనం నామ సప్తమపటలః

అష్టమ పటలః

## ధ్వజదత్త చరితం

మైత్రేయః-

శ్లో॥ పరాశర ! మహాప్రాజ్ఞ ! హనుమన్మంత్ర వైభవమ్
భూయోఽపి శ్రోతు మిచ్ఛామి-కృపయా వద మే ప్రభో !

తా॥ మైత్రేయ మహాముని యడుగుచున్నాడు. మహాప్రాజ్ఞా ఓ పరాశర మహామునీ ! హనుమన్మంత్రము యొక్క గొప్పతనము నింకను వినగోరుచున్నాను. కాన దయతో నాకు చెప్పవలసినది.

శ్లో॥ కేన చాదౌ పురాజప్తం-హనుమన్మంత్ర ముత్తమమ్?
కే నో పదిష్టం గురుణా-కస్మై శిష్యాయ ధీమతే ?

తా॥ ఈ ఉత్తమ హనుమన్మంత్రము పూర్వ మెవరిచే మొదట జపించబడినది ? ఏ గురువుచే నే శిష్యునకు ఉపదేశింపబడినది ?

శ్లో॥ కస్య సిద్ధి ప్రదం శీఘ్రం-జప్తం విశ్వాస పూర్వకమ్
విలంబితం ఫలం కస్య ? తత్సర్వం ప్రతిపాద్యతామ్ ॥

తా॥ విశ్వాసముతో జపించినఎవరికిది సిద్ధి నొసంగినది? ఆలస్య

ముగా ఫల మెవరి కందినది ? ఈ వృత్తాంతమంతయు చెప్పవలసినది.

శ్రీ పరాశర ః—

శ్లో॥ ఇతిహాసం మహా పుణ్యం—శ్రోతౄణాం సర్వకామ్యదమ్
సర్వపాపహరం నృణాం—నారీణాం వా విశేషతః ॥

తా॥ శ్రీ పరాశరులు చెప్పుచున్నారు. మైత్రేయా! మహాపుణ్యప్రదమై, వినువారికోర్కెలీడేర్చునదై ఒక ఇతిహాస మున్నది. అది నరులకు, విశేషించి స్త్రీలకును పాపము లన్నిటిని పోగొట్టునదై యున్నది.

శ్లో॥ సనత్కుమార వదనాత్—శ్రుత్వేమం బ్రహ్మ సంసది
యథాశ్రుతం ప్రవక్ష్యామి—శ్రుణుష్వ మునిసత్తమ!

తా॥ బ్రహ్మదేవుని సభయందు సనత్కుమారుని వలన విన్నది విన్నట్టు చెప్పుచున్నాను ఓ మునీంద్రా! వినుము.

శ్లో॥ పురా కృతయుగే భూమౌ—పుష్కరాఖ్యో మహాముని ః ॥
సర్వశాస్త్రార్థతత్వజ్ఞః—సర్వాగమ విశారదః॥

తా॥ పూర్వము కృతయుగమున భూలోకమున పుష్కరుడను పేరుగల సర్వశాస్త్రములు, తత్వములు, ఆగమములు తెలిసిన మహాముని కలడు.

శ్లో॥ శాంతో దాంత స్సదాచారః—శ్రద్ధావా ననసూయకః
సర్వవేదార్థ సారజ్ఞః—సదా మంత్రార్థ తత్పరః ॥

తా॥ అతడు అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము కలవాడు, మంచి యాచార నియమములు, శ్రద్ధకలవాడు అసూయ లేనివాడు సమస్త వేదార్థసారములు తెలిసి యెల్లప్పుడు మంత్రవిచారమున నుండువాడు.

శ్లో॥ ఏవం సర్వగుణోపేతః—హనుమాన్భక్తిమా న్మునిః
కదాచి దాత్మనో జప్తుం—హనుమన్మంత్ర ముత్తమమ్
నైమిశారణ్య మాకీర్ణం—సర్వై ర్మునిగణై స్సదా
సిద్ధాశ్రమ మితి జ్ఞాత్వా—సిద్ధయోగి సమావిశత్ ॥

తా॥ అట్లు సర్వగుణములుకల్గి హనుమద్భక్తిపరుఁడైన ఆముని యొకప్పుడు హనుమన్మంత్రమును జపించుటకు ఎల్లప్పుడు మునులందఱితో కూడియుండునదియగు నైమిశారణ్యము సిద్ధాశ్రమమును యెఱింగి ఆతఁడందు ప్రవేశించెను.

శ్లో॥ తత్రగత్వా మహాయోగీ-పుష్కరః పుష్కరేక్షణః
జజాప పరమం జప్యం-హనూమన్మంత్ర ముత్తమమ్ ॥

తా॥ అటకేగి పద్మనేత్రుఁడగు ఆ పుష్కరమహాయోగి ఉత్తమమగు, జపింపయోగ్యమగు హనుమన్మంత్రమును జపించెను.

శ్లో॥ సిద్ధత్వా న్మంత్రరాజస్య-ఫలవ్యగ్రో న చా భవత్
నాపేక్షాం కురుతే తస్మిన్-సదా మంత్రరతో భవేత్ ॥

తా॥ ఆ మహామంత్రము యొకసిద్ధివలన ఫలముచే కలతనందినవాడు కాలేదు. అట్టిఫలాపేక్షచూపక ఎల్లప్పుడు మంత్రమునందే నిమగ్నుడాయెను.

శ్లో॥ అథాస్మి న్నంతరే బ్రహ్మన్-ధ్వజదత్తాహ్వయో ద్విజః
వేదవేదాంగ సారజ్ఞః-దరిద్రో బహుపుత్రవాన్ ॥

తా॥ మైత్రేయమహామునీ! ఇంతలో వేదవేదాంగముల సారమెఱిగిన, దరిద్రుఁడును, మిక్కిలి సంతానముకల ధ్వజదత్తుడను బ్రాహ్మణుడు-

శ్లో॥ ఉపాదానరతో నిత్యం-గృహ్ణాతి సత్కుటుంబినః
నాలం క్షుదార్తయే తస్య-శిశూనాం ధాన్య మార్జితమ్॥

తా॥ ఉపాదానమునందు నిమగ్నుడై గృహస్థులగు మంచివారికడ ధాన్యము గొనివచ్చుచుండెను. కాని యది అతని బిడ్డల ఆకలి దీర్చుటకు చాలకుండెను.

శ్లో॥ శాకహారేణ తద్భార్యా-జీవనం కురుతే స్వకమ్
శీలానామ సుశీలా చ-మహాసాధ్వీ కుటుంబినీ ॥

తా॥ ఆతని భార్య శీలా అను పేరుకల గుణవతి, ఉత్తమ గృహిణి. ఆమె శాకాహారముతోనే తన జీవితము గడుపజొచ్చెను.

శ్లో॥ కదాచిదపి నోవేత్తి-హ్యన్నం వా సిద్ధమాత్రకమ్
పాతివ్రత్యా ద్వివేకాచ్చ-సా నోపాలభతే పతిమ్॥

తా॥ ఆమె ఎన్నడును కమికెడన్నము తినియెఱుగదు. అయినను పతివ్రతయు. విజ్ఞానవతియు నగుటవలన లేమిని గూర్చి భర్తను నిందించి యెఱుగదు.

శ్లో॥ నిజకర్మఫలం నూనం-భోక్తవ్యమితి జానతీ
పతిం శుశ్రూషమాణా సా-న చ కంపే క్షుధావతీ॥

తా॥ చేసిన కర్మఫలము ననుభవింపక తీరదని తెలిసిన దగుట వలన ఆకలిచే నటమటించినను చలింపక పతిని సేవించుటయందు నిమగ్న మయ్యెడిది.

శ్లో॥ శోకమాత్రేణ సా సాధ్వీ-బహుకాలం నినాయహ
న వివేద పతి స్తస్యాః-శాకాహారం కదాచన॥

తా॥ ఆ ఉత్తమురాలు ఏడ్పుతోనే చాలకాలము గడిపెడిది. ఆమె శాకాహారమును భుజించుట నెన్నడును ఆమెపతి తెలిసికొనలేదు.

శ్లో॥ అన్నం భుక్త్వావశిష్టం తు- భోక్షతీ త్యేవ మన్యతే
సాపి న ప్రేయసీ ప్రాహ-నా న్నం మేఽస్తీతి భామినీ॥

తా॥ అతఁడు భోజనముచేసి మిగిలిన దామె తినుచున్నదని భావించువాఁడు. ఆతని ప్రియురాలు, ఉత్తమురాలగు నాయింతికూడ నాకు అన్నములేదని యెన్నడు చెప్పలేదు.

శ్లో॥ ధ్వజదత్తో మహాప్రాజ్ఞ-ఉపాదానరతోఽపిసన్
అధ్యాపయన్ బహూన్ విప్రాన్-తస్థౌ స్వబ్రహ్మచారిణః॥

తా॥ మహావిజ్ఞాన సంపన్నుఁడగు ధ్వజదత్తుఁడు ఉపాదానమునందు నిమగ్నుఁడగువాఁడైనను అనేక బ్రాహ్మణుల కువిద్య చెప్పుచు వారితోగూడి యుండువాడు

శ్లో॥ అ థాసీనో బహిర్వేద్యాం-పరీక్షాం కర్తు ముద్యతః

తా॥ అటు పిమ్మట వీధియరుగుపై కూర్చుండి పరీక్ష జరుపు చుండెడు వాఁడు.

శ్లో॥ సామగాన్ కతిచి ద్విప్రాన్-యాజుషాన్ బహ్వృదా నపి
అన్యా నాథర్వణాం శ్చైవ-గాంధర్వా నపి గారుడాన్॥
హనుమద్వేదశిరసి-నిష్ణాతా నపి వై ద్విజాన్
మాండూకా నపి నానాం శ్చ-తాన్ పరీక్షితవాన్ ద్విజః॥

తా॥ కొందఱు సామగానాధ్యయన మొనర్చిన విప్రులను, యజు ర్వేదులను, అథర్వణవేదులను, సంగీత, గారుడాదిక విద్యల వారిని హనుమ ద్వేదవిజ్ఞాన నిపుణులను, మాండూకోపనిషదుపజ్ఞులగు బ్రాహ్మణులను పరీ క్షించుచుండెను.

శ్లో॥ ఆహూతవా న్నిజం పుత్త్రం-ధ్వజదత్తః పరీక్షితుమ్
ఆహూతోఽపి న నిష్క్రాంతః-క్షుధార్తో మాతృసన్నిధేః॥

తా॥ ధ్వజదత్తుఁడు తన పుత్రునే పరీక్షించుటకు పిలచెను పిలు బడియు నాతఁడు ఆకలి బాధచే తల్లినుండి రాలేదు,

శ్లో॥ క్షుధితాపి మహాసాధ్వీ శాకాహారం స్వకం దదౌ

తా॥ ఆమె ఆకలితో నున్నను ఉత్తమ ఇల్లాలగుటచే తనశా హారముకూడ బిడ్డ కిచ్చివైచెను.

శ్లో॥ పుత్రాయ క్షుధితా యాసు-పరీక్షా దీయతా మితి
పుత్రే చిరాయమాణే తు-ధ్వజదత్త ఉపాగమత్॥

తా॥ ఆకలిగొన్న పుత్రుని శీఘ్రముగనే పరీక్షజరుపనెంచి కుమారుడాలస్యము చేయుచుండ ధ్వజదత్తుడే వాని కడకేగెను.

శ్లో॥ దదర్శ భక్షమాణం తం-శాకం తన్మాతృసన్నిధౌ
అ ధాబ్రవీ త్సపుత్రాం తాం-ప్రేయసీం మితభాషిణీమ్
త్వయా కిం భక్ష్యతే సాధ్వి-యతో నా యాతి పుత్రకః॥

తా॥ తన తల్లివద్ద శాకమును తినువానిని చూచెను. పిమ్మట ప్రేయసియు, మితభాషిణియు. బిడ్డతో కూడియున్న ఆమెతో "సాధ్వి! నీవేమి తినుచున్నావు? ఏ కారణమువలన బిడ్డడు పిలచిన వచ్చుటలేదు? అని యడిగెను.

శ్లో॥ స్వవృత్త దర్శనా త్సాధ్వీ-లజ్జితా చ ముహుర్ముహుః
ఉచ్యమానాపి భర్త్రా సా-నోత్తరం ప్రతిపద్యతే॥

తా॥ ఆ ఉత్తమురాలు తనయభార్య విషయము బయల్పడుటచే సిగ్గిలి భర్తచే మున్మారడుగబడియు సమాధానము చెప్పలేక పోయెను

శ్లో॥ విలంభాసహమానస్సన్-శాకపాత్రం త మస్పృశత్
అన్నాభావా దిదం భుక్తం-ఇతి నిర్విణ్ణమానసః॥

తా॥ ఆలస్యమును కోర్వజాలక ఆ శాకముకల పాత్రను పట్టుకొనెను. అన్నము లేక పోవుటచే శాకముల భుజించుచున్నారని నిశ్చేష్టుడై విచారించి.

శ్లో॥ నినిం దాత్మాన మ దుర్బుద్ధిః-ధి గ్జీవన మిదం మమ
ప్రతం ధి జ్మే ఽఖిలం శాస్త్రం-ధి గాచార మి తీరయన్
యత సాధ్వీ మహాప్రాజ్ఞ-శాకాహారేణ జీవతి॥

తా॥ ఆసాధ్వి, జ్ఞానవతియనగు శీల శాకాహారము గ్రహించు చుండుటచే తన అసమర్థతకు తాను నిందించుకొనుచు ఈ నా జీవితము వ్యర్థము. అఖిలశాస్త్ర పరిజ్ఞానము వ్యర్థము, ఆచారాదులన్నీ వ్యర్థములు.అని భావించుచు

శ్లో॥ అ థోవా చ ప్రియాం విప్రః-దయ యావిష్టచేతనః
దుఃఖ గద్గదయా వాచా-ప్రేయసీ దైన్యదర్శనాత్॥

తా॥ పిమ్మట దయచే నావరింపబడినవాడై ప్రియురాలి దయాను యస్థితికి దుఃఖముచే గద్గదకంఠుఁడై ఆమెతో నీ విధముగాననెను.

శ్లో॥ యత్ర కుత్రా ప్యటన్ భార్యే! త్వ న్ముఖాంభోజ దర్శనాత్
విస్మృ త్యాధ్వపరిశ్రాంతిం-సద్యోనిర్వృతి మాప్నుయామ్॥

తా॥ ఓ సతీ! అటనట తిరిగితిరిగియు నీ ముఖపద్మమును చూచు టచే ప్రయాణబడలికవీడి సుఖమును వెంటనే పొందువాఁడను.

శ్లో॥ స్త్రీణాం పుత్రః ప్రియో భర్తుః-లోకే సర్వత్ర దృశ్యతే
మయి తే తు పరా ప్రీతిః-పుత్రేభ్యోఽప్యతిరిచ్యతే

తా॥ లోకమునందు స్త్రీలకు భర్తకంటె పిల్లవాఁడు ఇష్టుఁడుగ కన్పట్టును. కాని నాయందు నీకు బిడ్డలను మించిన ప్రేమకలదు.

శ్లో॥ ప్రసన్న వదనా నిత్యం-స్మితపూర్వాభిభాషిణీ
స్వప్నేఽపి ప్రతికూలా త్వం-న జానాసి హితైషిణీ॥

తా॥ నీవు ఎల్లవేళల ప్రశాంతముఖివై యుందువు. నవ్వుచ భాషింతువు. కలయందైన నెదురు పల్కుట నెరుగవు. కేవలం మేలుక మాత్రము కోరుదానవు.

శ్లో॥ జలం శాకం చ మూలం వా-త్వయా సంపూర్ణచిత్తయా
దత్తమశ్నా మ్యహం నిత్యం-అమృతం దేవతా యథా॥

తా॥ నీవు నిండు మనంబుతో నిచ్చిన సీటిని, కూరను, దుంప నైనను దేవతలమృతమును స్వీకరించునట్లు పుచ్చుకొనుచున్నాను.

శ్లో॥ యౌవనం మధ్యమే లోకే-ప్రసూత్యం తమి తీరితమ్
బహుపుత్రాపి రమ్యాత్వం-యథా షోడశవార్షికా ॥

తా॥ భూలోకమున బిడ్డ పుట్టు వఱకే యౌవనము అని చెప్పబడి నది. అనేకులను కన్నను నీవు పదునారేండ్ల చిన్నదానివలె రమ్యమైన దానవు.

శ్లో॥ వాసంతీ మాలికావ త్త్వం-యదాశయ్యా ముపక్షితా
తదాహం తృణవన్మన్యే-గంధర్వీం వా సురాంగనామ్ ॥

తా॥ వసంతఋతు సంబంధమగు మల్లెల మాలికవలె నీవు నా శయ్య యందు చేరినంతనే గంధర్వాంగనలను, దేవతాస్త్రీలను కూడా గడ్డి పోచవలె నెంతును.

శ్లో॥ అనుకూల్యాచ్చ నారీణాం-ప్రాతికూల్యం పరం స్మృతమ్
వియోగే ప్రతికూలాయాః-పతి స్సంతోష మిచ్ఛతి ॥

తా॥ పురుషునకు అనుకూలవతికన్న కొన్ని యెడల ప్రాతి కూల్యమే శ్రేయస్కరము. ప్రతికూల యొక్క వియోగమున పతి సంతోష మునే పొందును.

శ్లో॥ మత్పూర్వపుణ్యవిభవా- త్తవ దుష్కృతకారణాత్
మన్యే పాణిగృహీతాం మే-భవంతీ మమరాంగనామ్ ॥

తా॥ నా పూర్వ పుణ్యసంపదవలనను, నీ పాప కారణమునను నేను దేవకాంతవగు నిన్ను పెండ్లాడినట్లు తలచుచున్నాను.

శ్లో॥ అరుంధత్యా అహల్యాయా-ద్రౌపద్యా అపిసువ్రతే !
తారాయా అపి సీతాయా-స్సత్యవత్యా స్తథైవ చ
అన్యాసా మపి నారీణాం-పాతివ్రత్య మను త్తమమ్
ఇతిహాస పురాణాద్యైః-శ్రూయతే నైవదృశ్యతే ॥

తా॥ సాధ్వీ! అరుంధతి యొక్క, అహల్య యొక్క ద్రౌపది యొక్క, తార యొక్క, సీత యొక్క, అట్లే సత్యవతి యొక్కయు ఇంకను ఇతర శ్రేష్ఠ స్త్రీల గొప్ప చరిత్రలు విన్పడుచున్నవి కాని కన్పడుట లేదు.

శ్లో॥ భవత్యాం తు విశేషేణ-కాలేన మహతా ప్రియే!
పాతివ్రత్యపరాన్ ధర్మాన్-దృష్టవానస్మి సాంప్రతమ్ ॥

తా॥ ఓ ప్రియురాలా! చాలకాలమునకు నీ యందు విశేషమైన పాతివ్రత్య ధర్మములున్నట్లు చూడగల్గితిని.

శ్లో॥ కల్యాణగుణ పూర్ణత్వాత్-పశ్యతోఽహర్నిశం మమ
చక్షుష్మత్తైయ మన్వర్థా-చిరాయ చరితం ప్రతి ॥

తా॥ కల్యాణ పూర్ణముగ నుంట అహర్నిశము చూచినప్పటికి చాలాకాలమునకు చటత చూచుటవలననే కండ్లు కల్గియుండుట నాకు సార్ధకమైనది.

శ్లో॥ సహస్ర మర్థయేఽక్షీణాం-తవ సౌందర్య మీక్షితుమ్
వర్ణితుం తవ సౌశీల్యం-సహస్ర రసనా అపి
సహస్రభుజశాఖాం శ్చ-త వాంగముపగూహితుమ్ ॥

తా॥ నీ సౌందర్యమును చూచుటకు వేయికండ్లు కావలెనని కోరుకొనుచున్నాను. నీ సుగుణముల వర్ణించుటకు వేయి నాలుకలను కూడ కోరుచున్నాను. నీ శరీరమును కౌగిలించు కొనుటకు వేయి భుజములు కోర చున్నాను.

శ్లో॥ అతి సౌందర్యసారేఽపి-గర్వలేశోఽపినాస్తితే
న చావన్యసే కాంచిత్-కురూపా మపి భామినీమ్ ॥

తా॥ మిక్కిలి సౌందర్యము కల్గినదానవైనను నీకు కొంచె కూడా గర్వము లేదు. కురుపయగు స్త్రీని సైత మవమానించవు.

శ్లో॥ తవ సౌందర్యసంపత్త్యా-పాతివ్రత్య గుణేన చ
దారిద్ర మపి దుర్ధర్ష-మనుమన్యే కథంచన ॥

తా॥ నీ సౌందర్య సంపదచేతను, పాతివ్రత్య [illegible] భరింపరాని ఈ దార్రిద్యము భరించుటెట్లాయని బాధించుచున్నా [illegible]

శ్లో॥ ఈ దృశీం భవతీం భార్యాం మామేవ ధ్యాయతీం సదా
విహాయ క్వ గమిష్యామి-ప్రియే దారిద్ర్య కారణాత్

తా॥ ఇటువంటి నన్నే నిరతము ధ్యానించు [illegible] ప్రియురాలా దార్రిద కారణముగా నెచ్చటకు వెళ్లగలను?

శ్లో॥ మదీయం గృహ మాగత్య-కిం ను [illegible]

తా॥ నా యింటికి వచ్చి ప్రియురాలా [illegible]

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణాం-త్వం మూల మితి [illegible]
తా॥ ధర్మార్థ కామ మోక్షములకు నీవె మూలము [illegible]

శ్లో॥ అన్నపానై ర్యథాకామం - వస్త్రై రాభరణై రపి
న ప్రీణయతి యో భార్యాం- స పుమాన్ పురుషాధమః

తా॥ కోర్కె ననుసరించి అన్నపానములు, వస్త్రాభరణము [illegible] ఇచ్చుట ద్వారా భార్య నెవడు తృప్తి పరచడో వాడు అధమ పురుషుడు.

శ్లో॥ పితా రక్షతి కౌమారే-భర్తా రక్షతి యౌవనే
పుత్రాః రక్షన్తి వార్ధక్యే-న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి

తా॥ చిన్నతనమున తండ్రి పోషించును, [illegible] పోషించును ముదుసలితనమున బిడ్డలు పోషింతురు ఇట్లు స్త్రీ [illegible] తగినదికాదు.

శ్లో॥ అనుకూలా ప్రియా సాధ్వీ-యస్యాస్తి నిజమందిరే
తదేవ భవనం నో చే-ద్వ్యా ఘారణ్యం తథా గృహమ్

తా॥ అనుకూలవతియు, ప్రియురాలు, పతివ్రతయు [illegible] యెవని యింట నుండునో ఆదే భవనము, లేకున్నది కల్లుకాను [illegible]

శ్లో॥ పతివ్రతా సుశీలా చ-సురూపా సాధు భాషిణీ
కులజా భవతీ సాధ్వీ-కథం త్వాం త్యక్తు ముత్సహే

తా॥ నీవు పతివ్రతవు, సుశీలవు. అందగత్తెవు. చల్లని పలుకులు కలదానవు. సద్వంశజాతవు, ఉత్తమురాలవై యుండగా నిన్నెట్లు వీడ నాకు మనస్కరించును ?

శ్లో॥ సాధ్వీ భార్యా చయస్యాస్తి-స మాన్యో బంధుభిర్జనైః
స ఏవ పురుషశ్లాఘ్యః స యోగ్య స్సర్యకర్మసు ॥

తా॥ ఉత్తమురాలగు భార్య యెవరికుండునో అతఁడే బంధు జనులచే గౌరవింపబడును. వాఁడే కొనియాడదగిన పురుషుడు. అతఁడే అన్ని పనులయందు యోగ్యుడు.

శ్లో॥ వృద్ధౌ చ మాతా పితరౌ-సాధ్వీ జాయా సుతశ్శిశుః
అప్యకార్యశతం కృత్వా-భర్తవ్యామను రబ్రవీత్ ॥

తా॥ ముదుసలివారగు తల్లిదండ్రులు, యోగ్యురాలగు భార్య, పసివాడగు కుమారుఁడు వంద చెడుగుపనులు చేసినను సహింపవలెనని ధర్మశాస్త్రమున మనువు చెప్పెను.

శ్లో॥ పంక్తిభేదీ పృథక్పాకీ-నిత్యం బ్రాహ్మణ దూషక ః
విప్రద్ర వ్యాపహర్తా చ-బ్రహ్మహంతా తథైవ చ
ఏవం ముఖా శ్చతుర్దశ-మహాపాతకి సంజ్ఞికాః

తా॥ వరుసలో భేదభావము చూపువాడు, వేరుగా వండుకొని తినువాఁడు. నిత్యము బ్రాహ్మణుల నిందించువాఁడు, బ్రాహ్మణద్రవ్య మపహరించినవాఁడు. బ్రాహ్మణ హత్య చేయువాఁడు – ఇట్టివారు పదునల్గురు మహాపాతకులని పేర్కొనబడుచున్నారు.

శ్లో॥ తస్మా దుపేక్షమాణస్య-సాధ్వీం త్వాం హితభాషణీమ్
ప్రాయశ్చిత్తొపదేశం మే-వక్తు మర్హసి సాంప్రతమ్ ॥

తా॥ కావున సాధ్వీని, మంచినిపలుకు నిన్ను పేక్షవహించిన నాకు తగినప్రాయశ్చిత్తము దెలుపదగియున్నావు.

శ్లో॥ ఇతి నిందిత మాత్మానం-ఖిద్యంతం చ పునః పునః
భర్తారం ప్రాహ సా సాధ్వీ-కిమర్థం శోక ఈదృశః ॥

తా॥ ఇట్లు తనను నిందించుకొనుచు పలు మార్లు దుఃఖించు భర్తతో నాసాధ్వి ఇట్లనెను. స్వామీ ఇటువంటిశోకమేల?

శ్లో॥ ఉచితం కిం మహా ప్రాజ్ఞః-ధీరోదాత్తస్య తే ప్రియః
సర్వశాస్త్రార్థత త్త్వజ్ఞః-కిమర్థం కథ్యతే ప్రభో:

తా॥ సర్వజ్ఞా, ఇది తగినదా? ప్రియా! మీరు ధీరోదాత్తులు కదా! ఈ దుఃఖమేల? సర్వశాస్త్రములెఱిగిన మీరిట్లెందుకనుచున్నారు?

శ్లో॥ నిజకర్మాణి సర్వాణి-భోక్తవ్యాని న సంశయః
ఈదృశాన్యేవ కర్మాణి-కృతాన్యస్మాభి రంజసా ॥

తా॥ తాముచేసినకర్మలన్నియు తప్పక అనుభవింపవలసినదే. మనచే నజ్ఞానమువలన పూర్వ మిట్టికర్మలే చేయబడినవి.

శ్లో॥ కణమాత్రం జలం వాపి-అన్నం వా సిద్ధమాత్రకమ్
సత్పాత్రే నార్పితం యస్మా-త్తస్మాద్దారిద్ర్య మాగతమ్

తా॥ ఒక్కచుక్కనీరుకాని, మెతుకు అన్నముకాని యోగ్యులకు మనచే పెట్టబడలేదు. అందుకే ఈదారిద్ర్యము సిద్ధమైనది.

శ్లో॥ కో వా విచారయే దర్థే-హ్యావశ్యం భావి నీదృశే
తస్మా ద్వివేకిన స్త్వత్ర-విచారో నైవసాంప్రతమ్ ॥

తా॥ తప్పక కర్మఫలము లిట్లుజరుగుచుండ నెవ్వఁడు విచారించును? కాన నీవిషయమున వివేకవంతుఁడు విచారము నందఁడు.

శ్లో॥ ఇత్యుక్త్వా వచనం సాధ్వీ-పాదయో ర్నిపపాతహ
నిపతంతీం నిజాంభార్యాం-ఆలింగ్య చ పునఃపునః ॥
ఆదృత్య సాంత్వవచసా-దేశకాలోచితేన సః
ఆదాయ దేవతాం స్వాం చ-ఉపాదానపరో య యౌ ॥

తా॥ అని పలికి సాధ్వియగు నామె ధ్వజదత్తుని పాదములపై బడెను. పాదములపైబడు తనభార్యనాలింగనము చేసికొని అసమయమునకు తగిన చల్లనిమాటలతో నాదరించి తనదేవతను వెంటగొని యుపాదానమునకు బయలుదేరి వెడలెను.

శ్లో॥ తదేవ చింతమానస్య-గిచ్ఛతో దిశ ముత్తరామ్
చింతా సమభవ త్తస్య-ధ్వజదత్తస్య ధీమతః ॥

తా॥ పైవిషయమే ఆలోచించుకొనచు ఉత్తర దిశకేగెను. అట నా బుద్ధిమంతుఁడగు ధ్వజదత్తునకు ఒక్క ఆలోచన వచ్చెను.

శ్లో॥ తపసా నా మహోగ్రేణ-పేతనే నాథవాః పునః
యజనాధ్యాపనాభ్యాం వా-ఆసయిష్యే ధనం బహు॥

తా॥ "గొప్పతపస్సువలనగాని, మంచిజీతముతో పనియొనర్చుటద్వారాకాని యజ్ఞములుచేయించికాని చదువుచెప్పికాని చాలడబ్బు సంపాదించగలను" అని

శ్లో॥ ఇతి ముదితమనా హ్యుపాయయోగాత్
నిజ సుఖలేశ పరాఙ్ము ఖాభిమాన,
జ్వలిత హుతభుజం ప్రభాతకాలే
మునివర మండిత మభ్యగా ద్విజేంద్రః ॥

తా॥ ఇట్టియుపాయములవలన మనమున నానందమందిన వాఁడై తన కొద్దిసుఖము విషయమనసే అభిమానముంచి ఉదయమేలేచి బ్రాహ్మణ శ్రేష్ఠుఁడగు నాధ్వజదత్తుఁడు అగ్నులు బాగుగా జ్వలించుచున్న, ముని శ్రేష్ఠులచేనొప్పు నాశ్రమప్రదేశమును చేరెను.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే శ్రీ సువర్చలాహనుమద్ద్వాదశాక్షరమాహాత్మ్యే ధ్వజదత్తచరిత్ర కథనం నామ అష్టమ పటలః

నవమ పటలః

## ధ్వజదత్త చరిత్రం

మైత్రేయ ః-

శ్లో॥ కి మహర్షీ ద్వనం గత్వా-ద్వజదత్తః పరాశర
త ద్వనం వాకిమాఖ్యాతం ?-త స్మే బ్రూహి మహామునే !

తా॥ మైత్రేయుఁడడుగుచున్నాఁడు. ఓ పరాశర మహామునీ! ధ్వజదత్తుఁడు వనమునకు వెళ్ళి ఏమి చేసినాఁడు? ఆ వనము పేరేమి? నాకా విషయము చెప్పవలసినది.

శ్రీ పరాశర ః-

శ్లో॥ తద్వనం నైమిశారణ్యం-యత్రాస్తే పుష్కరో మునిః
యత్ర సంతి మునవ్రాతాః అపరే కల్పపాదపాః ॥

తా॥ శ్రీ పరాశరులు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! అది నైమిశారణ్యము. అందు పుష్కర మహాముని యున్నాఁడు. ఇతర కల్ప పాది మహామునులను గలచోటది.

శ్లో॥ జపంతో భవ్య మంత్రాంశ్చ-ధ్యాయంత శ్చేష్ట దేవతాః
ప్రాయశో హనుమద్భక్తాః-తన్మంత్ర జపతత్పరాః ॥

తా॥ అచ్చటివారు శుభమంత్రములు జపించువారు ఇష్ట దేవతలను ధ్యానించువారు. అందు హనుమన్మంత్ర జపమునందు నిమగ్నులగు హనుమద్భక్తులు తఱచుగా నుండెడివారు.

శ్లో॥ నిత్య హోమపరాః కేచిత్-కామ్య హోమపరాః పరే
అన్యే కర్మపరిత్యక్తాః-కేవల ధ్యాన తత్పరాః

తా॥ కొందఱు నిత్యహోమమును, కొందఱు కామ్యహోమమును నిమగ్నులై యుండ మరి కొందఱు కర్మత్యాగ మొనర్చి కేవల ధ్యానమున నిమగ్నులై యుండిరి.

శ్లో॥ ఇత్యేవం వివిధై ర్వ్యాప్త-బహుభి ర్మునిపుంగవైః
ధ్వజదత్తో వనం వీక్ష్య-విస్మయం పరమం యయౌ

తా॥ ఇట్లు వివిధరీతులనున్న యనేకులగు మునిశ్రేష్ఠులతో నిండి యున్న వనమును చూచి ధ్వజదత్తుఁడు మిక్కిలి ఆశ్చర్యమునందెను.

శ్లో॥ దంతధావనపర్ణాని-సమిత్పుష్పఫలాని చ
గృహీత్వా నిజపాణిభ్యాం-ప్రవిష్టో వనగహ్వరమ్॥

తా॥ పండ్లుతోముక్కొను ఆకులు, సమిధలు, పుష్పఫలములు తీసికొని వనమును ప్రవేశించెను.

శ్లో॥ యత్రాస్తే పుష్కరోయోగీ-హనుమద్ధ్యాన తత్పరః
సూర్యబింబసమ జ్యోతిః-హనుమన్మంత్ర వైభవాత్॥
తం దేశ మగమ ద్దీప్తం-శనై ర్భీతో మహాత్మనః
తూష్ణీం తస్థౌ త దభ్యాసే-విస్మృత స్వార్ధసంభ్రమాః॥

తా॥ హనుమద్ధ్యాన తత్పరుడై హనుమన్మంత్ర ప్రభావమువలన సూర్యమంత్రముతో సమానమగు కాంతికల పుష్కరయోగి యెచ్చట నున్నాడో అట్టి దివ్యప్రదేశము చేరి ఆ మహాత్మునకు వెరచి తన పని యందలి తొందరను కూడ మరచి నిలచియుండెను.

శ్లో॥ యదృచ్ఛయా మునీంద్రోఽపి-మాధ్యాహ్నిక ముపాసితుమ్
నివృత్తయోగ స్తత్రైవం-నివృత్త-స్స్వాంతరాత్మనః ॥

తా॥ పుష్కరుఁడు మధ్యాహ్నముచేయు ఉపాసనకొఱకై అనుకొనకుండ యోగమును నివర్తించి, అంతరాత్మను కూడ ధ్యానతత్పరత నుండి మరల్చిన వాఁడాయెను.

శ్లో॥ ధ్వజదత్తో మహా ప్రాజ్ఞః-వీక్షమాణె మహామునౌ
ఉపహారం నివే ద్యాదౌ-సాష్టాంగం ప్రణతోఽభవత్ ॥

తా॥ మహాజ్ఞానియగు ధ్వజదత్తుఁడు పుష్కరుఁడు చూచుచుండ తనకడనున్న కాన్కను సమర్పించి సాష్టాంగ నమస్కార మొనర్చెను.

శ్లో॥ అథా బ్రవీ న్మహాభాగో-ధ్వజదత్తం ద్విజోత్తమమ్
కిమర్థ మాగతో బ్రహ్మన్! కేనవాఽపకృతో భవాన్!

తా॥ అంత నాపుష్కరుఁడు బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు ధ్వజదత్తునితో నిట్లనెను. "ఓమహానుభావా! బ్రాహ్మణా! ఎందులకువచ్చితివి? నీకెవరైన అపకారముచేసిరా?

శ్లో॥ నిర్విణ్ణవదనో భూత్వా చింతా క్రాంత ఇవ స్థితః
ఏత త్సర్వంయథాపృష్టః-విచార్య బ్రూహి తత్త్వతః ॥

తా॥ వెలవెల బారుమోముతో దుఃఖముతో నున్నట్లున్నావు. నీసమస్తవిషయమును ఆలోచించిచెప్పుము.

శ్లో॥ శ్రుత్వా తద్వచనం విప్రః-పుష్కరస్య మహాత్మనః
ప్రత్యుత్తరం యథాన్యాయ్యం-వక్తుం సముపచక్రమే ॥

తా॥ మహాత్ముఁడగు పుష్కరుని పైవాక్యములువిని బ్రాహ్మణుఁడగు ధ్వజదత్తుఁడు సరియైన సమాధానమిచ్చుటకు ఆరంభించెను.

శ్లో॥ కుండినంనామ నగరం ఆసీత్ త్రైలోక్య విశ్రుతమ్
యత్రాఢ్యా వణిజా నిత్యం-కుబేరాధికసంపదః ॥

తా॥ ముల్లోకములందు కొనియాడబడు కుండినమను నగరము కలదు. అందు కుబేరునిమించిన ధనముకల వైశ్యులుకలరు.

శ్లో॥ బ్రాహ్మణాశ్చాపి విద్వాంసః-సురరాజగురూపమః
నిత్యాన్నదాన నిరతాః-నిత్య హోమపరాయణాః ॥

తా॥ అందలి బ్రాహ్మణులుకూడ గొప్పపండితులై బృహస్పతితో సమానమైనవారు. ఎల్లప్పుడు అన్నదానము చేసెడివారు. నిత్యము హోమ మొనర్చుచుండెడివారు.

శ్లో॥ స్త్రియః పతివ్రతా స్సర్వాః-శూద్రాః బ్రాహ్మణసేవితాః
క్షత్రియాః ధర్మయోద్ధారో-న క్వచి ద్వర్ణసంకరః ॥

తా॥ అచటి స్త్రీలందఱు పతివ్రతలు, శూద్రులు బ్రాహ్మణుల సేవించువారై యుందురు. క్షత్రియులు ధర్మయుద్ధములను మాత్రమే యొనర్చువారు. ఎక్కడను వర్ణసాంకర్యములేదు.

శ్లో॥ నాభూదవిద్వాన్ యః కోఽపి-నా వాచకులస్తథా
నా షడంగవిదత్రాసీత్-నాయజ్వా తత్ర పట్టణే

తా॥ ఆ పట్టణమున నెవ్వఁడును విద్యాహీనుఁడు కాని వాచాలుఁడు కాఁడు. సంభాషణయందు నేర్పులేని వాఁడులేఁడు. షడంగములను నేర్వ

వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను శాస్త్రములు రానివాఁడులేడు. యజ్ఞములు చేయనివాఁడులేఁడు.

శ్లో॥ ఏవం సర్వసమృద్ధేఽస్మిన్- ధ్వజశర్మా బహుశ్రుతః
బహ్వృచో గార్గ్యగోత్రశ్చ జితాంత ర్బాహ్యశాత్రవః॥

తా॥ ఇట్లు సర్వసంపన్నమగు ఆ పట్టణమున ధ్వజశర్మయనుపేరుగల సర్వజ్ఞుఁడై కీర్తివంతుఁడై వేదజ్ఞుఁడగు గార్గ్యగోత్రికుడు, కామక్రోధాదికములగు అంతశ్శత్రువులను జయించినవాఁడు కలఁడు.

శ్లో॥ తస్యాఽహం జ్యేష్ఠపుత్రశ్చ- కనీయాన్ మమ భద్రకః
తస్యాఽనుజో భద్రబాహుః-సర్వే వేదపరాయణాః॥

తా॥ ఆతనికి నేను జ్యేష్ఠపుత్రుఁడను. నా తదుపరివాఁడు భద్రకుఁడు. ఆతని పిదప బుట్టినవాఁడు భద్రబాహుడు..మేమందఱము వేదమును చదివినవారము.

శ్లో॥ అనుజౌ తౌ మహాపుర్యాం ఉపాదానపరాయణౌ
తేషాం మమాపి పుత్రాస్సే నాలం క్షుత్క్షతాంతయే మునే॥

తా॥ నా తమ్ములిద్దఱు పట్టణమునందు పాదానము చేయుచున్నారు. వారికి, నాకున్ను పిల్లలున్నారు. ఓమహామునీ! ఆకలిదీరుటకు సమర్థమగు జీవనముకాదు.

శ్లో॥ పుత్రా మే బహవ స్సంతి సాధ్వీ భార్యా ప్రియంవదా
ఉపాదానార్జితం ధ్యానం నాలం గ్రాసాయనో మునే॥

తా॥ నాకు పుత్రులనేకులు కలరు. భార్య ఉత్తమురాలు,మంచిగా మాటాడునదియు ఉపాదానముచే వచ్చిన ధాన్యము ఆహారమునకు చాలదు

శ్లో॥ శాకాహారేణ సా సాధ్వీ జీవనం కురుతే భృశమ్
ఉపవాస రా ప్రాయః-శాకాభావే పతివ్రతా॥

తా॥ ఆ ఉత్తమురాలు పచ్చికూరలతోనే జీవనము వెళ్ళదీసుకొనుచున్నది. తఱచుగా నా పతివ్రత శాకములు లేక పోవుటచే నుపవసించెడిది కూడ.

శ్లో॥ త ద్దైన్యదర్శనా ద్దేవ!-కదాచి దతిచింతితః
ఆశ్వాస్య తాం ప్రియైర్వాక్యైః- వంచయిత్వా౽హ మాగతః

తా॥ దేవా! ఆదీనస్థితి చూచి ఒక్క మారుమిక్కిలి చింతించిన వాఁడనై ప్రేమతోడి మాటలతో ఊరట బఱచి వంచనచేసి వచ్చితిని.

శ్లో॥ తస్మా ద్ధుర్భిక్షహన్తారం సర్వ సౌభాగ్యదాయకమ్
సర్వదుఃఖహరం చా౽పి-హ్యుపాయం వక్తు మర్హసి॥

తా॥ అకారణమున దారిద్ర్యమును పోగొట్టి సర్వసంపదల నిచ్చి సమస్తములగు దుఃఖములను హరించు నుపాయము చెప్పవలసినది.

శ్లో॥ బహునా౽త్రకి ముక్తేన? మమైత ద్వచనం ప్రభు
దారిద్ర్యసాగ రేమగ్నా-నస్మా నుద్ధారయిష్యసి॥

తా॥ అనేకములగు మాటలే లఒక్క మాట వినుము, దారిద్ర్య మను సముద్రమునకూలిన మమ్ము నుద్ధరింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా ధ్వజదత్తస్తు-పాదయోర్నిపపాతహ
తస్య తద్వచనం శ్రుత్వా-దయార్ద్ర మనసో మునేః
న్యపత న్ప్రణతస్యాంగేనే త్రాభ్యా మశ్రుబిందవః
హనూమంతం ప్రదిధ్యాత్వా ధైర్య మాస్థాయ పుష్కరః
ధ్వజదత్తం సముత్థాప్య మాభైషీ రితి చాబ్రవీత్॥

తా॥ ఇట్లని ధ్వజదత్తుఁడు పుష్కరుని పాదములపైపడెను. అతని యా మాటలు విన్న దయతోకూడిన పుష్కరమహామునినేత్రములనుండి కన్నీటి చుక్కలు జారి నమస్కరించు నతనిపై పడినవి. హనుమంతుని మనమ్మున తలచి పుష్కరుఁడు ధైర్యమునంది ధ్వజదత్తుని లేవదీసి భయపడ వలదనెను.

శ్లో॥ అస్త్యనర్థపరీ హార-సమర్థో హనుమాన్ ప్రభుః
వర్తతే హనుమన్మంత్ర-దైన్యం కిమ్ను? ద్విజోత్తమః॥

తా॥ ఇంకను ఇట్లనెను. ఓ బ్రాహ్మణోత్తమా! కష్టముల నన్నిటిని పోద్రోలగల హనుమంతుడున్నాడు. అతని పరముగా హనుమన్మంత్రము కూడ నున్నది. ఇక దీనలయేల?

శ్లో॥ దెవతాని కతిసంతి న భూమౌ
నైవతాని మనసో మతాని మే
వీక్షితం జడద రిద్రరక్షణే
దైవతం హనుమదాఖ్యమేవ యత్॥

తా॥ భూమియందెందరు దేవులులేరు? కాని యందఱు నామనసున కభిమతులుకారు అజ్ఞానులను దరిద్రులను రక్షించుటయందు నిమగ్నమైనగు దేవుడు హనుమంతుడే.

శ్లో॥ మంత్రజాల మపి నాఽన్యగోచరమ్
రోచతే కమపి మంత్రకం వినా
కారణంకి మతిరిక్త ? మంత్రనో
వాయునందన మనోఽపరిగ్రహాత్॥

తా॥ ఇతరములకాననగు మంత్రములుసైతము నాకిష్టమగుటలేదు అవి మంత్రజ్ఞుడగు గురువున్నకాని తెలిసికొన వీలుకావు. కాని హనుమన్మంత్రము గ్రహించిన వేరుకావసిన దేమున్నది?

శ్లో॥ బ్రహ్మవిష్ణు శివ మైథిలీ శివాః
కార్యసిద్ధి శిథిలోద్యమా ముహుః
అంజనాసుత మను ప్రభావతో
భుంజతే సుఖ మహర్నిశం ద్విజః

తా॥ ఓ బ్రాహ్మణుడా! పూర్వము బ్రహ్మ విష్ణు, శివ, సీతా, గౌరీ మంత్రములను జపించుచు ఫలమందక తుదకు హనుమన్మంత్ర ప్రభావముచే రాత్రింబవళ్ళు సుఖమయ జీవనము గడుపుచున్నారు.

శ్లో॥ తత్ర తత్ర భవతే మనూత్తమమ్
కార్యసిద్ధివిషయే ధృఢ వ్రతమ్

దానపాత్ర ః భవతే దిశామ్యహమ్
పుణ్యతీర్థసలిలే విగాహ్యతామ్ ॥

తా॥ అట నట నీ యుకమ మంత్రము, కార్యము సకలము
విషయము న ద్భుతమైనది కలదు. నీవు కూడా మంత్రమునకు తగినవాడవు.
కాన నీకు మంత్రము నుపదేశింతును. నీవు పుణ్యతీర్థమందు స్నానముచేసి
రమ్ము.

శ్లో॥ ఇత్థ మాహ వచనం మనోరమమ్
బ్రాహ్మణం భృశదరిద్ర శేఖరమ్
నిత్య కర్మ నిధయో మునీశ్వరాః
పుణ్యతీర్థ మవిశ న్సహోఽమునా ॥

తా॥ అని పుష్కరుడు మనోహరముగ దరిద్రశేఖరుడగు
నా ధ్వజదత్తునితో ననెను. ఆ ధ్వజదత్తునితో కూడి నిత్యకర్మానుష్ఠానములకు
నుండు మునీశ్వరులను పుణ్యోదకమున ప్రవేశించిరి.

శ్లో॥ యత్రసిద్ధి మగమన్మునీశ్వరాః
స్నానపాన హతకిల్బిషాః క్షణాత్
తత్ర పుణ్యసలిలే ద్విజస్స్వయమ్
స్నానపూర్వక విధిం చకార వై ॥

తా॥ ఎక్కడైతే మునీశ్వరులు స్నానపానముల వలన పాపము
పోగొట్టుకొని సిద్ధిని పొందిరో అక్కడనున్న పుణ్యజలమందు ధ్వజదత్తుడు
స్వయముగా స్నానపూర్వక విధిని నెరవేర్చుకొనెను.

శ్లో॥ స్నాత్వా తు పుష్కర శ్శీఘ్రం-పుణ్యతీర్థోదకే శుభే
కృత మాధ్యాహ్నికా యాథ-ధ్వజదత్తాయ ధీమతే ॥

తా॥ పుష్కరుడు కూడా పుణ్యజలములందు వెంటనే స్నానము
చేసి మాధ్యాహ్నిక కృత్యములు నెరవేర్చుకొనిన బుద్ధిమంతుడగు ధ్వజ
దత్తునకు

శ్లో॥ సువర్చలా సమేత శ్రీ-హనుమన్మంత్ర ముత్తమమ్
ద్వాదశాక్షరవిద్యేతి-ప్రసిద్ధం జగతాం త్రయే
హనుమద్ధ్యాన మాస్థాయ-ధ్యాత్వా గురుపదాంబుజమ్
విన్యస్య మస్తకే హస్తం-విప్రా యోపాదిదేశ హ ॥

తా॥ ముల్లోకములందును ద్వాదశాక్షర మంత్రమని ప్రసిద్ధి చెందిన ఉత్తమమగు సువర్చలా సమేత శ్రీ హనుమన్మంత్రమును, తాను హనుమంతుని ధ్యానమునందుంచుకొని, గురుపాదముల స్మరించి ధ్వజదత్తుని శిరముపై తన కరము నుంచి యుపదేశించెను.

శ్లో॥ ధ్వజదత్తో మహామంత్ర-ముపదిష్టం మహర్షిణా
అత్యాదరేణ జగ్రాహ-నిక్షేపం నిర్ధనో యథా ॥

తా॥ పుష్కర మహామునిచే నుపదేశింపబడిన మహా మంత్రమును ధ్వజదత్తుడు, దరిద్రుడు లంకెబిందెలను తీసికొనునట్లత్యంతాదరముతో గ్రహించెను.

శ్లో॥ తతో నియమ మాస్థాయ-జజాప హనుమన్మనుమ్
గురూపదిష్ట విధినా-తత్ర పుణ్యజలాంతరే ॥

తా॥ పిమ్మట ఆ పుణ్యతీర్థములందే గురువు ఉపదేశించిన విధముగా నియమముతో నుండి ధ్వజదత్తుడు హనుమన్మంత్రమును జపించెను.

శ్లో॥ ఉపదిశ్య మహామంత్రం తం-పుష్కరోఽపి మహామునిః
ధ్వజదత్తాయ విప్రాయ-జగా మాశ్రమ మాత్మనః ॥

తా॥ విప్రుడగు నా ధ్వజదత్తున కట్టులా మంత్రము నుపదేశించి పుష్కర మహాముని తన యాశ్రమమునకు వెడలెను.

శ్లో॥ స్వావేక్షణోత్సుక లసన్ముఖ కృష్ణనాగా
మాశాసి తాత్మహితలోభ ఖగేంద్రనాథామ్
ఆసాద్య తాఽతిథి బిలప్రకరాంగణా గ్రా
మధ్యాస్త పుష్కరముని ర్నిజపర్ణశాలమ్ ॥

తా॥ తనను చూచుటయందాసక్తి కల్గి ప్రకాశించు ముఖములు కల నల్లత్రాచులు కల్గిన, తమ మేలు యొక్క గొప్పతనమును ప్రకటించు గర్గుడపక్షులు కల, అతిథుల రాకల ముంగిలితో నున్న తన పర్ణశాలకు పుష్కర మహాముని చేరుకొనెను. విరోధి జంతువుల ఏకత్రస్థితిని తెల్పుటచే మహాముని తపో మహిమచే ప్రాణికోటి యవిరో విధముగా నిర్భీతితో నున్నదని స్పష్టము.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పరాశర మైత్రేయ సంవాదే ధ్వజదత్తచరిత్ర కథనం నామ నవమపటలః

దశమ పటలః

## సూర్యసుతా కథనం

శ్రీ మైత్రేయ ః—

శ్లో॥ ధ్వజదత్తో జపన్మంత్రం—కదా సిద్ధ మవిందత ?

పురశ్చర్యా కతికృతాః ? పరాశర : వదస్వ మే ॥

తా॥ ఓ పరాశర మహామునీ ! మంత్రమును ధ్వజదత్తుడు జపించుచు నెప్పుడు సిద్ధిని పొందెను? పురచ్చర్యలెన్ని చేసెను ? నాకు తెలుపగోరెదను.

శ్రీ పరాశర ః—

శ్లో॥ శాస్త్రోక్తవిధినా విప్రో—జపన్మంత్ర మహర్నిశమ్

సిద్ధిం నావాప మంత్రస్య—తథాపి జపతిస్మ సః ॥

తా॥ శ్రీ పరాశరులు చెప్పుచున్నారు. బ్రాహ్మణుడగు ధ్వజదత్తుడు రాత్రింబవళ్ళు శాస్త్రానుసారముగనే మంత్రము జపించుచు మంత్రసిద్ధిని మాత్రము పొందలేదు. అయినను జపించుచునే యుండెను.

శ్లో॥ గ్రీష్మే తప్తశిలాయాంచ—వర్షాసు శికతాతలే

హేమన్తే శిశిరస్తౌ చ—రాత్రౌ శీతజలాంతరే ॥

తా॥ గ్రీష్మ ఋతువునందు బాగుగాకాలిన రాతిపైన నుండి, వర్షాకాలమున నిసుకప్రదేశముననుండి, హేమన్త శిశిరఋతువులలో రాత్రులందు చల్లని నీటిమధ్యభాగమున నుండియు

శ్లో॥ జపన్నపి మహామంత్ర సిద్ధిం నైవాప స ద్విజః
నిరాహారో జితస్వాపః-సర్వదా విజితేంద్రియః॥
మన స్తత్రైవ సంయోజ్య-బాహ్యం నైవ వివేద సః

తా॥ ఆ బ్రాహ్మణుఁడు మహామంత్రము జపించుచున్నను సిద్ధినిపొందలేదు. అహారనిద్రాదులుమాని ఇంద్రియ నిగ్రహముపూనెను. మనస్సునుకూడదానియందే లగ్నముచేసి బయటవిషయముకూడ తెలిసికొనకుండెను.

శ్లో॥ గురుదేవపదంఛైవ-వినా విందతి త ద్విజః ॥
తస్మాత్త్వంచపురశ్చార్యా – నిధావపి న సిద్ధ్యతి॥

తా॥ గురుదేవ నమస్కార మొనర్పక జపించుచుండెను. అందుచే నైదుమార్లు పురశ్చర్యజరిపినను సిద్ధించలేదు.

శ్లో॥ దైవమేవ మహామాన్యం-తతో మాన్యో మహామనుః
ఇతి నిశ్చితవాన్ విప్రో-న త్వేవం గురువైభవమ్
చిరాయాపి మహామంత్ర-సిద్ధ్యభావా ద్విజోత్తమః॥

తా॥ దైవమేపూజ్యము. దానికంటెపూజ్యము మంత్రము అని త్రమే యెంచుచు గురువునట్లు తలపమి చాలకాలమైనను మహామంత్రము ..ంపకుండుట కాబ్రాహ్మణోత్తముఁడు.

శ్లో॥ నిర్వేదం పరమం చాగాత్-గురువిశ్వాసవర్జనాత్
సిద్ధ్యభావే నిదానం యత్-గురువిశ్వాసవర్జనమ్
ఏవం న జ్ఞాతవాన్ విప్రః-తదేవ జ్ఞాతవాన్ గురుః ॥

తా॥ గురువిశ్వాసములేకుండుటచే మిక్కిలి నిరాశను పొందవలసివచ్చెను. సిద్ధించకుండుటకు గురువిశ్వాసము లేకుండుటే కారణమనిఆపారుడకు తెలియదు. దానినెఱిగినవాఁడే శ్రేష్ఠుఁడు.

శ్లో॥ సప్తకోటిషు మంత్రేషు-విద్యమానేషు పుష్కరః
దిష్టవాన్ జడమంత్రం మే-యత స్తన్మంత్రవంచకః ॥

తా॥ ఏడుకోట్ల మహామంత్రములుండగా ఈపుష్కరుఁడు మోసకారిమంత్రగాడై ఈవ్యర్థమంత్రము జెప్పెను.

శ్లో॥ మహాంతో మునయ స్సంతి-తా నపే క్ష్యాయ మర్థితః
మాం జహాతి న దౌర్భాగ్యం-వనే వా పట్టణేఽపి వా
ఇత్యేవం ఖిద్యమానస్సన్-జపా దుపరతోఽభవత్ ॥

తా॥ ముని లనేకులున్నారు. వారినివీడి ఈతని సర్థించితిని. పట్టణమునందు, వనమునందును దౌర్భాగ్యము నన్ను వీడలేదు అని దుఃఖించుచు జపమును విరమించెను.

శ్లో॥ అథాస్మి న్నంతరే వ్యాధో-గాలోనామ మహాధనుః
మహావ్యాధిపరీతాంగో దుఃఖితో వ్యాధిపీడయా ॥

తా॥ ఈకాలముననే గొప్పవిలుకాఁడగు గాలుఁడనుపేరు గల కిరాతుఁడు మహావ్యాధితోకూడినవాఁడై వ్యాధిపీడచే దుఃఖించుచుండెను.

శ్లో॥ మృగయావశ మాపన్నో-నైమిశారణ్య మావిశత్
ధ్వజదత్తం దద ర్శాదౌ-దరిద్రధ్వజ ముత్తమమ్
తత్సమీపం సమాగత్య-వ్యాధో వచన మబ్రవీత్ ॥

తా॥ ఆవ్యాధుఁడు వేటయందుపడి నైమిశారణ్యము చేరెను. మొదట దరిద్రులలో మొదటివాఁడు, ఉత్తముఁడునగు ధ్వజదత్తునిచూచెను. అతని సమీపమునకువచ్చి ఇట్లుపల్కెను

శ్లో॥ బ్రహ్మన్! మే వ్యాధిపీ డాస్తి-కే నోపాయేన శామ్యతి?
త ముపాయం వద స్వామిన్! త్వ త్సేవాం కరవా ణ్యహమ్ ॥

తా॥ ఓమహానుభావా! నాకు వ్యాధిపీడయున్నది. అది యే యుపాయముచేత తగ్గును? ఆయుపాయము చెప్పుము. నీ సేవ చేయుదును.

శ్లో॥ ఇత్యుక్త స్తేన విప్రోఽపి-వ్యాధం చేద మువాచ హ
అహం దారిద్ర్యదుఃఖాబ్ధౌ-మగ్న స్త్వాం కథముద్ధరే?
కశ్చి త్పుష్కరనామాస్తి-హ్యారా ద త్రైవ లక్ష్యతే॥

తా॥ అని యనగా నా ధ్వజదత్తుడు వ్యాధునితో నిట్లనెను. నేను దారిద్ర్యదుఃఖమను సముద్రమున మునిగియుండి నిన్నెట్లు ఉద్ధరించగలను? పుష్కరుఁడను పేరుగల యొకడు సమీపముననే కలఁడు. అదే కన్పట్టు చున్నాడు.

శ్లో॥ త ముద్దిశ్య న గంతవ్యం-యతో వంచకశేఖరః
దరిద్రతా వినాశాయ-బహుధా ప్రార్థితో మయా
మంత్రాభాసం మ మాదిశ్య వంచయిత్వా గతో యతః
మంత్రాభాసం జప న్భూయః-సిద్ధిం నైవాప్నుయా మ్యహమ్॥

తా॥ వానికడకు వెళ్ళవద్దు. ఎందుకన నాతడు మోసగాండ్ర యందు శ్రేష్ఠుడు. దారిద్ర్యనాశనమునకై నేననేకరీతుల ప్రార్థించమంత్రము వలె కన్పట్టు అమంత్రము నుపదేశించి వెడలెను. అట్టి ఆభాసమంత్రమును పలుమార్లు జపించుచు నేను సిద్ధినందకున్నాను.

శ్లో॥ దుశ్చర్యం హిత్వప స్తప్తం-త త్థాఽపి న సిద్ధ్యతి
పురశ్చర్యాశ్చ బహుధా-కృతా స్సిద్ధి ర్న దృశ్యతే
తస్మాత్ ప్రారద్ధకర్మాణి భోక్తవ్యాని న సంశయః ॥

తా॥ చేయలేని తపస్సుచేసితిని. అయినను అది సిద్ధించలేదు. పురశ్చర్యలుకూడ ననేకరీతుల చేసితిని. అయినను సిద్ధికానవచ్చుటలేదు. కావున నిస్సందేహముగా ప్రారబ్ధకర్మ లనుభవింపవలసినదే.

శ్లో॥ దైవం నాస్తి మను ర్నాస్తి గురు ర్నా స్తీతి మే మతిః
అథవా విద్యతే మంత్రో-గురు ర్వా దైవతం తథా
కిం తు పుష్కర మాసాద్య-మా గృహ్ణీష్వ మనుంత్వమమ్ ॥

తా॥ దైవములేదు, మంత్రములేదు. గురువులేడు అని నాయూహ. ఒకవేళ మంత్రము, గురువుకాని దైవముకాని యున్నను పుష్కరునికడనేగి మాత్రము మంత్రమును స్వీకరింపవలదు.

శ్లో॥ ఇత్యుక్తం ధ్వజదత్తేన-వ్యాధ శ్రుత్వా ప్రియంవచః
ధ్వజదత్తనిషిద్ధోఽపి-దిదృక్షుః పుష్కరం మునిమ్ ॥

తా॥ ఇట్లు ధ్వజదత్తునిచే చెప్పబడిన ప్రియ వాక్యములు వ్యాధుఁడు విని ధ్వజదత్తుడు వద్దన్నవాఁడైనను మునియగు పుష్కరుని చూడ నుత్సుకత నందెను.

శ్లో॥ నివృత్తికామో రోగస్య-తమేవ శరణం యయౌ
అబ్రవీత్పుష్కరం వ్యాధః-సాష్టాంగ నతి పూర్వకమ్ ॥

తా॥ రోగము పోగొట్టుకొనుటను కోరువాఁడై ఆ పుష్కరునే శరణు వేడెను. సాష్టాంగ నమస్కారము చేసి వ్యాధుడాతనితో నిట్లనెను.

శ్లో॥ జాత్యాహం మృగయు ర్బ్రహ్మన్ ! గాలో నామ్నా మహామునే!
వ్యాధినా దుర్నివారేణ-పీడ్యమానో దివానిశమ్ ॥

తా॥ జాతి చేత నేను కిరాతుఁడను. గాలుఁడను పేరు కలవాడను. ఓ మహామునీ ! వారింప శక్యము కాని వ్యాధితో రాత్రింబవళ్ళు బాధింప బడుచున్నాను.

శ్లో॥ అన్నం నరోచతే మహ్యం-న వా భార్యాఽతిసుందరీ
నవా వస్త్రాణి ముఖ్యాని-సుగంధకుసుమా న్యపి ॥

తా॥ నాకు అన్నముకాని, అందగత్తెయైనను భార్యకాని, ముఖ్య వస్త్రములు కాని సుగంధముకల పుష్పములు సైతము ఇష్టమగుట లేదు.

శ్లో॥ చందనం చంద్రబింబాభం-శయ్యా వా హంసతూలికా
రసాశ్చ షడ్విధా వాఽపి-న రోచంతే మహామునే !

తా॥ చంద్రబింబమువలె చల్లని, తెల్లని మంచిగంధము కాని, హంసతూలికాతల్పము కాని, ఉప్పు, పులుపు, తీపి, చేదు, కారము, వగరు అను షడ్రుచులు కాని ఓ మహామునీ ! నాకు రుచించుటలేదు.

శ్లో॥ నోత్సహే కాని వస్తూని-వ్యాధిగ్రస్తః నిరంతరమ్
తా॥ నిరంతరము వ్యాధిచే పీడింపబడుచు ఏ వస్తువుయందు కోరికా ఉత్సాహము పొందకున్నాను.

శ్లో॥ ఆఖేటనాపదేశేన-పర్యటన్గహనాంతలే
పూర్వ జన్మార్జితా త్పుణ్యా-ద్ద్రాక్షం త్వాం మహామునే!
తా॥ ఓ మహామునీ! వేట నెపముతో నరణ్యమధ్యమమున తిరుగుచు పూర్వజన్మయందు చేసిన పుణ్యమువలన మిమ్ము చూడగల్గితిని.

శ్లో॥ అధునాఽహం కృతార్థోస్మి-మన్యే వ్యాధిం వినాశితమ్
తా॥ ఇప్పుడు నేను కృతార్థుడనైతిని. నా వ్యాధి తగ్గినట్లుగా భావించుచున్నాను.

శ్లో॥ సమ్యక్పరీక్షితుం శీలం-వ్యాధస్య మునిసత్తమః
సన్ముహూర్తాపదేశేన-కాలక్షేపం చకార సః ॥

తా॥ మునిశ్రేష్ఠుడగు పుష్కరుడు వ్యాధుని శీలమును పూర్తిగా పరీక్షింపదలచి మంచి ముహూర్తము కుదురువలెననుచు కాలక్షేపం చేసెను.

శ్లో॥ తథాపి మృగయుర్గాలః-పరిచర్యాముపాచరత్
ఫలాని పరిపక్వాణి-మధురాస్వాదనాని చ
మునయే దత్తవాన్ గాలో-గృహీత్వా వనగహ్వరాత్ ॥

తా॥ అట్లయ్యును కిరాతుడగు గాలుడు పరిచర్యలు చేసెను. అరణ్యమధ్యము నుండి పరిపక్వములై తిన మధురములైన పండ్లను తెచ్చి పుష్కరుని కిచ్చెను.

శ్లో॥ సమిత్పల్లవ పుష్పాణి-బర్హిశ్చాఽపి సకంటకమ్
సమాహృత్యార్పయామాస-పుష్కరాయ మహాత్మనే ॥
తా॥ మహాత్ముడగు పుష్కరునకు సమిథలు, చిగురుటాకులు, పుష్పములు, వ్రేళ్ళుగల దర్భలున్ను తెచ్చి యర్పించెను.

శ్లో॥ తథాఽపి పుష్కరోయోగీ-కించిన్నాదత్త గాలకాత్
మౌనమేవ సమాస్థాయ-పరీక్షన్ వ్యాధవర్తనమ్
మన సైవ ముమోదాంత-తస్య విశ్వాసదర్శనాత్ ॥

తా॥ అయినను యోగియగు పుష్కరుఁడు గాలుని నుండి ఏమియు గ్రహించుటలేదు. మౌనముగానే యుండి వ్యాధుని ప్రవర్తనమును పరిక్షించు చుండెను. అతని విశ్వాసమునకు మనస్సునందే సంతోషించు చుండెను.

శ్లో॥ ఏవం బహువిధః కాలః-తస్యాఽభూత్పరిచర్యయా
ఉత్తరోత్తర మత్యంతం-విశ్వాసం లభతే స వై ॥

తా॥ ఇట్లు పరిచర్యతోనే చాలాకాలము గడచెను. క్రమముగా నాతఁడు మిక్కిలి నమ్మకమును మాత్రము పొందుచుండెను.

శ్లో॥ త మేవం పరిచర్యంతం-వ్యాధం వ్యాధిని పీడితమ్
కృపయా వీక్షయామాస-కదాచి త్పుష్కరోమునిః ॥

తా॥ ఒకప్పుడు మహామునియగు పుష్కరుఁడు తననట్లు పరిచర్యంతో తృప్తిపఱచు, వ్యాధిచే బాధపడు కిరాతుని దయతో చూచెను.

శ్లో॥ కృపయా వీక్షణా దేవ-గాల స్సంహృష్టమానసః
నివృత్తం తు తదా మేనే-రోగం రోగార్తి పీడితః ॥

తా॥ రోగ బాధచే పీడింపబడు గాలుఁడు దయతో తనను చూచుట వలననే సంతోషించిన మనస్సు కలవాఁడై రోగమంతయు తొలగినట్లు తలచెను.

శ్లో॥ అబ్రవీత్పుష్కరో వాక్యం-వ్యాధం గురుపరాయణమ్।

తా॥ పుష్కరుఁడా గురుభక్తియుతుఁడగు వ్యాధునితో పల్కెను.

శ్లో॥ వ్యాధస్య మంత్రదానార్థం-సందేహేన మహామునిః
హనూమంతం నిజాభీష్టం-దధ్యౌదైవత శేఖరమ్ ॥

తా॥ కిరాతుఁడగు గాలునకు మంత్రము చెప్పు విషయమున ననుమానం కల్గి పుష్కర మహాముని తన కిష్టుఁడును, దేవతలలో శ్రేష్టుఁడగు హనుమంతు నిట్లు ప్రార్థించెను.

శ్లో॥ హనుమన్ ! దేవదేవ ! స్వభక్తానాం పరిపాలక !
శ్రీరామచంద్ర సంప్రీతికారణ ! త్వా ముపాశ్రయే ॥

తా॥ హనుమంతుఁడా ! దేవదేవుడా ! నీ భక్తులను రక్షించువాడా! శ్రీరాముని యానందమునకు కారణమైనవాఁడా ! నిన్ను నే నాశ్రయించుచున్నాను.

శ్లో॥ ధ్యాతశ్చ హనుమాం స్తేన-భక్తాభ్యాశ ముపాగమత్

తా॥ హనుమంతుఁడాతనిచే ధ్యానింపబడి పుష్కరుని వైపు వచ్చెను.

శ్లో॥ సువర్ణకుండలద్యోతి-దీప్త గండస్థలద్వయః
హేమోపవీత సంవీతో-దివ్య పీతాంబరాంవృతః ॥
రత్నకంకణసన్నాదీ-ధ్వన న్మంజీరమంజులః
నవరత్నాంశుసంవీత-మహార్హ మకుటోజ్వలః ॥
పశ్చాల్లంబి శిఖోపేత-క్వణిత స్వర్ణపర్ణకః
సువర్చలాం దధాన శ్చ-వామభాగే నిజప్రియామ్ ॥

తా॥ ఆ హనుమంతుడు బంగారుకుండలముల కాంతి వలన ప్రకాశించు కుడి యెడమ చెక్కిళ్ళుకలవాఁడును, బంగరు జందెము ధరించువాఁడును, దివ్యమగు పట్టు వస్త్రములు కట్టినవాఁడును, రత్నకంకణధ్వనులు కలవాఁడును, ధ్వనించు నందెలతో శోభించువాడును, నవరత్న కాంతులతో కూడిన గొప్పకిరీటముచే ప్రకాశించువాఁడును, వెనుక వ్రేలు శిఖకు కూడి ధ్వనించు బంగరు రేకు తాల్చినవాడును, ఎడమ భాగమున సువర్చలను ధరించినవాఁడును తనకు ప్రియురాలును.

శ్లో॥ హనుమత్ పాదపద్మాంత-ర్న్యస్తనేత మధువ్రతామ్
ధ్యాయంతం హృది భర్తారం-పార్వతీ మివ శంకరమ్ ॥

తా॥ హనుమంతుని పాదపద్మములందు సంచరించు కనులను తుమ్మెదలు కలదియు, శంకరుని పార్వతివలె భర్తను హృదయమున ధ్యానించునదియు.

శ్లో॥ కంబుకంఠీం మహాభాగాం-పీనోన్నతకుచద్వయీమ్
కింకిణీ జాల సన్నాది-మేఖలాదామ శోభితామ్॥

తా॥ శంఖమువంటి కంఠము కలదియు, బలసి యెత్తయిన స్తనములు కలదియు, చిరుగజ్జెలు మ్రోయు వడ్డాణముతో ప్రకాశించునదియు.

శ్లో॥ పదాంగుష్ఠ నఖజ్యోత్స్యా-ర్జితోద్య చ్చంద్రమండలామ్
ఆదర్శసదృశ ప్రఖ్య గండభాగ స్ఫుర న్ముఖామ్॥

తా॥ పాదముయొక్క బొటనవ్రేలి గోటికాంతిచే జయించబడిన ఉదయించు చంద్రబింబము కలిగినదియు, అద్దమువంటి చెక్కిళ్ళతో శోభించు ముఖము కలదియు.

శ్లో॥ స్వర్ణతాటంక సంరోచి శ్రీకార సదృశ శ్రవామ్
నవ చంపక సూ నాభ-నాసాం చంద్రని భాననామ్॥

తా॥ బంగారు చెవికమ్మలకాంతిచే నొప్పి 'శ్రీ' అనునాకారముతో నున్న చెవి కలదియు, అప్పుడే పూచిన సంపెంగపూవుతో సమానమైన ముక్కు కలదియు, చంద్రునివంటి మోముకలదియు

శ్లో॥ కర్ణాంతాయుత నేత్రాం తాం-కామ చాపాయిత భ్రువమ్
మయూరబర్హ ధమ్మిల్లాం-కలహంసగతి స్థితామ్॥

తా॥ చెవుల వఱకు వ్యాపించి విశాలమైన నేత్రములు కలదియు, మన్మథుని వింటివంటి కనుబొమలు కలదియు, నెమలిపింఛముతో సమానమగు కొప్పుకలదియు, మనోహరమగు హంసయొక్క నడకలుగలదియు.

శ్లో॥ పక్వబింబాధ రోష్ఠింతాం-స్ఫుర ద్దశన దాడిమామ్॥
ముక్తతిలక సంరాజిత్ఫాలపట్టాంసు మధ్యమామ్

తా॥ పండినదొండపండువంటి క్రింది పెదవికలదియు, ప్రకారించు దొండపండుగింజలవంటి దంతములు కలదియు, ముత్యపుబొట్టుతో నొప్పు నుదురుభాగము కలదియు మంచి నడుముకలదియు

శ్లో॥ శిరీషపుష్ప మృదుల-బాహుయుగ్మ మనోరమామ్
అంగుళీయక ముద్రాంత స్ఫుర దంగుళి పాణినా
వీజయంతిం స్వభర్తారం-చామరేణశనైశ్శనైః॥

తా॥ దిరిసెనపూవువలె మెత్తనగు బాహువులు రెంటిచే మనోహ మైనదియు, ఉంగరముకల్గి ప్రకాశించు వ్రేళ్ళుకల చేతితో చామరముబూని నెమ్మదిగ భర్తయగు హనుమంతునకు వీచుచున్నట్టియు.

శ్లో॥ రంభాసౌందర్య సర్వస్వ-హారి రంభోరు సంభ్రమామ్
సికతామయ సౌందర్య-జఘనాం ఘన విభ్రమామ్॥

తా॥ అప్సరయగు రంభయొక్క సౌందర్యమంతను హరించునట్టి అరటిబోదెలబోలు తొడలు కలదియు, ఇసుక తిన్నెలవంటి సుందరమగు పిరుదు కల్గినట్టియు.

శ్లో॥ ఆవర్త సిమ్న వివర-స్ఫుర న్నాభిగుహాంతరామ్
రక్త పంకేరుహ ప్రఖ్య-రోమరాజి విరాజితామ్॥

తా॥ సుడిదిరిగి లోతుగనున్న బొడ్డుకలదియు, ఎఱ్ఱతామరం బోలు నూగారుతో ప్రకాశించునదియు.

శ్లో॥ ముక్తాహార స్ఫుర ద్గ్రీవాం-సర్వాభరణ భూషితామ్
మందస్మితాం సువర్ణాభాం-సూర్యపుత్రీం సువర్చలామ్॥

తా॥ ముత్యాలహారముతో ప్రకాశించు కంఠము కలదియు, సమస్తములగు నాభరణములచే నొప్పునదియు, చిఱునగవు కలదియు, బంగారముతో సమానమగు సూర్యునిసుమార్తెయగు సువర్చలను.

శ్లో॥ కౌశేయం పరిధానం చ-చధానం చ కౌశేయమ్
ఏవం సర్వగుణోపేతాం-ప్రేయసీం మారుతాత్మజః
వామభాగే వహన్ భార్యాం-క్షణా త్ప్రాదురభూ న్మనేః॥

తా॥ పట్టుబట్టను కట్టుకొని పద్మమును ధరించి సర్వసద్గుణము తో కూడిన ప్రేయసిని హనుమంతుఁడు వామభాగమున పొందినవాఁడై క్షణములో పుష్కరమహామునికి ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ కరభ కల భవాహః స్వర్ణరంభావనాంతః
ప్రచల దచలశృంగో వ్యక్తచం చత్కరాబ్జః
అధికుతల మగాత్త త్పుష్కరాధిష్ఠితం యత్
రవిసుతకరధారీ లంబహారో హనూమాన్.

తా॥ ఏనుగుగున్నవంటి ఒంటెపిల్లను వాహనముగాఁగలవాఁడు. బంగారు అరటితోటలో కదలెడి కొండశిఖరమువలె నుండువాడు ప్రకాశించు కరకమలము కలవాఁడు, సూర్యసుతయగు సువర్చలచేతిని పట్టుకొన్నవాఁడు. వేలాడుహారముకలవాడునై హనుమంతుఁడు పుష్కరమహామునియున్న భూప్రదేశమున కవతరించెను.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పంచముఖహనుమద్వివరణే పరాశరమైత్రేయ సంవాదే సూర్యసుతా కథనం నామ ...మ పటలః



ఓం

శ్రీ హనుమతేనమః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

ఏకాదశ పటలః

## బాలచరిత్రం

మైత్రేయః

శ్లో॥ హనుమస్పుష్కర సంవాదం-శ్రోతు మిచ్ఛా మ్యహం మునే
తం మ మాచక్ష్వ పాపఘ్నం-పరాశర! గురూత్తమః

తా॥ మైత్రేయమహాముని పరాశరమహాముని నీ రీతిగా నడుగుచుండెను. ఓ మహానుభావా! పరాశరమహామునీ! నేను పుష్కరునికి హనుమంతునకు జరిగిన సంభాషణను వినుకోర్కెతోనున్నాను. పాపముల పారించునట్టి యీ విషయమును తెలుపవలసినది! అనగా

శ్రీ పరాశరః

శ్లో॥ త మాగతం హనూమంతం-స్వదృష్టివిషయం ద్విజః
దృష్ట్వా తు సహ సోత్థాయ-సాష్టాగం ప్రణతోఽభవత్॥

తా॥ పరాశరమహాముని ఇట్లు చెప్ప మొదలిడెను. పుష్కరమహాముని తన యెదుటకువచ్చిన హనుమంతుని చూచి వెంటనేలేచి సాష్టాంగ నమస్కారము చేసెను.

శ్లో॥ పున రుత్థాయ సంతుష్ట-స్తుష్టావా భీష్ట దైవతమ్
హనుమంత మువా చాథ పుష్కరో దీనవత్సలః॥

తా॥ లేచి మిక్కిలి సంతోషముతో ఆ దీనబంధు వగు పుష్కర మహాముని తన కిష్టదైవ మగు హనుమంతునితో నిట్లనెను.

శ్లో॥ గాలోఽయం మృగయు ర్నీచః- కథం మంత్ర[illegible]
యోగ్యోఽయ మితి సందేహో-బాధతే మా మహ[illegible]

తా॥ ఓమహాప్రభూః ఈతఁడు గాలుఁడను [illegible]
కాఁడు. ఈతనికి నీ మంత్రమందు యోగ్యతచేకూరు [illegible]
హము రాత్రిం దివము నన్ను బాధించుచున్నది.

శ్లో॥ అయం తు చిరకాలాయ-మా ముపాస్తే కృతాంజలిః
కపీంద్ర స్త్వమువా చాథ-మా కురుష్వాత్ర సం[illegible]

తా॥ ఈతఁడు చాలకాలముగా వినయపిధేయత[illegible]
చున్నాడు. అనగా హనుమంతుఁడు "ఓపుష్కరమహా[illegible]
సందేహపడవద్దు:

శ్లో॥ మ న్మంత్రజాల విషయే మద్భక్తేమయ్యపి ద్విజః
ఉతదేశగురౌ చాపి భక్తి రే వాత్ర కారణమ్॥

తా॥ నామంత్ర సమూహమున, నా భక్తునియందు, [illegible]
నా మంత్రము నుపదేశించు గురునియందును భక్తి కల్గియుండు[illegible]
మగు విషయము.

శ్లో॥ శూద్రో వా విప్రకీర్ణో వా-వైశ్యో వా క్షత్రియోఽపి వా
విప్రో వా యశ్చ కశ్చాపి-యోషిద్వా పురుషోఽపి వా
మన్మంత్ర విషయే సర్వే-పాత్రాణ్యేవ న సంశయః

తా॥ శూద్రుఁడైన, సంకరజాతివాడైన, కోమటియైన, [illegible]
నను, బ్రాహ్మణుఁడైన, ఎటువంటివాఁడైనను, స్త్రీయైనను [illegible]
అందఱు నా మంత్రమున కర్హులే. సందేహములేదు.

శ్లో॥ వంచకాయ కృతఘ్నాయ-దాంభికాయాఽతిలో[illegible]
గురువిశ్వాస హీనాయ న దేయం మంత్ర ము[illegible]

తా॥ మోసగానికి, చేసినమేలు మఱచువానికి, [illegible]
కొను గర్విష్టికి, లోభగుణము కలవానికి,గురునియందు న[illegible]
నుత్తమమగు నా మంత్రము నుపదేశించరాదు.

శ్లో॥ తస్మాద స్తస్య విశ్వాసః-స్థిరా భక్తి రభూ ద్ద్విజ!
దేయమే వాస్య మంత్రం మే-ద్వాదశాక్షర ముత్తమమ్॥

తా॥ ఆ కారణమున ఓపుష్కరమహాముని! మంత్రమందు సమ్మ్రకము, అచంచలమగు భక్తికల ఈతనికి నా సంబంధమగు ద్వాదశాక్షర మంత్ర ముపదేశింప తగియేయున్నది.

శ్లో॥ ఇత్యుక్త్వా హనుమాన్ భక్తం-తత్రైవాంతరధీయత।

తా॥ అని తన భక్తునకు చెప్పి హనుమంతుడంతర్ధానమునందెను.

శ్లో॥ తత స్సారస చక్రాంగి-హంసకూజిత శోభితమ్
జలకుక్కుట కోయష్టి-కాత్యూహ కలకూజితమ్॥

తా॥ అటుపిమ్మట బెగ్గురుపక్షులు, చక్రవాకములు, హంసలుచేయు ధ్వనులచే శోభించునట్టి, నీటికోళ్ళు, కొంగలున్నగువాని యనూహ్యమగు నవ్యక్త మధురధ్వనులతో నున్నట్టియు.

శ్లో॥ వికచ త్కమల వ్రాత-భ్రమమాణ మధువ్రతమ్
మల్లికా జాతి లకుచ-సురభి క్రాంత కాననమ్॥

తా॥ వికసించు కమలముల సమూహమున తిరుగునట్టి తుమ్మెదలు కలడియు, మల్లెలు, జాజులు, గజనిమ్మ పరిమళము వ్యాపించిన వన ప్రదేశమును

శ్లో॥ హనుమ త్పాదనిర్మాల్య-శోభి తోభయ పార్శ్వకమ్
పురంధ్రీ కుచ హారిద్ర-రంజి తోరు విరాజితమ్॥

తా॥ హనుమంతుని పాదపూజ యందు వినియోగింపబడి తీయబడి నీటియందు కల్పుటచే ప్రవాహమునకు రెండువైపుల చేరినట్టి నిర్మాల్యముకల్గి. జలక్రీడలయందు కడుగబడిన స్త్రీల చనుబూతల పసిమి మిసిమి కల,

శ్లో॥ జపతా మునిబృందేవ-సేవ్యమాన మహర్నిశమ్
సర్వపాపహరం నృణా-మవిదూరం భయాపహమ్॥

తా॥ జపమెనర్చు మునిసమూహముచే రాత్రింబవళ్ళు సేవింప బడునట్టియు, మనుజుల పాపములనన్నిటిని పోగొట్ట జాలినట్టియు, మనుష్యులకతి సన్నిహితమైనది. భయమునంతను పోగొట్టసమర్థమగు.

శ్లో॥ పుణ్యతీర్థ మితి ఖ్యాతం త్రిషు లోకేషు విశ్రుతమ్
దర్శయామాస గాలాయ పుష్కరో హస్త సంజ్ఞయా॥

తా॥ పుణ్యతీర్థముగా తెలియబడి ముల్లోకము లందు విఖ్యాతమైన దానిని గాలునకు పుష్కరుడు హస్త సంజ్ఞతో చూపెను.

శ్లో॥ పుణ్యతీర్థం ప్రప ర్శ్యాథ-ప్రాహ గాలం మునీశ్వరః
స్నాత్వా తత్ర మహా పుణ్యే-శీఘ్ర మాగమ్యతా మితి ॥

తా॥ అట్లు పుణ్యతీర్థము చూపి పుష్కర మహాముని గాలునితో అట్టి పుణ్యోదకమున స్నానము చేసి వెంటనే రమ్మనెను.

శ్లో॥ గాల స్తమబ్రవీ ద్విప్ర ఘన త్పాదాంబు పీయతామ్
తదేవ పుష్కరం గంగా-తదేవ సుతీరాత్మజా
కావేరీ యమునా చైవ కృష్ణవేణీ సరస్వతీ ॥

తా॥ అంత గాలుడు ఓ బ్రాహ్మణోత్తమా ! నీ పాదజలము నీయవలసినది. అదియే పుష్కరతీర్థము, అదియే గంగానది అదియే [illegible], అదే కావేరి, యమున, కృష్ణానది, సరస్వతీనదియు నదియే.

శ్లో॥ తదేవ మానసంతీర్థం-తదేవ సరయూనదీ
తదేవ చంద్రభాగాఽపి-ఫలునీ సింధుసంగమః ॥
రేవానదీ మహాపుణ్యా-గురుపాదోదకం ప్రభో ః

తా॥ అదియే మానస సరోవరము, అదే సరయూనది, అదే చంద్రభాగ, ఫల్గుని, సింధు సంగమము కూడ, ఓ మహాత్మా గురు పాదోదకమే రేవానది కూడ.

శ్లో॥ యస్యాఽపి నాత్ర విశ్వాసో-గురుపాదోదకే మునే
నపున స్తస్య దుర్నీతిం-తీర్థానా మయుతా న్యపి ॥

తా॥ శుభప్రదమగు గురుపాదజలమున నెవ్వనికి విశ్వాసము ఉండదో అట్టివాని పాపమును పదివేల తీర్థములైన పోగొట్టవు.

శ్లో॥ హత్యా శ్శతసహస్రాణి-హ్యగ మ్యాగమనాని చ
స్వర్ణ స్తేయాది పాపాని-సురాపానకృతాన్యపి
గురుపాదోదక స్పర్శాత్-సర్వాఘానాం వినాశనమ్ ॥

తా॥ గురుపాదజల స్పర్శచే వందల, వేల హత్యల పాపము, పొందరాని వానిని పొందిన పాపము. బంగారము దొంగిలించుట, మద్య సేవనమువంటి మహాపాతకములు సమస్తములు తొలగిపోవును.

శ్లో॥ తస్మా దిదం శరీరం మే-భవ త్పాదాంబు ధారకమ్
ఆపాద మస్తకం శీఘ్రం-సిచ్యతాం కరుణానిధే!
యద్వైభవా దహం సద్యః-కార్యసిద్ధి మవాప్నుయామ్

తా॥ కావున ఓ దయాపూర్ణుడా! ఏ నీ పాదజలమహిమచే నేను వెంటనే కార్యసిద్ధిపొందగలనో అట్టి పాదజలమే శరణ్యమగు నా దేహమును ఆ పాదమస్తకము వెంటనే తడుపుము.

శ్లో॥ ఇత్యు క్తః పుష్కరస్తేన-వ్యాధేన దృఢబుద్ధినా
స్వగురుం చ హనూమంతం-ధ్యాత్వా యోగవిదాం వరః
ప్రోక్షయామాస తస్యాంగే-నిజ పాదోదకం మునిః॥

తా॥ నిశ్చలమనస్కుడైయున్న కిరాతుడగు గాలునిచే పై రీతిగా చెప్పబడినవాడై యోగజ్ఞులలో శ్రేష్ఠుడుగు పుష్కరుడు తన గురువగు హనుమంతుని ధ్యానించి తన పాదజలమును గాలుని దేహమున చల్లెను.

శ్లో॥ గురుపాదోదక స్పర్శ-విశ్వాసా ద్ధతకిల్బిషః
సద్యో .నివృత్తి మగమత్-వ్యాధేః వ్యాధో దురాత్మనః॥

తా॥ గురుపాదోదక స్పర్శయందు విశ్వాసమునకు తగినట్లుగా ఆ బోయయగు గాలుడు పాపములు తొలగినవాడై వ్యాధి కూడ నయమైన వాడాయెను.

శ్లో॥ తతో విమలదేహస్య-గాలస్య విమలాత్మనః
సువర్చలాసమేత శ్రీ-హనుమద్ద్వాదశాక్షరమ్
మంత్రరాజ మితి ఖ్యాతం-దిష్టవాన్ కరుణానిధిః ॥

తా॥ పిమ్మట అట్లు స్వచ్ఛదేహముకల, విశుద్ధాత్ముఁడగు గాలునకు దయామయుఁడగు పుష్కరుఁడు మంత్రరాజమని కీర్తింపబడు సువర్చలా సమేత శ్రీ హనుమద్ద్వాదశాక్షర మహామంత్రము నుపదేశించెను.

శ్లో॥ గాలో జపన్ మహామంత్రం-సన్నిధా వేవ సద్గురోః
అష్టోత్తరశతావృత్త్యా-సద్యస్సిద్ధి మవాప సః ॥

తా॥ గాలుఁడా మహామంత్రమును సద్గురు సమీపముననే జపించుచు నూటయెనిమిది పర్యాయములు జపించుటతోడనే ఫలసిద్ధిని పొందెను.

శ్లో॥ గురువిశ్వాస మహాత్మ్యాత్-గురుపాదాంబు సేవనాత్
మనో నైర్మల్యవత్త్వా చ్చ-సద్య స్సిద్ధి మవాప సః ॥

తా॥ గురువునందు నమ్మకముంచిన ప్రభావమున, గురుపాద జలసేవనము వలన, మనస్సును నిర్మలముగా నుంచుకొనుటవలనను వెంటనే ఫలసిద్ధి నందెను

శ్లో॥ అతీంద్రి యార్థజాలాని-భూత భవ్య భవంతి చ
దిష్టమాత్రే మహామంత్రే-బుద్ధవా న్మృగయు స్తథా ॥

తా॥ ఇంద్రియముల కగోచరములగు విషయములను భూత భవిష్యద్వర్తమాన విషయములన్నిటిని ఆ కిరాతుఁడగు గాలుడు మంత్రోపదేశ మాత్రముననే తెలిసికొనగల్గెను.

శ్లో॥ ఏవం సర్వార్థ విజ్ఞానాత్-ప్రా గిహం సు ప్తవా నపి
బుద్ధోఽహ మధునాచేతి జజాప న్యాథవల్లభః ॥

తా॥ ఇట్లన్నియు తెలిసికొన్నవాడగుటవలన వెనుక నిద్రామయుఁడనుగానున్నను ఇప్పుడు జాగ్రతినందితినని ఆతఁడు మంత్రమును శ్రద్ధతో జపించెను.

శ్లో॥ నిధయోఽపి సమృద్ధాశ్చ-విషయా స్తస్య చక్షుషః
గురువిశ్వాసమహాత్మ్యాత్-అభవన్ తస్య వశ్యగాః ।
ఖేచరత్వ మభూ త్తస్య-సంచార స్సర్వపిష్టపే ॥

తా॥ గురు విశ్వాస కారణముగా నా గాలునకు నిధులు కలుగు ప్రదేశములు, సమస్తములగు విషయములను కన్నులకు కట్టినట్లయినవి. ఆతనికి ఆకాశమున సంచరించు శక్తి యేర్పడి అన్ని లోకములందు తిరుగ వీలయ్యెను.

శ్లో॥ సిద్ధ చారణ గంధర్వాః-ఇంద్రాద్యా అపి దేవతాః
వ్యాధస్య గురువిశ్వాసాత్-విస్మయం పరమం యయుః ॥

తా॥ సిద్ధ చారణ గంధర్వాదులు, ఇంద్రుడు మొదలగు దేవతలును ఆ వ్యాధుని గురుభక్తికి మిక్కిలి విస్మయమందిరి.

శ్లో॥ పపాత పుష్పవృష్టి శ్చ-నన్నృతు శ్చాప్సరోగణాః
దేవదుందుభయో నెదుః-వవు ర్వాతా యథాసుఖమ్
తతః పరమసంతుష్టో-గాలో గురు మథాఽబ్రవీత్ ॥

తా॥ పూలవాన కురిసెను అప్సరసలు నృత్యము చేసిరి, దేవదుందుభులు మ్రోగినవి. సుఖకరమగు వాయువులు వీచినవి, అటుపిమ్మట మిక్కిలి సంతసించినవాఁడై గాలుఁడు గురుఁడగు పుష్కరునితో నిట్లనెను

శ్లో॥ కృతార్థోఽస్మి మహాభాగః-తవ పాదాంబు సేవనాత్
మహామంత్రప్రదానా చ్చ సిద్ధోఽస్మి జగతాం త్రయే ॥

తా॥ ఓ మహానుభావా! నీపాదజల సేవనమువలన ధన్యుఁడనైతిని. మహామంత్రము నిచ్చుటద్వారా ముల్లోకములందు ప్రసిద్ధుఁడనైతిని.

శ్లో॥ సం। ప్రార్థయే పరం బ్రహ్మన్-భవంతు మధునా గురో
తవ పాదాబ్జయుగళే-భక్తి ర్భూయాన్నిరంతరమ్ ॥

తా॥ పర బ్రహ్మస్వరూపుఁడవగు ఓ గురుదేవా! మిమ్మి ప్పుడు నేను ప్రార్థించుచున్నాను. ఏమన-ఎల్లప్పుడు మీపాదపద్మముల యందు నాకు భక్తి నిలచియుండుగాక!

శ్లో॥ ఇదమేవ మ మాభీష్ట-మితోఽన్యం నాస్తి మే మునే!
ఆదిశ్యతాం మ మాజ్ఞాప్యం మాభూ త్కాలవిపర్యయః ॥

తా॥ ఇదియే నాకోరిక. ఇంతకుమించి నాకు వేఱులేదు. ఓ మహాముని ఆలసించక మీయాజ్ఞను తెలియజేయుఁడు.

శ్లో॥ వ్యాధస్య వచనం శ్రుత్వా-పుష్కరః పుష్కరేక్షణః
తదేతి ప్రతిజగ్రాహ-ముఖ్యశిష్యో భవా నితి ॥

తా॥ ఆ కిరాతుని మాటలు విన్నవాఁడై కమలాక్షుఁడగు పుష్కరుఁడు అట్లేయని నీవు నాకు ముఖ్యశిష్యుఁడ వౌదువుగాక! అని యనుగ్రహించెను.

శ్లో॥ మంత్ర స్సిద్ధ ఇతి జ్ఞాత్వా-న త్యాజ్యో హి కదాచన
ప్రత్యవాయో భవే న్నూనం-దారిద్ర్యం చ భవే న్మహత్ ॥

తా॥ గాలా! మంత్రము సిద్ధించినది యని యెంచి యెన్నడును వదలకుము. అట్లు మంత్రమును త్యజించుటచే ప్రత్యవాయము సిద్ధించి పరమదారిద్ర్యముకూడ యేర్పడ గలదు.

శ్లో॥ యథాశక్తి జపః కార్యః-హనుమత్ప్రీతయే సదా
భోక్తవ్యా హి మహాభోగా-యథేష్టం బంధుభి స్సహ ॥

తా॥ హనుమదనుగ్రహముకొఱకు శక్తికొలది యెల్లప్పుడు తప్పకజపించి బంధుమిత్రాదులతోకూడి మహాభోగము లనుభవించుచుండ వగును.

27)

శ్లో॥ భుక్త్వా భోగాన్ తతో గాల! - హనుమత్పద మాప్నుహి
ఇత్యుక్త్వా ప్రేషయామాస-వ్యాధం త ద్వేశ్మ పుష్కరః॥

తా॥ ఓ గాలుఁడా! సకలభోగముల ననుభవించిన పిమ్మట హనుమంతుని సాన్నిధ్యమందుము అని పుష్కరుఁడా కిరాతుని వాని నివాసమున కంపెను.

శ్లో॥ ప్రేషితోగురుణా గాలో - విసృజ్య బాష్పము త్తమమ్
ప్రదక్షిణ నమస్కారైః -పూజయామాస తం గురుమ్॥

తా॥ అట్లు గాలుఁడు గురువుచే నంపబడువాఁడై గురువునకు దూరము కానున్న కారణమున కన్నీరు కార్చుచు ఆ గురువగు పుష్కరుని ప్రదక్షిణ నమస్కారములతో నర్చించెను.

శ్లో॥ అథ గురుపదపద్మ లగ్న చేతాః
శ్రిత నిజకార్యభరో గురుప్రసాదాత్
నిజగృహ ముపచక్రమే నిగంతుం
నిజగురు సంప్రతిపన్న సౌమ్యభావః॥

తా॥ అటుపిమ్మట గాలుఁడు గురువగు పుష్కరుని పాదపద్మము లందు మనస్సులగ్నమైయుండ గురు వాక్యమువలన స్వీయకార్యభారమును ఆశ్రయించువాఁడై గురునియందు లగ్నమగు మనస్సుకల్గి నిజసదనమున కేగ మొదలిడెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే
శ్రీసువర్చలా హనుమద్ద్వాదశాక్షర మహిమానువర్ణనం నామ

ఏకాదశః పటలః

— o —

# ద్వాదశ పటలః

## గురుభక్తి కథనం

శ్రీ మైత్రేయః-

శ్లో॥ కార్యసిద్ధి ముపాగమ్య-వ్యాధో మన్మథసుందరః
తతః కిం కృతవాన్ గాలః మధ్యేమార్గం పరాశర ॥

తా॥ మైత్రేయుఁడు మరల ఈరీతిగా నడిగెను. ఓ పరాశర మహామునీ! మన్మథునివంటి సౌందర్యము పొందినట్టియు, తనకోర్కె నెరవేరిన కిరాతుఁడగు గాలుఁడు మార్గమధ్యమున నేమిచేసెను? అని.

శ్రీ పరాశరః

శ్లో॥ మైత్రేయ! శ్రుణు వక్ష్యామి-గాలవృత్తం యథాక్రమమ్
యద్వృత్త దర్శనా ద్భూయో-దేవా అపి ముదం యయుః

తా॥ అంత పరాశరుఁడు-మైత్రేయా! ఎవనివృత్తాంతము చూచి దేవతలుసైత మానందమందెదరో అట్టి గాలుని వృత్తాంతము క్రమముగా చెప్పెదను వినుము.

శ్లో॥ గచ్ఛ న్మార్గే శనైర్గాలః-ధ్వజదత్త మవైక్షత
దృష్టమాత్రే ధ్వజే తస్మిన్-త్యక్త్వా తత్పదవీం హఠాత్
భీతో మార్గాంతరం ప్రాప్తో గురుంనిందాయతోఽభవత్॥

తా॥ అట్లు వెళ్ళుచున్నవాఁడై త్రోవలో గాలుఁడు ధ్వజదత్తుని చూచెను. చూచినంతనే గురునిందచేయునను భయముతో నొక్కసారిగా వేఱొకమార్గము చేరిపోజొచ్చెను.

శ్లో॥ గచ్ఛంత మద్భుతాకారం-సూర్యబింబమివ స్థితమ్
దృష్ట్వా తం సహ సోత్థాయ-విప్ర స్త్వర్య క్షమాగతః ॥

తా॥ అట్లు వెడలు అద్భుతాకారుని, సూర్యబింబమువలె ప్రకాశించువానిని చూచి బ్రాహ్మణుఁడగు ధ్వజదత్తుఁ డొక్కసారిగా లేచి ఆతని కడ్డముగా బయలుదేరి

శ్లో॥ జవేన మహతా ధావన్-మహానిశ్వాస ముత్సృజన్
మహతా రంహసా సోఽపి క్షణా ద్గాలేన సంగతః ॥

తా॥ గొప్పవేగముగా పరుగిడుచు నిట్టూర్పులువిడుచు క్షణములో గాలుని కలసెను.

శ్లో॥ తం తథా విధ మాసాద్య-విప్రో వచన మబ్రవీత్
మా ముపేక్ష్యక్వ గంతాసి ? సుహృత్ప్రాణసమో మమ ॥

తా॥ అట్లాతనిని చేరి ధ్వజదత్తుఁడు ఓ ప్రాణ సమానుఁడవగు మిత్రుఁడా ? నన్ను విడచి యెచ్చటకు వెళ్ళుచున్నావు ?

శ్లో॥ త్వ దాగమనమేవాత్ర-ప్రతీక్ష్యాఽహ మవస్థితః
ఋజుభావం పరిత్యజ-కథం గంతాసి వక్రతామ్ ?

తా॥ నీ రాక నెదురుచూచుచునే యిచ్చటనున్నాను. సరియగు రీతిని వీడి యిట్లు వక్రగతి నెందుకు పొంది తప్పించు కొనుచుంటివి ?

శ్లో॥ ఇద్ధం రూపం కుతో లబ్ధం ? కందర్పస్యాఽపి మోహనమ్
కుత్సితం పూర్వరూపం తు-నివృత్తం కేన హేతునా ?

తా॥ మన్మథుని సైతము తిరస్కరించునట్టి ఈ మోహన రూప మెట్లు పొందితివి? వికారమగు నీ పూర్వరూప మేకారణమున పోగొట్టబడినది?

శ్లో॥ ఏత త్సర్వం మ మాఖ్యాహి పృచ్ఛతో దీనవత్సల ।
ఏవం సంప్రార్థితో గాలో-యథావృత్త మవేదయత్ ॥

తా॥ దయామతీ ! పై విషయమంతయు నాకు చెప్పుము. అని ప్రార్థించగా గాలుఁడు జరిగిన దంతయు యథా క్రమముగ తెల్పెను.

శ్లో॥ పుష్కరస్తు మహాయోగీ గురు ర్గౌరవ గోచరః
నిజపాదోదకేనైవ-దుర్దశాం మే జహార సః

తా॥ మహాయోగియు, గౌరవరూపుఁడు, పూజ్యుఁడునగు పుష్కరుఁడే తన పాదజలమువలన నా దుర్దశనంతను పోగొట్టెను.

శ్లో॥ తదను గ్రహ ఏవాఽయం-శ్రేయో హేతుఃపరం మమ
తతో రూపమిదం ప్రాప్తం-రమణీయం మయా ద్విజ

తా॥ ఆతని యనుగ్రహమే నా యీ పరమ శ్రేయస్సునకు కారణము. అందుననే ఓ బ్రాహ్మణోత్తమా! నేనిట్టిమనోహరమగు రూపమును పొందితిని.

శ్లో॥ ఇదానీ మహ మాగచ్ఛన్-మృగయాభ్యాస పాటవాత్
చమరీం ద్రష్టుకామస్సన్-వక్రమార్గ ముపాగతః
ఇత్యుక్త్వా వ్యాధవర్యోఽపి-నిజవేశ్మ క్షణా దగాత్ ॥

తా॥ ఇపుడు నేను వచ్చుచు వేటయందలి నేర్పున చమరీ మృగమును చూచు కోర్కెతో వక్రమార్గము చేరితిని అని యాకిరాతుఁడు క్షణములో తన నివాసమునకు చేరుకొనెను.

శ్లో॥ ఆగత్య స్వగృహం గాలో-భుంజన్ భోగాన్ యథేప్సితాన్
పుత్ర మిత్ర కళత్రాద్యై-ర్బహుకాలం విహృత్య సః
హనుమన్మంత్ర మాహాత్మ్యా-దగమ త్పరమాంగతిమ్ ॥

తా॥ గాలుఁడు తన యింటికి వచ్చి చాలకాలము పుత్రమిత్ర భార్యాదులతో నిష్టములగు కోర్కెలన్నిటి ననుభవించుచు గడిపి చివరకు హనుమంతుని మంత్ర ప్రభావము వలన పరమపదము నందెను.

శ్లో॥ ధ్వజదత్తోఽపి విప్రేంద్ర-స్సిద్ధ్యభావా చ్చిరా దపి
వ్యాధావిలంబ సిద్ధే శ్చ-నిర్వేదం పరమం గతః ॥

తా॥ ధ్వజదత్తుఁడు తనకెంతకాలమునకు ఫలసిద్ధి లేకుండుటకు, వ్యాధుఁడగు గాలునకు వెంటనే సిద్ధించుటకు మిక్కిలి దుఃఖము నందెను.

శ్లో॥ మహావేగేన సంభ్రాంతః పుష్కరం పున రాయయౌ
ప్రణమ్య శిరసా విప్రో వచనం పున రబ్రవీత్ ॥

తా॥ అంత మిక్కిలి వేగమున పుష్కరునికడకు సంభ్రమమునవచ్చి తలవంచి నమస్కరించి ధ్వజదత్తుఁడు పుష్కరునితో నిటనెను.

శ్లో॥ బ్రహ్మ న్నహం ద్విజశ్రేష్ఠః-వేదవేదాంగ పారగః
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞ-స్సదాచారో జితేంద్రియః ॥
ఏవంవిధో జప న్మంత్రం-న సిద్ధిం కథ మాప్నుయామ్

తా॥ ఓ మహానుభావా? నేను బ్రాహ్మణశ్రేష్ఠుడనై వేద వేదాంగము లన్నియు నెఱిగిన వాఁడనై అన్ని శాస్త్రముల అర్థవిశేషాదిక మంతయు తెలిసినవాఁడనై నియమ నిష్ఠలు కల్గి ఇంద్రియ నిగ్రహము కలవాడనై యుంటిని. అయినను నేను మంత్రసిద్ధి నేందువలన పొందలేక పోతిని?

శ్లో॥ పురశ్చర్యాశ్చ బహుధా కృతా అపి మహామునే!
మహతా నియమేనాఽహ మజపం మంత్ర ముత్తమమ్

తా॥ అనేకపర్యాయములు పురశ్చర్యలు జరిగినను ఫలించ లేదేమి? ఓ మహామునీ! ఆ ఉత్తమ మంత్రమును నేను గొప్ప నియమ ముతో జపించితిని.

శ్లో॥ నిరాహారో జితస్వాప-స్స్నాత్వా పుణ్య జలే
వర్షాసు సికతా స్వేవ-హేమంతే జలమధ్యమే

తా॥ ఆహారమును మాని, నిద్రను వీడి, పుణ్యనదీ జలముల స్నానము చేసి, వర్షాకాలమున నిసుక తిన్నెల మీదను. హేమంత ఋతువు నందు నీటిమధ్య భాగమున నుండియు

శ్లో॥ గ్రీష్మే తప్తశిలాయాం చ-జపన్న పి మహామనుమ్
సిద్ధిం కదాపి నైవాపం-విలంబః కేన హేతునా?

తా॥ వేసవి కాలమున మాడుచున్న బండలపై నుండియు జపము చేసికూడా యెన్నటికి సిద్ధిని పొందలేకపోతిని? మహానుభావా! ఫలసిద్ధికి ఈ యాలశ్య మెందుకు జరిగినది?

శ్లో॥ వ్యాధస్తు నీచజన్మాఽపి దురాచారో ద్విపాత్పశుః
క్రూరకర్మ దురాహారా-స్సదా విషయలంపటః॥

తా॥ కిరాతుఁడగు గాలుఁడు హీనజాతివాఁడు. చెడు అలవాట్లు కలవాఁడు, రెండు కాళ్ళు గల పశువు, క్రూరమగు వేట సల్పువాడు, మాంసాహారి, ఎల్లప్పుడు ఇంద్రియములకు లోబడి యనుభవించుండు వాఁడు.

శ్లో॥ సురాపానరత శ్చాపి హ్యాగమ్యాగమ నోత్సుకః
దురాచారాశ్చ యేచా ఒ న్యే-తేషు సర్వత్ర తత్పరః॥

తా॥ ఇంకను మధ్యపానమునం దిష్టుఁడు కూడనివాని పొందుకోరు వాడు. ఎటువంటి దురాచారములింక నున్నవో అట్టివానియం దిష్టపడుండు వాఁడు,

శ్లో॥ కథం మంత్రస్య యోగ్యోఒయం-కథం జానాతి త ద్విధిమ్
భవతా వా కథం దత్తం? వ్యాధాయ క్రూరకర్మణే

తా॥ అట్టివాఁడు మంత్రమున కెట్లు యోగ్యుడు? మంత్రవిధి యాతని కెట్లు తెలియును? అట్టి నీచ కర్మకల కిరాతునకు నీవైన నెట్లు చెప్పితివి?

శ్లో॥ కథ మర్హతిగాలోఒయం-శ్వా యథా హవి రాధ్వరమ్
ఆగంతుం వా కథం యోగ్యః-శునీ వాధ్వరమండపమ్॥
అథవా జపతో మంత్రం-కిం న సిద్ధ్యతి? మే మునే!

తా॥ కుక్క యాగసంబంధమగు హవిర్భాగము గ్రహింప నర్హముకానట్లు ఈ గాలుఁడు మంత్రమున కెట్లు యోగ్యుఁడు? అసలిందు లకు వచ్చుటకైన నెట్టివాఁడు? కుక్క యజ్ఞవేదిక కడకు రానిగనట్లు. అయి నను ఓ మహామునీ! నిష్ఠతో జపించుచున్నను నాకు మంత్రసిద్ధి యేర్పడ దెందువలన?

శ్లో॥ ఇత్యుక్తవంతం ధ్వజద త్తమగ్రతః
కి మేత దాశ్చర్య? మిహేతి చింతయన్
నివారయామాస స గాలదూషణాత్
శనైశ్శనై స్సాంత్వవచోభి రాత్మవాన్॥

తా॥ ఇట్లు పల్కుచు నెదుటనున్న ధ్వజదత్తుని విషయమేమా యని యాలోచించుచు చల్లని మాటలు చెప్పుట ద్వారా గాలుని నిందించుట నెమ్మదిగా మాన్పించెను.

శ్లో॥ క్షిప్రం దివృక్షు శ్శిథి లాన్యకృత్యో
మహామనో స్సిద్ధివిలంబ హేతుమ్
ప్రత్యగద్ద్రుశా దైవిత సార్వభౌమమ్
విభావయామాస నిజాంతరంగే ॥

తా॥ హనుమన్మహా మంత్రసిద్ధి కేర్పడిన ఆలశ్యమునకు గల కారణమును వెంటనే చూచు కోర్కె కలవాడై ఇతరములగు పనులన్నిటిని ఆపి దివ్యదృష్టినంది తన మనమున దేవతలందఱియందు గొప్పవాఁడగు హనుమంతుని భావించెను.

శ్లో॥ తతోయోగం సమాస్థాయ-దృష్టవాన్ నిఖిలం జగత్
వర్తమానం యదే వాస్య-భూతం భావి చ యత్పునః ॥

తా॥ అటుపిమ్మట యోగముననుండి సమస్త ప్రపంచము నందలి భూతభవిష్యద్వర్తమాన విషముల నన్నిటిని చూచెను.

శ్లో॥ విచచ్య సకలం పశ్యన్-ద్విజవృత్తాంత సంగ్రహమ్
నిశ్చికాయ మహాయోగీ-హేతుం దాస్య విలంబనే॥

తా॥ అ మహాయోగి యగు పుష్కరుఁడు వివేచించి ధ్వజదత్తుని, చరిత్రమంతయు చూచి మంత్ర సిద్ధియందేర్పడిన ఆలశ్యకారణమును నిశ్చయించెను,

శ్లో॥ నిశ్చిత్త్వైవం ముని స్సమ్యగ్ధ్వజదత్త మథాబ్రవీత్
అవిశ్వాసో మహా నస్తి-ద్విజతే గురుగోచరః
తస్మాద్విలంబతే మంత్రం-విధివ జ్జపతోఽపి వా॥

తా॥ అట్లు నిశ్చయించి పుష్కరుఁడు ధ్వజదత్తునితో నిట్లనెను ఓ బ్రాహ్మణా నీకు గురువిషయమున నపనమ్మకము చాల కలదు. అందు ననే తగినట్లు జపించినను మంత్ర సిద్ధి యందాలస్య మగుచున్నది.

శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే- దైవజే భేషజే గురౌ
యాదృశీ భావనా యత్ర-సిద్ధి ర్భవతి తాదృశీ॥

తా॥ మంత్రవిషయమున, పుణ్యతీర్థము విషయమున, బ్రాహ్మణుని యందు, దేవుని యందు, జ్యోతిష్య మెఱిగిన వానియందు, వైద్యుని యందు, గురువునందును ఎటువంటి భావన యుండునో దానికి తగినటులే వారివలన ప్రయోజనసిద్ధి కూడ జరుగును.

శ్లో॥ మంత్రే దైవేచ విశ్వాస-స్తవాస్తి ద్విజసత్తమః
కింతు నాస్తి తవ శ్రద్ధా-గురౌ మంత్రోపదేష్టరి॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నీకు మంత్రవిషయమున, దైవము విషయమున నమ్మకము కలదు. కాని మంత్రము నుపదేశించిన గురువు విషయమున మాత్రము భక్తిశ్రద్ధలు లేవు.

శ్లో॥ దైవాద ప్యధికం మాన్యో-గురు ర్మంత్రోపదేశకః
దైవ స్వరూప మఖిలం-బోధితం యేన చాత్మనః।
తా॥ తనకు సంపూర్ణ దైవస్వరూపమును తెలియజేసిన మంత్రోపదేశకుఁడగు గురువు దైవముకన్న మిన్న యని యెఱుంగఁదగును.

శ్లో॥ గురు విశ్వాస మాహాత్మ్యా-ద్బాలో నీచతరోఽపి వా
ఇష్టసిద్ధి మవాప్యైవం-భుంక్తే భోగాన్ యథేప్సితాన్॥
తా॥ బాలుఁడు మిక్కిలి నీచుఁడైనను గురువునందు నమ్మకముంచిన ప్రభావముననే ఇష్టసిద్ధినంది కోరు సుఖముల నెల్ల ననుభవించుచున్నాఁడు.

శ్లో॥ గురురేవ పరందైవం గురోర్న్యాన్యద్ధి కించ న
గురుదైవతయో రైక్య భావా త్తరతి చేతనః॥

తా॥ గురువే పరదైవతము. గురువుకంటె మిన్న వేఱొకటిలేదు. మానవుఁడు గురువును, దైవతముతో సమానముగాభావించిననాడే తరించును

శ్లో॥ గురుణోదీరితం వర్ణం-వ్యర్థం వా సార్థ మేవ వా
తదేవ తారకం మంత్ర-మితి వేదవిదో విదుః॥

తా॥ గురువుచే చెప్పబడిన వర్ణము అర్థరహితమైనదైన, అర్థ సహితమైనదైనను అదియే తరింపజేయునట్టిది, అని వేదజ్ఞులు చెప్పుదురు.

శ్లో॥ త్వదర్థ మహ ముద్దిశ్య-హనూమంత మభావయమ్
మా మన్వగృహ్ణాత్కృపయా యథార్థకథనేన సః॥

తా॥ నీ కొఱకై నేను హనుమంతునిగూర్చి ప్రార్థించితిని నన్నను గ్రహించి దయతో జరిగినదంతయు తెలియజేసెను.

శ్లో॥ ధ్వజదత్త! భవా నేవ-సర్వశాస్త్రార్థ కోవిదః
గురువిశ్వాస హీనత్వాత్-మంత్రసిద్ధిన విందతి॥

తా॥ ఓ ధ్వజదత్తా! నీవు నిజముగా అన్ని శాస్త్రములును తెలిసిన వాడవు. కాని గురువునందు నమ్మకము లేకుండుట మంత్రసిద్ధి నరదలేకున్నావు.

శ్లో॥ గురువిశ్వాస పర్యంతం-పురశ్చర్యా విధి ర్వృధా
మంత్ర దైవత మాహాత్మ్యం యస్మా ద్బోధయతి స్ఫుటమ్
తస్మా ద్గురు ర్మహాదైవ-మిత్యవో చ త్కపీశ్వరః॥

తా॥ గురువునందు విశ్వాసము లేని కాలమున చేయు మంత్ర పురశ్చర్య వ్యర్థమే. స్పష్టముగా మంత్రముయొక్క. దైవముయొక్క మాహాత్మ్యమును చెప్పినవాఁడగుటవలన గురువే పర దైవతము అని హనుమంతుఁడు చెప్పెను.

శ్లో॥ త దిదానీం పున ర్విప్ర! గురు విశ్వాస పూర్వకమ్
ఇద మేవ మహామంత్రం - జప నిశ్చల మానవః
తత స్సిద్ధ్యతి మంత్రం తే-మా కురుష్వాఽత్ర సంశయమ్॥

తా॥ కావున ఓ బ్రాహ్మణుఁడా! గురువునందు విశ్వాస ముంచి నిశ్చలబుద్ధితో ఈ మహామంత్రమునే జపించుము, పిమ్మట నీకు మంత్రము సిద్ధించగలదు ఈ విషయమును సందేహించకుము.

శ్లో॥ ఇత్యుక్తో గురుణా విప్రో-హిత విశ్వాస పూర్వకమ్
ధ్వజదత్తః పునః ప్రాహ-గురుం దైవత సన్నిభమ్॥

తా॥ మేలగునట్టి నమ్మకముగునట్టి విషయము నీరీతిగా గురువగు పుష్కరునిద్వారా విన్నవాఁడై ధ్వజదత్తుఁడు దైవసమానుఁడగు నా గురునితో మరల నిట్లనెను.

శ్లో॥ పాపోఽహం పాపకర్మాఽహం పాపాఽఽత్మా పాప సంభవః
అవిశ్వాసాబ్ధి మగ్నోఽహం-తస్మా న్మా ముద్ధర ప్రభో!

తా॥ ఓ గురుదేవా! నేను పాపిని. పాపకృత్యములు చేసినవాఁడను. పాపాత్ముఁడను పాపమున బుట్టిన వాడను. అపనమ్మకమను సముద్రమున బడియున్నవాఁడను, కావున నన్నుద్ధరింప వలసినది.

శ్లో॥ గురువిశ్వాస హీనస్య-ప్రాయశ్చిత్తం వద ప్రభో!
ప్రాయశ్చిత్త విహీనస్య-నాస్తి కర్మాధికారితా

తా॥ ఓ మహానుభావా! గురువునందు నమ్మకముంచని దోషమునకు పరిహారము చెప్పుము. ప్రాయశ్చిత్త మొనర్చుకొననివానికి కర్మాధికారము లేదుకదా!

శ్లో॥ అధికార విహీనస్య-కృతం కర్మాపి నిష్ఫలమ్
న హి క్షుద్రకృతో యాగః-ఫలతీ త్యనుశుశ్రుమః॥

తా॥ అధికారము లేనివాఁడొనర్చిన కర్మ ఫలించదు. నీచుఁడొనర్చు యాగము ఫలించదని విందుము కదా!

శ్లో॥ తస్మాత్పాపనోదాయ-ప్రాయశ్చిత్తమి హోచ్యతామ్
దుర్లభం సులభం వాపి-కరిష్యే నాఽత్ర సంశయః॥

తా॥ కావున పాపమును తొలగించుకొనుటకు తగిన ప్రాయశ్చిత్తము సెలవిండు. అది కష్టమైనను సుఖమైనను తప్పక చేయుదును. ఇందు సందియమువలదు.

శ్లో॥ ఏవం దృఢమతిం విప్ర-మకృతార్థం దరిద్రకమ్
హనూమత్పాదతీర్థేన-ప్రోక్షయామాస పుష్కరః॥

తా॥ అనగా నట్లు నిశ్చలబుద్ధికల బ్రాహ్మణుఁడు ప్రయోజనమందని దరిద్రుఁడగు ధ్వజదత్తునిపై పుష్కరుఁడు హనుమత్పాద తీర్థమును చల్లెను.

శ్లో॥ సంప్రోక్షణా న్నివృత్తశ్చ-గుర్వవిశ్వాస కర్దమః
తతో గురుపదాంభోజ-జలేన స్నాన మాచరత్॥

తా॥ అట్లు చల్లుటచే గురువునందపనమ్మకమను బురద తొలగిన వాఁడై గురుదేవుల పాదజలముతో స్నాన మొనర్చెను.

శ్లో॥ ఇదమేవ మమానంత - జన్మ సంపాదితైనసః
ప్రాయశ్చిత్త మితి వ్యక్త - ముచ్చై రుచ్చారయన్ ద్విజః ॥

తా॥ ఇదియే నా యొక్క అనేక జన్మల నుండి సంపాదించుకొన్న పాపమునకు ప్రాయశ్చిత్తము అని బిగ్గరగా పల్కుచు నా బ్రాహ్మణుఁడు

శ్లో॥ అద్యప్రభృతి యోగ్యోఽహం - సర్వకర్మ స్వి తీరయన్
పాదసక్తమృదా తస్య - చక్రే స్వ స్యోర్ధ్వపుండ్రకమ్ ॥

తా॥ "ఇప్పటి నుండి నేను అన్ని కర్మలయందు సమర్థుడను" అనుచు గురువుగారి పాదములనున్న మట్టితో తనకు నిలువుబొట్టు పెట్టుకొనెను.

శ్లో॥ తతో విప్రో గురుం నత్వా - జప్తుం తేన ప్రబోధితః
కార్యసిద్ధిం సముద్దిశ్య - పుణ్యతీర్థ ముపాగమత్ ॥

తా॥ పిమ్మట ధ్వజదత్తుఁడు గురువుగారికి నమస్కరించి అతనిచే మంత్రమును జపింప ననుమతినందినవాఁడై కార్యసిద్ధి కొఱకై పుణ్యనదీ ప్రదేశమునకు చేరెను.

శ్లో॥ ఆచమ్య విధివత్తత్ర - ధ్యాత్వా గురుపదాంబుజమ్
సమభావనయా యుక్తో - గురుదైవతయోర్ద్వయోః
అష్టోత్తరశతం భూయో - జజాప ద్వాదశాక్షరీమ్ ॥

తా॥ అట యథావిధి నాచమానమొనర్చి గురువుగారి పాద పద్మములను ధ్యానమొనర్చి గురుదైవములందు సమభావన కలవాఁడై మరల నూట యెనిమిది పర్యాయములు శ్రీ హనుమద్ద్వాదశాక్షర మహా మంత్రమును జపించెను.

శ్లో॥ సిద్ధప్రాయే మహామంత్రే – జప్తమాత్రే మహాత్మనా
ఆయాసమంతరేణైవ – సిద్ధి స్తస్యాప్యజాయత ॥

తా॥ ధ్వజదత్తునకును ఆ మహామంత్రమును సంసిద్ధుఁడై జపించిన మాత్రమున ననాయసముగానే ఆ మంత్రమునకు సిద్ధికల్గెను.

శ్లో॥ తతో జపంత మవ్యగ్రం – పుష్కరచ్ఛాత ముత్తమమ్
సువర్చలాపతి శ్శ్రీమాన్ – కరుణవై విప్రవీక్షణమ్
అంగదాదీ న్మహాభక్తా – నవాదీ త్కపినాయకః

తా॥ పిమ్మట నిశ్చలముగా జపించుచున్న ఉత్తముఁడగు పుష్కర శిష్యుని, ధ్వజదత్తుని దయజూడ నిచ్ఛగించినవాఁడై సువర్చలాపతి యగు హనుమంతుఁడు మహాభక్తులగు అంగదుఁడు మున్నగువారితో నిట్లనెను.

శ్లో॥ సజ్జం భవంతః కుర్వన్తు – వాహనం గమనాయ మే
యత్రాఽఽస్తే పుష్కరచ్ఛాత్రో – ధ్వజదత్తో మహామతిః ॥

తా॥ పుష్కరుని శిష్యుఁడు, బుద్ధిమంతుఁడు నగు ధ్వజదత్తుని కడకు నా ప్రయాణమునకు మీరు వాహనమును సిద్ధము చేయుఁడు.

శ్లో॥ తపశ్చరన్ మహా ఘోరం – పుణ్యతీర్థ జలాంతరే
సిద్ధిం నావిందతాఽద్యాపి – సదేశో గమ్యతా మితి

తా॥ అతఁడు పుణ్యతీర్థముయొక్క ప్రాంతమున గొప్ప తపస్సు చేయుచు సిద్ధిని పొందక యున్నవాఁడు అచటకు వెళ్ళవలయును.

శ్లో॥ భర్తు రాజ్ఞావచ శ్రుత్వా–సర్వే ప్రీతి మవాప్నువన్
నవరత్నాంచి తాకార-సింహాసన సమన్వితమ్
ఉష్ట్రం హేమాద్రిసంకాశం–నిన్యుః పరిజనా జవాత్॥

తా॥ ప్రభు నాజ్ఞను విని యందఱు సంప్రీతులైరి. ఆ పరిజనులు వేగముగా నవరత్నఖచిత సింహాసనముతోకూడిన మేరుపర్వతముతో సమాన ముగ నున్న ఒంటె నాయత్తముచేసి తెచ్చిరి.

శ్లో॥ ఆనీతి మద్భుతాకార-ముష్ట్రం వాయుజవాన్వితమ్
నీలదత్త కరాలంబో-హనుమా నారురోహ తమ్॥

తా॥ తీసికొని రాబడిన అద్భుతమగు నాకారము కల్గి వాయువేగము కల్గియున్న ఒంటెను నీలుడు చేయూతగానుండగా హనుమంతు డధిరోహించెను.

శ్లో॥ మృగేంద్ర ఇవ శైలేంద్ర-మింద్ర ఐరావతం యథా
హరి ర్యథా గరుత్మంతం-వృషం వృషభ కేతనః॥

తా॥ పర్వత శ్రేష్ఠమును సింహమెక్కినట్లు ఐరావతము పైకి ఇంద్రుఁడెక్కి నట్లు గరుత్మంతుని విష్ణువు, నందీశ్వరుని పరమేశ్వరుఁడు నెక్కినట్లు

శ్లో॥ వాహనోత్తమ మారుహ్య-హనుమా న్మారుతాత్మజః
చిత్రావసుకృత స్తోత్ర సేనాంగద పురస్సరః
జగామ నిజవామాంక-దీప్యమాన సువర్చలః ॥

తా॥ వాయుసుతుఁడగు హనుమంతుఁడు ఆ గొప్ప వాహనము నెక్కి చిత్రవసు స్తోత్రపాఠములు జరుగుచుండ సేనయు నంగదుఁడును ముందుకలవాఁడై ఎడమభాగమున సువర్చలాదేవి ప్రకాశించుచుండగా వెడలెను.

శ్లో॥ అథ గురుపదపద్మ భక్తియోగాత్
కృత నిజమంత్ర పలేఫలోన్ముఖే చ
ద్విపర వరదాన సంభ్రమోఽగాత్
నిజపరివారముతో గతో హనుమాన్

తా॥ పిమ్మట గురుభక్తి కల్గియుండుటవల్ల, తన మంత్రమును జపించి ఫలసిద్ధికి నున్ముఖుఁడైయున్న బ్రాహ్మణుఁడగు ధ్వజదత్తునికి వరము నిచ్చు తొందరతో తన పరివారముతోకూడి హనుమంతుఁడు వెడలెను.

శ్లో॥ కరభ కలభ సం నిరీక్షణా చ్చ
జయ నినద శ్రవణాచ్చ మాగధానాం
హనుమ దభిఖ్య జయాంకిత ధ్వజా గ్రా
త్పరిబుబుధే నిజదైవతం ద్విజేంద్రః

తా॥ ఒంటెపిల్ల వాహనమును చూచుటవలనను, వందిమాగధులు జయ జయ ధ్వనులు వినుటవలనను, హనుమంతుని తెలియజేయు టెక్కెముపలనను, బ్రాహ్మణ శ్రేష్ఠుఁడగు ధ్వజదత్తుఁడావచ్చినది తన దైవమగు హనుమంతుఁడే యని తెలిసికొనెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీపరాశరమైత్రేయసంవాదే
శ్రీ సువర్చలా హ మద్ద్వాదశాక్షరీ మహాత్మ్యే

ద్వాదశః పటలః

—o—

త్రయోదశ పటలః

## హనుమదనుగ్రహం

శ్రీ మైత్రేయః

శ్లో॥ తతః కి మకరో ద్విప్రః – నిశ్చిత్యాశు స్వదైవతమ్
ఆఖ్యాహి త న్మహాభాగ ! – పరాశర ! కృపాంబుధే!

తా॥ మైత్రేయుఁడిట్లడుగఁజొచ్చెను. ఓ దయామయా ! పరాశర మహాముని ! బ్రాహ్మణుఁడగు ధ్వజదత్తుఁడు ప్రత్యక్షమైన వానిని తన హనుమంతునిగా వెంటనే గుర్తించివాఁడై ఏమిచేసెనో చెప్పవలసినది.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా – మహాయోగీ పరాశరః
తత్కథాశ్రవణే వ్యగ్రం – మైత్రేయ మిద మబ్రవీత్ ॥

తా॥ అన్న యా మైత్రేయుని మాటలు విన్న మహా యోగియగు పరాశరుఁడు ఆ ధ్వజదత్త గాథను విన నుత్సహించు మైత్రేయునితో నిట్లనెను.

శ్రీ పరాశరః

శ్లో॥ మైత్రేయ! త్వం కృతార్థోఽసి–యత స్తే ధార్మికీమతిః
హనూమద్భక్తి విషయే–నాలం బుద్ధిం తు విందతి॥

తా॥ ఓమైత్రేయా! నీవు ధన్యుఁడవైతివి. ఏలనన నీ ధార్మిక బుద్ధి హనుమద్భక్తి విషయమున చాలు అనుమాట లేకయున్నది కాన.

శ్లో॥ అనంతరం తు వృత్తాంతం–ధ్వజదత్తస్య ధీమతః
మైత్రేయ! తే ప్రవక్ష్యామి–సావధానమనా శ్రృణు!

తా॥ ధ్వజదత్తుని యనంతరవృత్తాంతమును చెప్పెదను ఓ మైత్రేయా! సావధానబుద్ధితో నుండి వినవలసినది.

శ్లో॥ తతః ప్రేక్ష్య హనూమంతం – వరదానార్థ మాగతమ్
ప్రత్యుత్థా నాభివాదాభ్యాం – పూజయామాస వైద్విజః
నిజదైవమువా చేదం – ప్రాంజలి ర్ద్విజస త్తమః ॥

తా॥ పిమ్మట వరమీయవచ్చిన హనుమంతుని చూచినవాఁడై ధ్వజదత్తుఁడు ఎదురేగుట, నమస్కరించుట మున్నగు వానిచే నర్చించి చేతులు జోడించి తన దైవమగు నాతనితో నిట్లనెను.

శ్లో॥ ఇద మర్ఘ్య మిదం పాద్యం – పూజార్థం కుసుమాన్యపి
ఫలా నిమాని గృహ్ణీష్వ – భక్తానుగ్రహతత్పర!

తా॥ భక్తుల ననుగ్రహించువాడా! ఇదిగో అర్ఘ్యము, ఇదే పాద్యము. ఇవి పూజకొఱకు పుష్పములు, ఇవి ఫలములు. వీనిని తీసుకొన వలసినది.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం-యస్తే భక్త్యా ప్రయచ్ఛతి॥
సిద్ధ్యంతి తస్య కార్యాణి-శ్రేయః పరంచ విందతి॥

తా॥ ఎవడైతే భక్తితో నీకు ఆకుగాని, పూవుగాని, ఫలము, నీరుకాని యిచ్చునో యాతని కోర్కెలు నెరవేరును. మోక్షముకూడ వందును.

శ్లో॥ త దత్ర గృహ్యతాం స్వామిన్! జల పుష్ప ఫలాదికమ్
భక్త్యా సమర్పితం తాత! మ దనుగ్రహకాంక్షయా॥

తా॥ కావున నో స్వామీ! నన్ననుగ్రహించి కోరికబూని నాచే సమర్పింపబడు నీ జలపుష్పఫలాదులను గ్రహింపుడు

శ్లో॥ ఇత్యేవం ప్రార్థితో భక్త్యా - హనూమా న్మారుతాత్మజః
విప్రోపహారం హస్తేన - స్పృష్టవాన్ సాదరం హసన్ ॥

తా॥ ఇట్లు భక్తితో ప్రార్థింపబడినవాడై వాయునందనుడగు హనుమంతుడు ఆదరముతో చిరునవ్వునవ్వుచు ధ్వజదత్తుడిచ్చిన కాన్కలను చేతితో తాకెను.

శ్లో॥ ద్విజ స్సంతుష్టచిత్తస్సన్ - ఉపహార పరిగ్రహాత్
యథామతి యథాన్యాయం - తుష్టావ ప్రయతాంజలిః

తా॥ తాసిడిన కాన్కలను గ్రహించుటవలన ధ్వజదత్తుడు సంతోషించి, దోయిలొగ్గినవాడైతనకు తోచినరీతిగా యథావిధిగాస్తుతించెను.

శ్లో॥ వేదవేద్య ! మహాభాగ ! - పురాణ పురుషోత్తమ !
తవ సందర్శనేనైవ - దురితం మే నివర్తితమ్ ॥

తా॥ వేదముల వలన తెలియదగినవాడా! మహానుభావా! పురాణ పురుషోత్తమా ! నిన్ను చూచుట మాత్రమునునే నా పాపమంతయు తొలగినది.

శ్లో॥ తవ సందర్శనా దేవ - యోగినా మపి దుర్లభమ్
బహుజన్మార్జితా త్పుణ్యాత్ - లబ్ధవా నస్మి సాంప్రతమ్ ॥

తా॥ నీ దర్శనమువలననే అనేక జన్మల పుణ్యఫలముగా యోగులకు కూడ లభింపని యోగ్యత నందితిని.

శ్లో॥ బ్రహ్మాదయ స్సురా స్సర్వే - కాంక్షంతే యస్యదర్శనమ్
నిజహస్తాంబుజై ర్నిత్యం - పూజయంతి పదద్వయమ్ ॥

తా॥ బ్రహ్మాది దేవతలందఱు ఎవని దర్శనము కోరవారై తమ చేతులను పద్మములతో నీ పాదములను ప్రతిదినము పూజింతురో.

శ్లో॥ గుర్వనుగ్రహ మాహాత్మ్యాత్ - సత్యం సాక్షాత్కృతో మయా
త దస్య దుర్లభం ప్రాప్తం - మద్భాగ్యం కేన గణ్యతే?

తా॥ అట్టి నీవు గురువుగారి యొక్క అనుగ్రహ ప్రభావము వలన నాకు సాక్షాత్కరించితివి. కాన నాకు దుర్లభమైన నీ దర్శనము లభించినది. ఇక నాభాగ్యము నెవడు లెక్కించగలఁడు ?

శ్లో॥ సర్వ వేదశిరోభి స్త్వం - భగవాన్ భూతభావనః
స్తో తుం న శక్యసే దేవ! కియాన్ స్తోతు మహం ప్రభో ॥

తా॥ దేవా! సమస్త ప్రాణికోటియందును భావింపదగు నీవు వేదవేదాంగములతోనే స్తుతింప శక్యముగాకున్నావు. ఓ మహానుభావా! అట్టి నిన్ను స్తుతింప నేనెంతటివాడను ?

శ్లో॥ యస్య స్వరూప మజ్ఞాత్వా - త త్త్వత స్సచరాచరమ్
జగ ద్భ్రమతి సంసార - చక్రే నక్రాయతే నృణామ్ ॥

తా॥ ఎవని స్వరూపము నెఱుఁగలేక చరాచరజగత్తంతయు సంసారమను చక్రమున అడ్డకమ్మీవలె తిరుగుచున్నదో

శ్లో॥ కి మన్య దధికం మన్యే - త్వ త్పాదాంబుజ సేవనాత్
అత స్తదేవ మే భూయా - జ్జన్మజన్మాంతరే ష్వపి ॥

తా॥ అట్టి నీ పాదపద్మములు సేవించుటకన్న నెక్కుడుగ దేనిని తలచెదను ? అందుచే జన్మజన్మాంతరములందును అట్టిది నాకు కల్గుగాక !

శ్లో॥ అపవర్గ నిదానం య-ద్దర్శనం భవతః పుమాన్
వినియుంక్తే భవే నీచే-స నీచః పరమో మతః॥

తా॥ మోక్షమందుటకు కారణమగు నీ దర్శనము నేమనుజుఁడు నీచమగు సంసారప్రయోజనమునకై వినియోగించునో అతఁడు మిక్కిలి నీచుఁడని నా యభిప్రాయము.

శ్లో॥ త్వన్నామ స్మరణే నైవ-మహాపాతకరాశయః
నశ్యంతి తక్షణా దేవ-తూలభార ఇవాగ్నినా॥

తా॥ నిన్ను స్మరించుటచేతనే మహాపాతక రాశియంతయు వెంటనే అగ్నిచే దూది మొత్తమువలె నశించును.

శ్లో॥ ప్రసీద జగతాంనాథ! దీనబంధో! దయానిధే!
శిశుభావా త్కృతం యద్య-త్త దాగః క్షంతు మర్హసి॥

తా॥ ఓ జగదాధారా! దీనులపాటిబంధువా! దయకు నిలయమైన వాఁడా అనుగ్రహింపుము. నాచే నేయే పాపము లొనర్చబడినవో వాటి నన్నిటిని నన్ను బిడ్డగ నెంచి క్షమింప వలసినది!

శ్లో॥ త్వా మామనంతి శ్రుతయో-జగతా మాదికారణమ్
త్వా మేవ సృష్టికర్తారం పురుషం ప్రకృతేః వరమ్॥

తా॥ వేదములు నిన్నే జగత్తున కాది కారణముగా నెంచుచున్నవి. నిన్నే సృష్టికర్తనుగా, ప్రకృతికంటె పరమగు పురుషునిగా నెంచుచున్నవి.

శ్లో॥ ఆనందాంబుధి మగ్నోఽహం-విస్మృతాన్య ప్రయోజనః
కిం కార్యం కరవా ణ్యద్య-హనుమ న్మృచ్యతాం ప్రభో!

తా॥ నేను ఆనందమను సముద్రమున మునిగి యుంటిని. ఇతరములగు ప్రయోజములను వీడితిని. నేనేకార్యము చేయవలయును? ఓ హనుమత్ప్రభూ! నన్ను నియోగించుఁడు.

శ్లో॥ అద్య మే పితర స్సర్వే-పరాంగతి మవాప్నువన్
వ్రతాని ఫలితా న్యద్య-ఫలితా బ్రాహ్మణాశిషః॥

తా॥ నేడు నా పితృదేవతలందఱు నుత్తమగతి నందిరి. నా వ్రతము లన్నియు ఫలించినవి. బ్రాహ్మణాశీస్సులన్నియు ఫలించినవి.

శ్లో॥ ఫలితాశ్చ తపశ్చర్యా-బహుజన్మార్జితా అపి
గంగాది సర్వతీర్థాని-ఫలితాన్యద్య మే ప్రభో!

తా॥ బహుజన్మలనుండి యొనర్చిన తపశ్చర్యలన్నియు ఫలించినవి. ఓ మహానుభావా! గంగ మున్నగు తీర్థములందు స్నానమాడిన ఫలమంతయు నేడే ప్రయోజన వంతమైనది

శ్లో॥ అద్య మే సఫలం జన్మ-విజీతం చ సుజీవితమ్
గతా న్యహాని సర్వాణి-దుర్దినానీతి మే మతిః
య స్త్వం సాక్షాత్కృతో దేవో-బ్రహ్మా ద్యై రపి దుర్లభః॥

తా॥ నేడు నా జన్మ సఫలమైనది. జీవితముకూడ యోగ్యమగు జీవితమైనది. కడచినవన్నియు చెడుదినములని యెంతును. బ్రహ్మాదులకే దుర్లభుఁడవగు నీవు సాక్షాత్కరించితివి.

శ్లో॥ ప్రమాదా దథవా లోభా-త్ప్రేయసీ దైన్య దర్శనాత్
శైశవాద్వా మయా పూర్వం-కాంక్షితా స్సర్వసంపదః॥

తా॥ పొరపాటునకాని, లేక లోభగుణముచేకాని, యటుకాక భార్య యొక్క దీనస్థితి చూచుటవలన కాని చిన్నదనముచే కాని పూర్వము నాచే సమస్తసంపదలు కాంక్షింపబడినవి!

శ్లో॥ అధునా తు న తాః కాంక్షే-దుఃఖభూతా హి సంపదః

తా॥ ఇప్పుడు మాత్రము వానిని కోరను. సంపదలు సుఖమును కల్గించునవే కదా!

శ్లో॥ దేవ! త్వాం ప్రణిపత్య నమ్రశిరసా యాచే వరం సాంప్రతమ్
భావస్తే పదపంకజే భవతు మే భక్తిః పరా శాశ్వతీ
త్వద్భావ స్తవ భక్తజాలవిషయే భూయా త్తదేవాశ్రయే
స్వాంతేకాంక్షిత మేత దేవ హనుమన్నత్వాం పరం ప్రార్థయే

తా॥ దేవా! శిరసువంచి నమస్కరించి నిన్నిప్పుడు వరము కోరు చున్నాను. శాశ్వతమగు నుత్తమ భక్తిభావము నీ పద పద్మములయందు చేర్పడుగాక. అట్టి యాశ్రయమునందే నీ మనసుకూడ భక్తుల విషయమున నుండునుగాక. హనుమత్ప్రభూ! నామనసునందలి కోరిక ఇదియే. ఇంత కంటె భిన్నమగుదానిని నిన్నుకోరను,

శ్లో॥ ఇత్యేవం ధ్వజదత్తేన-ప్రార్థితో భక్తవత్సలః
సువర్చలా ముఖం ప్రేక్ష్య-జహాస పవనాత్మజః

తా॥ ఇట్లు ధ్వజదత్తునిచే ప్రార్థింపబడినవాడై భక్తులయందు వాత్సల్యముకల వాయుసుతుఁడగు హనుమంతుఁడు సువర్చలాదేవి ముఖము చూచి నవ్వెను.

శ్లో॥ సువర్చలే! పశ్య నితాంతవల్లభే:
గురుప్రసాదా న్మతిమాం శ్చ తాపసః
మద్భక్త భక్తిం నిరపాయనిర్మలాం
పృథ గ్జనై ర్దుల్లభ నామధేయాం॥

తా॥ ప్రియురాలా! సువర్చలా! గురుననుగ్రహముచే బుద్ధిమంతుఁ డైన యీ నాభక్తుఁడగు ధ్వజదత్తుని యోగ్యమగు స్వచ్ఛమగు, ఇతరులకు లభింపని భక్తిని చూడుము.

శ్లో॥ అహం తు సర్వలోకస్య-పూజ్యో భాస్కరనందిని!
మమ భక్తో మమ పూజ్య స్స్యా-దయం పూజ్యతరః ప్రియే॥

తా॥ ఓ సూర్యసుతా! నేను సమస్తలోకమునకు పూజనీయుఁడను. నా భక్తుఁడు నాకు పూజనీయుఁడు. ఈతండైనచో ఓ ప్రియురాలా! పూజ నీయులలో శ్రేష్ఠుఁడు.

శ్లో॥ సద్వంశో నిరహంకారో-జితామర్షో జితస్పృహః
బహుశ్రుతో మహాయోగీ-తస్మా త్పూజ్యతరో మమ॥

తా॥ మంచి వంశమున పుట్టినవాఁడు, అహంకారము లేనివాఁడు, కోపమును కోర్కెలను జయించినవాఁడు, మహాయోగి కావుననే ఈతఁడు నాకు మిక్కిలి పూజనీయుఁడు.

శ్లో॥ జితేంద్రియో జితస్వాపో-జితద్వంద్వో జితశ్రమః
అధ్యాత్మ విద్యానిరతః-సర్వభూత దయాపరః॥

తా॥ ఇంద్రియములను జయించినవాఁడు, నిద్రను లోబరచుకొనిన వాఁడు, ద్వైధీభావము లేనివాడు, శ్రమను లోబరచుకొనినవాడు, ఆత్మ పరమాత్మల విషయమగు ఆధ్యాత్మిక విద్యయందు నిపుణుఁడు సమస్త ప్రాణులందు దయగలవాఁడు.

శ్లో ॥ ఆత్మ ప్రశంసా విముఖః-సుముఖో మత్కథాశ్రుతౌ
పరనిందా విహీనశ్చ-పంచయజ్ఞ పర స్సదా
ధ్వజదత్తో ద్విజశ్రేష్ఠః-తస్మా త్పూజ్యతరో మమ॥

తా॥ తనను పొగడుకొనుటయం దిష్టములేనివాఁడు, నా కథను పొగడ్తను వినుటయందు మాత్ర మిష్టుఁడు. ఇతరులను నిందించఁడు. బ్రహ్మయజ్ఞము మున్నగు నైదు యజ్ఞము లందెల్లప్పుడు నిష్ఠకలవాఁడు బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు నీ ధ్వజదత్తుఁ డందుచే నాకు మిక్కిలి పూజనీయుఁడు.

శ్లో॥ దుశ్చరం హి తప స్తప్త-మనే న శ్రాంత వర్ష్మణా
తస్య శ్రమాపనోదాయ-త్వయా సహ సమభ్యగామ్॥

తా॥ శాంతస్వరూపుఁడగు నీతనిచే కష్టసాధ్యమగు తపస్సు చేయబడినది. సువర్చలా! ఆతని యా శ్రమను పోగొట్టుటకై నీతోఁగూడి యిచ్చుటకు వచ్చితిని.

శ్లో॥ ప్రచలే దపి మేరు ర్వా-నేదీయాన్ భాస్కరోఽపి వా
మద్భక్తస్య పరిశ్రాంతిం-న ద్రక్ష్యేఽహం కదాచన॥

తా॥ మేరుపర్వతమే చలించినను, సూర్యుఁడే దిగివచ్చినను నా భక్తుని యాయాసము నెన్నఁడును చూచుచు నూరకుండను.

శ్లో॥ మ మావజ్ఞాం చదుస్సోఢాం వియోగిం వా సహే తవ
మద్భక్తవిషయే దైన్యం-కదాచి దపి నోత్సహే॥

తా॥ సహింపరాని నా నిందను సహింతును. చివఱకు ఓ ప్రియురాలా! నీ వియోగమునైన సహింతును కాని నా దైన్యస్థితిని మాత్ర మెన్నఁడు చూచి సహించి యుండలేను.

శ్లో॥ సత్యం బ్రవీమి సుశ్రోణి శ్రుణు ష్వావహిత్య మానసా
మద్భక్త స్యావమానం తు-హృది శల్యాయతే మమ॥

తా॥ ఓ సువర్చలా నేను నిజము చెప్పుచున్నాను మనసుంచివినుము నా భక్తుని యెడ నేర్పడిన యవమానము నా హృదయమున గాయము వంటిదై బాధించును

శ్లో॥ ఇత్యుక్తవంతం నిజనర్మవల్లభమ్
సువర్చలా ప్రాహ శుచిస్మితా సతీ
జిజ్ఞాసమానా ధ్వజ దత్తవైభవమ్
పికస్వరా భాస్వర హేమభూషణా

తా॥ ఇట్లను తన ప్రియుని కోకిలవలె మధురస్వరము కల్గినట్టిదియు బంగారు నగలను దరించినట్టిదియు, ధ్వజదత్తుని వైభవమును తెలుసుకొనగోరునట్టిదియు నగు సువర్చల చిరునగవుతో నిట్లనెను.

శ్లో॥ కథంను తప్తం కథయస్వ తేన త
త్పరిశ్రమో భక్త జనేన దుర్లభః
అయుం తు తే భక్త ఇతీరితం పురా
వియద్ధ్యతే పూర్వ మిదం పరం ప్రభో!

తా॥ మహానుభావా! ధ్వజదత్తునిచే నెట్లు తపస్సు చేయబడినదో చెప్పవలసినది. మీ భక్తులగువారు శ్రమను పొందరుకదా! వెనుకటే ఈతఁడు

తమ భక్తుఁడుగాఁ జెప్పబడినవాఁడు. కాన భక్తునకు శ్రమించి తపించుటయన దుండరాదుకదా! ఆ రీతిగా మీరు చెప్పిన పూర్వ విషయముతో తదనంతరము చెప్పిన విషయము విరోధించుచున్నది కదా!

శ్లో॥ ఇతీవ సందేహపరం ప్రియావచో
నిశమ్య భర్తా ధ్వజదత్తసన్నిధౌ
ప్రచక్రమే వక్తు మసంశయం వచ
స్సుధారస స్యంది పదేపదే పునః ॥

తా॥ ఇట్లను సందేహముతో కూడిన ప్రియురాలి మాటలు విన్న హనుమంతునిచే ధ్వజదత్తుని సమీపముననే మాట మాటయందు అమృతము చిందునట్లుగా సందేహములేని సమాధానము చెప్ప మొదలు పెట్టబడినది.

శ్లో॥ ధ్వజదత్తస్య వృత్తాంతం-వదేయం తవ సువ్రతే
యస్య శ్రవణమాత్రేణ నశ్యే త్సందేహ ఈదృశః ॥

తా॥ ఓ మంచిదానా! నీ ఈ సందేహము తీరునట్లుగా ధ్వజదత్తు వృత్తాంతము చెప్పెదను.

శ్లో॥ అయం ప్రియే! పూర్వభవేఽయ ముత్తమమ్
జపన్ హి మంత్రం మమ స ప్తవర్ణకమ్
ఫలస్పృహాలబ్ధ విలంబ మత్సరః
తత్యాజి నిందాం గురు మాచర స్సురః

తా॥ ఓ ప్రియురాలా! పూర్వజన్మయందీతఁడు నా యొక్క సప్త వర్ణమహామంత్రమును జపించుచు ఫలసిద్ధియొక్క ఆలస్యముచే కోపము నందినవాఁడై గురువును నిందించుచు మంత్రమును వీడెను.

శ్లో॥ పురాఽయం పురుషశ్రేష్ఠో - ధర్మసారో మహానభూత్
శ్రుతి స్మృతి పురాణజ్ఞ - స్సర్వ యోగాంగవిత్తమః

తా॥ పూర్వమీతఁడు జనులలో శ్రేష్ఠుఁడై ధర్మసారుఁ డను పేరు గల్గి, వేద, ధర్మశాస్త్ర పురాణాదులన్నియు తెలిసినవాఁడై సమస్తములగు యోగవిభాగములు తెలిసినవాఁడై యుండెను

శ్లో॥ నిత్యకర్మపరో నిత్యం-సదాచారేషు తత్పరః
స కదాచి ద్ద్విజశ్రేష్ఠ-శ్శిష్యసంఘై రనుద్రుతః
సమి త్పుష్ప ముపాహర్తుం-ప్రవిష్ట ఉపగహ్వరమ్ ॥

తా॥ అతఁడు ప్రతినిత్యము నిత్యకర్మల నొనర్చుచు మంచి నులయందే నిష్ఠకల్గియుండువాఁడు. ఆ బ్రాహ్మణశ్రేష్ఠుఁ డొకప్పుడు శిష్య మూహము వెంటరాగా సమిధలు, పూలు దీసికొనివచ్చుటకు అడవిలోనికి ప్రవేశించెను.

శ్లో॥ తత్రాపశ్య ద్ధర్మసారః-భరతం క్షత్రియోత్తమమ్
హనుమద్భక్త మతర్ధ్య-తృణీకృత జగత్త్రయమ్
వ్యగ్రం జపంత మత్యుచ్చై - ర్హనుమ త్సప్తవర్ణకమ్ ॥

తా॥ అట ధర్మసారుఁడు భరతుఁడను రాజశ్రేష్ఠుని హనుమద్భ క్తుఁడు, లోకత్రయమును గడ్డిపరకతో సమానముగా నెంచువానిని హను మత్సంబంధమగు సప్తాక్షర మహామంత్రమును బిగ్గరగా తొందరగా జపించువానిని చూచెను.

శ్లో॥ గురుదైవత మంత్రేషు - సమ విశ్వాస సంభవాత్
స్థిరీకృత్య నిజస్వాంతం - ధ్యాయంతం నిజదైవతమ్ ॥

తా॥ అతఁడు గురువు యెడ, మంత్రదైవతముయెడ, మంత్రము యెడ సరియగు సమ్మకము కలవాఁడగుటచే మనస్సును అచంచలముగా నుంచి తన దైవతమును ధ్యానము చేయుచుండెను.

శ్లో॥ తం తు దృష్ట్వా మహాత్మానం - సర్వే విస్మయ మాగతాః
త త్సమీపం శనైర్గత్వా - ధర్మసార స్త మబ్రవీత్ ॥

తా॥ ఆ మహాత్ముని చూచి యందఱు నాశ్చర్యము నందఁజొచ్చిరి. ధర్మసారుఁడు నెమ్మదిగా వాని కడకేగి ఇట్లనెను.

శ్లో॥ జప్యతే కి మిదం మంత్ర - మనేనవిధినా మునే!
మంత్రం తుపాంశు జప్తవ్య - మితి యోగవిదో విదుః

తా॥ ఓ మునీ! ఈ విధముగా జపించుచున్నావు ఏ మంత్రమును? మంత్రమును రహస్యముగా జపించవలెనని యోగజ్ఞులు చెప్పుదురు.

శ్లో॥ త్వ మేవం భైరవస్వానై - ర్మంత్రోచ్చారణ సంభవైః
ప్రోత్సారయన్ మహాసత్త్వాన్ - కి మిదం జపసే స్వయమ్ ॥

తా॥ నీవు భయంకరధ్వనిచే మంత్రము నుచ్చరించువాఁడవై జంతుకోటి కూడా భయపడి పాఱిపోవునట్లు జపించుచున్నావేమిటి?

శ్లో॥ న శ్రుతోఽపి న వా దృష్ట - ఈ దృశో జప సంభ్రమః
ముద్రాం వా మాతృకాం న్యాస - మంగన్యాసం పునః పునః ॥

తా॥ ఇటువంటి జపసంభ్రమము ఎచ్చట వినలేదు. కనలేదు. ముద్రలు, మంత్రము, అంగన్యాసకరన్యాసములు లేనిది చూడబడలేదు.

శ్లో॥ న్యాసహీనజపా న్మంత్రః - నిష్ఫలః పరికీర్తితః
కే నాయ ముపదిష్టస్తే - మంత్రాభాసోంగ వర్జితః ॥

తా॥ అంగన్యాసకరన్యాసములు లేని జపముచే మంత్రము నిష్ఫలమగునని చెప్పబడినది? ఇట్టి మంత్రాంగములు లేక మంత్రము కానున్నను మంత్రమువలె కన్పడునట్టిది. మీకెవరిచే నుపదేశింపబడినది.

శ్లో॥ ద్విపాత్పశు ర్న సందేహః - సర్వకర్మ బహిష్కృతః
త్వం చాఽపి తాదృశో మూఢో - యోగ్యోఽయోగ్యో న
బుధ్యసే ॥

తా॥ ఆ నీకు చెప్పినవాఁడు కర్మశూన్యుఁడు. కేవలము రెండే కాళ్ళు కల్గిన పశువు అగుటలో సందేహము లేదు. మంచి చెడుగులు తెలియని నీవు కూడా నటువంటి మూర్ఖుఁడవే.

శ్లో॥ ఆచార్యో వేద సంపన్నో - విశుద్ధాత్మా జితేంద్రియః
విమత్సరః కృతజ్ఞశ్చ - మంత్రాంగ న్యాస కోవిదః ॥

తా॥ గురువన తానాచరించి ఆచరింపజేయువాఁడు, వేదములెఱిగినవాఁడు, పరిశుద్ధాత్ముఁడు, ఇంద్రియ నిగ్రహము కలవాఁడు, మత్సరము లేనివాఁడు, చేసిన మేలు గుర్తుంచుకొనువాఁడు, మంత్రము అంగన్యాసాదికము తెలిసినవాఁడు.

శ్లో॥ అధ్యాత్మ విద్యా నిరతో - నిర్మాయో నిరహంకృతిః
జితక్రోధో జితస్వాపో - మంత్రధ్యాన పరాయణః ॥

తా॥ ఆధ్యాత్మ విద్యయందు దిట్ట, కపటంలేనివాఁడు, గర్వము లేనివాఁడు, కోపములేనివాఁడు, నిద్రను జయించినవాడు మంత్ర ధ్యానము నందే నిమగ్నుఁడై యుండువాడున్ను.

శ్లో॥ యస్తు నైవం విధఃకశ్చిత్ - పశు రేవ న సంశయః॥

తా॥ ఏ గురువు ఈ గుణములతో నుండడో వాఁడు నిస్సందేహముగ పశువే.

శ్లో॥ అథవా మునివేషేణ-భవతా పురుషర్షభ!
మనో వినోద లాభాయ-జపాభాసః యదీప్సితః
తథాశ్రమాతిరేకస్తే-నిరాహారకృతో వృథా

తా॥ లేకున్న ఓ పురుషశ్రేష్ఠుఁడా! మనోవినోదముకొఱకు ముని వేషము ధరించి నీచే నీ మంత్ర మారంభింపబడెనా! అట్లయినచో నీశ్రమయు నిరాహార విధానముకూడ వ్యర్థము.

శ్లో॥ అతిమాత్ర కృశత్వేన-నిరాహారోఽనుమీయసే
ఇహ చాముత్ర చాశ్రేయో-మూఢో వా నేచ్ఛతి స్వయమ్

తా॥ మిక్కిలి కృశించుటద్వారా నిరాహారదీక్షనున్నట్లు తెలియు చున్నది. ఇహమునకు పరమునకు రెంటికి తగని విధానమును మూఢుఁడు కూడ స్వయముగా స్వీకరింపఁడు.

శ్లో॥ ప్రయోజన మనుద్దిశ్య-న మందోఽపి ప్రవర్తతే॥

తా॥ ప్రయోజనమును చూచుకొనక మూర్ఖుఁడుకూడా నేపనియందు దిగడు.

శ్లో॥ ఇతి భిన్నోఽపి వాగ్వజ్రైః-క్షత్రియో ద్విజజన్మనః
న చ కంపే విశాలాక్షి! ధారాహత ఇ వాచలః
తథైవోచ్చై ర్జపన్నాస్తే-గురుదైవత భావనః॥

తా॥ ఓ విశాలమగు కన్నులు కలదానా! ఇట్లు బ్రాహ్మణుని వాక్కులను వజ్రాయుధములచే కొట్టబడినను ఆ క్షత్రియుఁడగు భరతుఁడు వర్ష ధారలకు పర్వతము చలించనట్లు చలించలేదు వెనుకటివలెనే గురుభావనము దైవభావనము చేయుచు బిగ్గరగా జపించుచు నుండెను.

శ్లో॥ ఇతి హుంకృత్య రాజేంద్రం-స్వయమానముఖో ద్విజః
ఫలపుష్పాది లోభేన-చచార వనమండలే

తా॥ ఇట్లు భరతుని హుంకరించి మార్పులేమి కచ్చేరు వందిన ధర్మసారుఁడు ఫలపుష్పాదికముసకై వసమున తిరుగాడెను.

శ్లో॥ అథాంతరే మహాప్రాజ్ఞం మృకండుం మహితప్రభమ్
సప్తకోటి మహామంత్రాస్య భేష్టం దాయకం నృణామ్॥
దదర్శ సపరీవారం-బ్రహ్మాణం కాశ్యపం యథా

తా॥ ఇంతలో గొప్ప ప్రజ్ఞకల, ప్రశస్తమగు కాంతికల! నరులకు వారి కోర్కెల ననుసరించి ఏడుకోట్ల మహామంత్రముల నేవైన నుపదేశించు నట్టి! మృకండుని పరివారముతో కూడినవానిని కశ్యప మహామునిని చూచి నట్లు చూచెచు.

శ్లో॥ తతః ప్రణమ్య విధివత్-ధర్మసారో మునీశ్వరమ్
జగాద పరమ ప్రీతః-కంచి న్మంత్రం దిశేతి సః॥

తా॥ పిమ్మట ఆ మునీశ్వరునకు యథావిధి ధర్మసారుఁడు నమస్కరించి సంతోషముతో నాకొక మంత్రము నుపదేశింపుఁడు అనెను.

శ్లో॥ మృకండు రపి ధర్మాత్మా- ప్రార్థయంతం మహామనుమ్
అనుజగ్రాహ విప్రేంద్రం-కృపయా దీనవత్సలః॥

తా॥ మృకండుడు, దీనులయందు వాత్సల్యము కలవాఁడు సగుట వలన దయతో తనను ప్రార్థించు నా బ్రాహ్మణోత్తమునకు మహామంత్రము ననుగ్రహించెను.

శ్లో॥ దిదేశ ధర్మసారస్య-మంత్రం సప్తాక్షరం మనుం
యథా ధ్యానం యథా న్యాసం-ప్రయోగ ముపసంహృతిమ్
దిష్టవాన్ సరహస్యం చ-ధర్మసారాయవై మునిః ॥

తా॥ నాయొక్క సప్తాక్షరీమహామంత్రమును ధర్మసారున కుప దేశించెను. ధ్యానమెటులనో, న్యాసాధిక మెటులో ప్రయోగము, ఉపసంహార విధానము మున్నగుమంత్రరహస్యమును ఆముని ధర్మసారున కొసంగెను.

శ్లో॥ గురూపదిష్ట విధినా-ధర్మసారో మనుం జపన్
మంత్రసిద్ధిం తు నోవేత్తి స్వయం పండితవా నని -

తా॥ గురువు ఉపదేశించిన విధముగానే ధర్మసారుడు మంత్రమును జపించుచు తాను స్వయముగా పండితుఁడు, అన్ని తెలిసిన వాడయ్యును మంత్రసిద్ధిని పొందలేకపోయెను.

శ్లో॥ క్షత్రియ స్యావమానేన-తద్గురో ర్నిందయా పునః
న ప్రసన్నో మహామంత్ర-స్తతో దుఃఖ మవాపసః ॥

తా॥ క్షత్రియుని అవమానించుటవలన, ఆతని గురువును నిందించుటవలనను ఆతనికి మంత్రము సిద్ధింపలేదు. అందుచే నాతఁడు దుఃఖము నందెను.

శ్లో॥ తతో నిర్విణ్ణ చేతస్క-స్త్యక్తవాన్ మంత్ర ముత్తమమ్ ॥

తా॥ అటుపిమ్మట దుఃఖముతోకూడిన మనస్సుకలవాఁడై ఉత్తమ మగు నా మంత్రమును వీడెను.

శ్లో॥ క్షత్రియస్య చ ధిక్కారాత్-మద్భక్తస్య మహాత్మనః
మంత్రసార విహీనోఽభూత్-ధర్మసార స్తథా ప్రియే!

తా॥ ఓ ప్రియురాలా! మహాత్ముఁడు, నాభక్తుఁడు నగు భరతుని ధిక్కరించుటవలన నటుల ధర్మసారుఁడు మంత్ర హీనుఁడయ్యెను.

శ్లో॥ ఉచ్చై రుపాంశు వా మంత్రం–జపన్ భక్త్యా న సీదతి
స్వాచారో వా దురాచార-స్సద్వంశో వాఽపి దుష్కులంః
స్త్రీ వా పుమాన్ వా యః కశ్చి స్మమేభక్తః ప్రణశ్యతి ॥

తా॥ బిగ్గరగా జపించినను, నెమ్మదిగా జపించినను భక్తితో జపించినచో వ్యర్థుఁడుకాఁడు. మంచియాచారము కలవాడు కాని చెడుయాచారము కలవాఁడుకాని మంచి కులమునఁబుట్టినవాఁడైన, చెడుకులమున బుట్టిన వాడైనను, స్త్రీ అయినా. పురుషుఁ డయినను ఎటువంటి వాఁడయినను నాభక్తుఁడు నాశము పొందఁడు.

శ్లో॥ మంత్రత్యాగా త్తథా విప్రో-గుర్వజ్ఞాన కారణాత్
త దవిశ్వాసవశగో-మగ్నో దారి ద్ర్యవారిధౌ ॥

తా॥ ధర్మసారుఁడట్లు మంత్రమును వీడుటవలన గురువు నవమానించుటవలన, ఆ యవిశ్వాసమున దారిద్ర్యమను సముద్రమున మునిగెను

శ్లో॥ త త్సంస్కారవశా దేవ-భవేఽస్మిన్ సూర్యనందిని!
గుర్వనుగ్రహ హీన స్సన్-సిద్ధిం నావిందత ద్విజః

తా॥ ఓ సూర్యసుతా! సువర్చలా! ఆపూర్వజన్మసంస్కారవశముననే ఈ జన్మయందును ఈ బ్రాహ్మణుఁడు గురునను గ్రహము లేనివాఁడై సిద్ధినందలేదు.

శ్లో॥ తతః ప్రసాద యాంచక్రే – స్వ గురుం సిద్ధి కారణాత్
నివృత్త వాసనో విప్రో – గురు పాదాంబు సేవనాత్ ॥

తా॥ పిమ్మట ఫలసిద్ధి కారణముగా తన గురువు నను గ్రహింపఁ జేసికొనెను. అంత గురువుగారి పాదజలము సేవించుట వలన పూర్వజన్మ కృత పాపమును కూడ పోగొట్టుకొనెను.

శ్లో॥ యదభవా త్సు విప్రస్య- పరిశ్రాంతి రభూ త్పురా
తత్ప్రసాదా న్మహామంత్ర – స్సిద్ధ్యతిస్మ సువర్చలే ॥

తా॥ ఓ సువర్చలా ! ఏగురు నను గ్రహము లేకపోవుటచే నా బ్రాహ్మణునకు ఫలసిద్ధిలేని శ్రమకల్గెనో ఇప్పుడా గురునను గ్రహము వలన మంత్రము సిద్ధించుచున్నది.

శ్లో॥ ధ్వజదత్తః కృతార్థోఽద్య – విహాయ ఫలకామనామ్
మహామంత్ర ప్రసాదేన – సంసారం తర్తుమిచ్ఛతి ॥

తా॥ ధ్వజదత్తుఁడిప్పుడు నిజముగా ధన్యుఁడు. ఎందువలన తుచ్ఛ మగు కోర్కెలయందు నిష్టము మాని మహామంత్రము యొక్క అనుగ్రహము వలన సంసారము నుండి ముక్తుఁడగుటను కోరుచున్నాఁడు.

శ్లో॥ ఏతత్తే కథితం దేవి ! ద్విజస్య చరితం మహత్
యస్య శ్రవణమాత్రేణ – భక్తిస్స్యా దనపాయినీ ॥

తా॥ దేవీ ! వినుట వలననే గొప్పదగు భక్తి తాత్పర్యము లభించునట్టి ఈ ధ్వజదత్తుని మహత్తర చరిత్ర నీకు చెప్పఁబడినది.

శ్లో॥ ద్విజస్య చరితం శ్రుత్వా – భర్త్రా సమ్యగ్వ్యవస్థితమ్
భూయోఽపి శ్రోతుకా మేవ – ప్రియా వచన మబ్రవీత్ ॥

తా॥ తనభర్తచే చక్కగా వివరించబడిన ధ్వజదత్తుని చరిత్ర మును విని ఇంకను వినదలుచుదానివలె సువర్చలాదేవి ఇట్లుపల్కెను.

శ్లో॥ కి మీప్సితం ద్విజ స్యాస్య – కి మద్దిశ్య జప త్యసౌ
త్వయా కిం దాతు ముద్యుక్తం – త త్సర్వం వద మే ప్రభో ॥

తా॥ ఓ మహానుభావా! ఈ బ్రాహ్మణునకుగల కోరికయేమి? దేనినుద్దేశించి ఈతఁడు తపస్సుచేయుచున్నాఁడు? మీరితని కేమీయసిద్ధముగా నున్నారు? ఆవిషయమంతయు నాకు చెప్పవలసినది.

శ్లో॥ ఏవం సంప్రార్థితో దేవ స్స్వభార్యా మబ్రవీ ద్వచః ॥

తా॥ ఇట్లామెచే ప్రార్థింప బడినవాఁడై దేవుఁడగు హనుమంతుఁడు తనభార్యతో నిట్లనెను.

శ్లో॥ విప్రోఽయం పూర్వసంస్కారా-ద్దరిద్రత్వ ముపాగతః
ఉపాదద త్సదా విప్రో-బహుకాలం నినాయ హ ॥

తా॥ ఈ బ్రాహ్మణుఁడు పూర్వజన్మ కృతపాపముచే దారిద్ర్యము నందినవాఁడై ఉపాదానమెత్తుచు చాలాకాలము గడపెను.

శ్లో॥ కదాచి త్సకళత్రస్య - దైన్య దర్శన విహ్వలః
ధన మహర్తుకామస్సన్ - నైమిశారణ్య మాగతః ॥

తా॥ ఒకప్పుడు ఆతఁడు తన భార్యయొక్క దీనమగు దర్శనమునకు కలతపడినవాఁడై ధనము గడించు కోరికతో నుండి నైమిశారణ్యమునకు వచ్చెను.

శ్లో॥ ఇదానీం మంత్రమాహాత్మ్యాత్-గుర్వనుగ్రహ వైభవాత్
మహాఫలాభిలాష స్సన్-జహాతి ధనవాంఛితమ్॥

తా॥ ఇప్పుడు మంత్రముయొక్క మహత్తువలన, గురువుగారి దయాప్రభావమువలనను ఉత్తమ ఫలముచు కోరువాఁడై ధనవాంఛను వీడుచున్నాఁడు.

శ్లో॥ తథాపి మమ భక్తేన-కాంక్షితాః ధనసంపదః
అత స్తు ధ్వజదత్తోఽయం నిజబంధు సమావృతః
భునక్తు సకలాన్ భోగా-నంతే గచ్ఛతు మ త్పదమ్॥

తా॥ అయినను నా భక్తునిచే ధనసంపద కోరబడినది కాన నీ ధ్వజదత్తుఁడు తన బంధుకోటితోకూడి సమస్తములగు భోగముల ననుభవించినవాఁడై అవసానమున నా పదసన్నిధిని చేరుకొనుగాక;

శ్లో॥ మమ సందర్శనా దేవ సిద్ధేత్ కైవల్య ముత్తమమ్
మహాఫలాభిలాషో౽స్య-పుంరక్త స్సువర్చలే॥

తా॥ నా సందర్శనమువలననే ఉత్తమమగు మోక్షపదము లభించు గాక. కాని సువర్చలా! అతనికి మహాఫలాభిలాష యున్నట్లు ప్రత్యేకించి చెప్పబడినది.

శ్లో॥ అతో౽స్య ధ్వజద త్తస్య-సర్వ సంప త్సమృద్ధయే
సమర్పయ శ్రియం సాక్షా-దంశభూతం తవ ప్రియే!

తా॥ కాన ఓ ప్రియురాలా ఈ ధ్వజదత్తు కు సమస్తములగు సంపదలు చేకూరుటకొఱకు నీలో అంశభూతముగానున్న లక్ష్మి నితని కనుగ్రహింపుము

శ్లో॥ ఏవం సంబోధితా భర్త్రా-తథాజ్ఞాం ప్రతిగృహ్ణతీ
నిజాంశం ప్రేషయామాస-ధ్వజదత్తగృహం ప్రతి॥

తా॥ ఇట్లు భర్తచే చెప్పబడి యటులే ఆజ్ఞను గ్రహించునదై తన లోని యంశయగు లక్ష్మిని ధ్వజదత్తుని గృహము గూర్చి పంపెను.

శ్లో॥ హనూమ ద్వచనం శ్రుత్వా-నిజసంప త్తి కారణమ్
ధ్వజద త్తః పున్సః ప్రాహ స్వ దేవం ప్రయతాంజలిః॥

తా॥ తన సంపత్తికి కారణమగు హనుమంతుని మాట విని ధ్వజదత్తుడు తనదైవమగు హనుమంతునిగూర్చి దోయి లొగ్గినవాఁడై మరల ఇట్లనెను.

శ్లో॥ స్వామిన్! కుతో మ మాజ్ఞాతం-పున స్సంసార బంధనమ్
తవ సందర్శనా జ్జంతు-స్తరే త్సంసార సాగరమ్ ॥

తా॥ ఓస్వామీ! నాకు మరల సంసారబంధము నాదేశించుట ఎందుకు? మిమ్ము చూచుటచేతనే ఈప్రాణి సంసార సాగరమునుండి బయటపడునుగాక.

శ్లో॥ దుర్లభం తవ పాదాబ్జం-త్యజేయం కథ మీశ్వర !
సంసారబంధ విచ్ఛేదః-కాంక్షితో ౽ద్య మయా ప్రభో!

తా॥ దుర్లభమగు నీపాదపద్మమును వీడుటఎట్లు? ఇప్పుడు నాచే సంసారబంధమునుండి విముక్తి కోరబడుచున్నది.

శ్లో॥ సఫలం కురు మత్కామం-విలంబం న సహే మ్యహమ్
సిద్ధం ఫలం ప్రాప్య కో వా- కథం జహ్యాత్తు బుద్ధిమాన్ ॥

తా॥ నా కోర్కెను సఫలముచేయుము. ఆలస్యమును నేను సహించలేను. సిద్ధించినఫలమును బుద్ధికలవాఁడెవఁడైన నెట్లువీడును?

శ్లో॥ అత స్తుచ్ఛఫలం మా భూత్-దీయతాం శాశ్వతం ఫలమ్
తా॥ అందుచే తుచ్ఛమగు ఫలమువలదు. శాశ్వతమగు ఫలము నిత్తువుగాక.

శ్లో॥ ఏవం సంప్రార్థితో దేవో-ధ్వజదత్తేన ధీమతా
గృహీత్వా చుబుకే విప్రం-ప్రార్థయామాస మారుతిః॥

తా॥ ఇట్లు బుద్ధిమంతుఁడగు ధ్వజదత్తునిచే ప్రార్థింపబడినవాఁడై దేవుఁడగు హనుమంతుఁడా బ్రాహ్మణునితో నిట్లనెను.

శ్లో॥ ఇద మేకం మద్వాక్యం-శ్రోతవ్య మనసూయయా
భోక్తవ్యా హి మహాభోగా-స్త్వయాద్య సహబంధుభిః
న చే ల్లోకాపవాద స్స్యాత్-యావ దాచంద్రతారకమ్॥

తా॥ ఈ ఒక్క నా మాటను అసూయలేక వినవలసినది. నీవిప్పుడు బంధువులతోకూడి మహా భోగములనుభవింపవలసినది. లేకున్న సూర్యచంద్రాదులున్నంతవఱకు లోకాపవాద మేర్పడును. ఏమన

శ్లో॥ ధ్వజదత్తో దరిద్రస్సన్-హనూమన్మంత్ర తత్పరః
సంపత్కామో జపన్ భూయ-స్సంపదం నాప్తవా నితి॥

తా॥ ధ్వజదత్తుఁడు దరిద్రుఁడౌట సంపదలు కోరువాఁడై హనుమన్మంత్రమును తదేక చింతనతో జపించియు సంపద పొందలేఁడు అని.

శ్లో॥ అతో మంత్రస్య సిద్ధ్యర్థం-మ మాజ్ఞా పాలనాయ చ
మ న్మంత్ర జప సిద్ధ్యర్థం-భోగాన్ భుంక్ష్వ యథాసుఖమ్॥

తా॥ అందువలన మంత్రసిద్ధికొఱకు, నా యాజ్ఞను పాలించుట కొఱకు నా మంత్రముయొక్క జపసిద్ధికొఱకు యథేచ్ఛగా భోగము లనుభవించుము.

శ్లో॥ తతో మత్పద మాసాద్య-సర్వోపప్లవ వర్జితమ్
సంసారసాగరో త్తీర్ణో-భవిష్యసి న సంశయః॥

తా॥ ఆటుపిమ్మట ఏ బాధలులేని నా పదసన్నిధినంది నిస్సందేహ ముగా సంసారసముద్రమునుండి బయల్పడగలవు.

శ్లో॥ భక్త సంరక్షణార్థాయ-పర్యటన్ తవ వేశ్మని
వసామి పిహితాకారః-సర్వోపద్రవ నాశకః॥

తా॥ భక్తులసంరక్షణకొఱకు పర్యటించువాఁడనై నీనివాసమున నెవ్వ రికి తెలియబడనట్లు కష్టములనన్నిటిని నాశన మొనర్చుచు నుందును.

శ్లో॥ డిండి మధ్వనినా విప్ర! ప్రతిజానీహి సత్వరః
యత్ర కుత్రాపి విషయే-న మే భక్తః ప్రణశ్యతి॥

తా॥ బ్రాహ్మణుఁడా! నొక్కివక్కాణించుచున్నాను తెలిసికొనుము, ఏ విషయమునను ఎచ్చటను నా భక్తుఁడు నష్టకష్టములనందడు,

శ్లో॥ ఇత్థం ప్రభంజనసుతేన నిజోన్ముఖేస
సంబోధితో ద్విజవరో నహువార్యమాణః
అద్వైత నిశ్చితమతి ర్బహునూన్య దేవ
మంగీచకార నియతోదయ మాత్మభోగమ్॥

తా॥ ఇట్లు తన ఎదుటనున్న హనుమంతునిచే ధ్వజదత్తుఁడు చెప్ప బడినవాఁడై పెక్కురీతుల వారింపబడి ఏకైకాభిప్రాయమునకు వచ్చినవాఁడై తన భోగానుభవమునకు సంబంధించిన ఆ మహనీయుని నియమము నంగీ కరించెను.

శ్లో॥ కామం విధాయ సఫలం ద్విజనందనస్య
వాతాత్మజోఽపి గమనాయ మతిం చకార
సుగ్రీవ మైంద పన సాంగద గీయమాన
లీలావదాతమహిమా గుణధామ దామా॥

తా॥ ఆ బ్రాహ్మణకుమారుఁడగు ధ్వజదత్తుని కోర్కెలను సఫల మొనర్చి హనుమంతుఁడు, సుగ్రీవుఁడు, మైందుఁడు, పనసుఁడు, అంగదుఁడు మున్నగువారిచే స్తుతింపబడు లీలా రూపమగు దానమహిమయు, సద్గుణ సంపదయు కలవాఁడై వెడలుటకు సంసిద్ధుఁడయ్యెను.

శ్లో॥ అథ నిజపద ముచ్చై ర్దుష్ట్రి వాహాధిరూఢో
హరి రివ గరుడాంకో ధర్మపత్నీ సహాయః
జయజయ శుభశబ్దై రూపణీయ ప్రయాణః
సకలనిగమవేద్య శ్శ్రీహనూమాన్ జగామ ॥

తా॥ అటు పిమ్మట ఉన్నతమగు ఒంటె నధిరోహించినవాఁడై ధర్మపత్నియగు సువర్చలతో కూడినవాఁడై గరుడ ధ్వజుఁడగు హరివలె నుండి జయజయ ధ్వానములచే ప్రయాణము సూచింపబడుచుండ సమస్త వేదములచే తెలియదగు హనుమంతుఁడు తన నివాసమునకు వెడలెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పరాశర మైత్రేయ సంవాదే
శ్రీ సువర్చలా హనుమన్మంత్ర ప్రభావే ధ్వజదత్తచరిత్ర
కథనం నామ త్రయోదశ పటలః

— ౦ —

చతుర్దశ పటలః

## ధ్వజదత్త చరితం

శ్రీ మైత్రేయః

శ్లో॥ కి మకారి ద్విజే నాథ – ధ్వజదత్తేన ధీమతా
పరాశర ! మహాప్రాజ్ఞ ! వృత్తాంతం బ్రూహి మే ప్రభో !

తా॥ మైత్రేయుఁ డీరీతిగా నడిగెను. సర్వజ్ఞుఁడవగు పరాశర మహాముని ! అటు పిమ్మట బుద్ధిమంతుఁడగు ధ్వజదత్తుఁడేమిచేసెనో వృత్తాంతమంతయు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ ప్రాప్తకామ స్తు మైత్రేయ! విప్ర స్సంతుష్టమానసః
ఉపపేదే య తాత్మానం - పుష్కరం గురు మాత్మనః

తా॥ పరాశరుల వారిట్లనిరి. మైత్రేయా! కోర్కెలను పొందిన వాఁడై ధ్వజదత్తుఁడు సంతసమునంది, తన గురువగు పుష్కర మహాముని సమీపమున చేరెను.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారైః - పూజయన్ విధివ ద్గురుమ్
ముఖ ప్రసాద సంభావ్య - కార్యసిద్ధి మవోచత ॥

తా॥ అట్లు చేరి యథావిధి గురుని ప్రదక్షిణ నమస్కారములతో పూజించి ముఖమునందలి ప్రసన్నత చేతనే యూహింపదగు కార్య సాఫల్య విధానము ను తెల్పెను.

శ్లో॥ బ్రహ్మ న్నద్య కృతార్థోఽస్మి-త వానుగ్రహ వైభవాత్
దైవతం చ మయా దృష్టం - బ్రహ్మాద్యై రపి దుర్లభమ్॥

తా॥ ఓ మహానుభావా! నీయనుగ్రహ ప్రభావముచే నిప్పటికి ధన్యుఁడనైతిని బ్రహ్మాదులకు కూడా లభింపని దైవదర్శనమును నేనందితిని.

శ్లో॥ శ్రేయసోఽస్య భవాన్మూల-మత స్త్వాం శరణం వ్రజే
త్వ దనుగ్రహ లేశేన-దరిద్రో ధనితా మగామ్॥

తా॥ ఈ నా శ్రేయస్సునకు మూలకారణము నీవే. అందుచే నిన్నే శరణు వేడుచున్నాను. నీ యనుగ్రహ మాత్రమున దరిద్రుఁడను ధనికుఁడనైతిని.

శ్లో॥ ఋణ ప్రతికృతిం కర్తుం-న శక్నోమి మహామునే!
అనేక జన్మ సాహస్రై-రితి మే నిశ్చితా మతిః।

తా॥ ఓ మహామునీ! నీ ఋణమును అనేక వేల జన్మలందైన తీర్చుకొనలేనని నా గట్టి నమ్మకము,

శ్లో॥ భావతః ప్రియశిష్యేణ-విధేయేన మయా గురో!
కిం విధేయ మిదానీం తే-తద్బ్రూహి కరవా ణ్యహమ్॥

తా॥ గురువర్యా! తమ ప్రియశిష్యుఁడ ననుభావముతో ఇప్పుడు నేనేమి చేయవలెనో సెలవిండు. చేయుదును.

శ్లో॥ ఇత్యుక్తో ధ్వజదత్తేన-పుష్కరః శిష్యవత్సలః
జగాద వదతాం శ్రేష్ఠ-స్మి తోదంచితవా ఙ్మనిః॥

తా॥ ఇట్లు ధ్వజదత్తునిచే చెప్పబడినవాఁడై శిష్యుని యందు వాత్సల్యము కలవాడును, మాటకారియు, చిరునవ్వుచే నొప్పు మాటలు కల పుష్కరుఁడు ఇట్లు పల్కెను.

శ్లో॥ హనూమతః ప్రసాదేన-కృతకృత్యోఽస్మి శిష్యక!
నాస్తి కృత్యావశేషోఽద్య-నిష్కామతపసో మమ॥

తా॥ ఓ శిష్యుఁడా! హనుమదనుగ్రహముచేతనే ధన్యుఁడనైతిని. కోర్కెలను వదలి తపమాచరించు నా కొరకు చేయదగిన దేమియులేదు.

శ్లో॥ హనుమ ద్భక్తి విషయే-మాక్రుధాః వ్యగ్రతాం ద్విజ!

తా॥ ద్వజదత్తా! హనుమద్భక్తి విషయమున నెన్నడు లోపము చేయవద్దు.

శ్లో॥ త్వమేవ యోగ్య కాలేషు-హనుమన్మంత్ర ముచ్చరన్
ప్రమాదం మా భజ క్వాపి- భజతో నిజదైవతమ్॥

తా॥ నీవు తగిన సమయములందు హనుమన్మంత్రమునుచ్చరించుచు నీ దైవమగు హనుమంతుని సేవించుచు లోపమింతయు లేక యుండుము.

శ్లో॥ అస్మాక మిష్టదేవస్య-త్వ మాజ్ఞాం పరిపాలయ

తా॥ మన ఇష్టదైవముయొక్క ఆజ్ఞను నిర్వహించుము.

శ్లో॥ ఉపభు జ్యాఖిలాన్ భోగాన్-శీలయా సాధువృత్తయా
అంతే హనుమత స్థానం-ప్రాప్నుహి ద్విజసత్తమ!

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! మంచి నడవడికతో సమస్తభోగము లనుభవించి చివరకు హనుమత్పదమును పొందుదువుగాక

శ్లో॥ అహం వసామి దా త్రైవ-తదాజ్ఞాగౌరవా త్సదా
తా॥ ఆతని యాజ్ఞయందలి గౌరవముతోనే నెప్పుడిచ్చటనే యుందును.

శ్లో॥ హితోపదిష్టో గురుణా-ధ్వజదత్తో మహామతిః
తథేతి ప్రతిజగ్రాహ-పాదమూల ముపాగతః॥

తా॥ బుద్ధిశాలియగు ధ్వజదత్తుఁడు గురువుగారిచేత మంచి చెప్పబడినవాఁడై అట్లేయని యంగీకరించి పాదములంటి నమస్కరించెను,

శ్లో॥ అథ సమ్మానిత శ్శిష్యః పుష్కరేణ ద్విజోత్తమః
ద్విత్రాం స్తు పదవిన్యాసా-ననుయాతో మహాత్మనా ॥

తా॥ పిమ్మట మహాత్ముఁడగు పుష్కరుఁడు బ్రాహ్మణోత్తముఁడు, శిష్యుఁడు నగు ధ్వజదత్తుని యనుగ్రహించి రెండుమూడడుగులు వైచి సాగనంపెను.

శ్లో॥ తిర్యక్కృత్య నిజగ్రీవాం-గురుం పశ్యన్ ముహుర్ముహుః
త త్పదాబ్జం హృది ధ్యాయన్-జగామ నిజపట్టణమ్ ॥

తా॥ ధ్వజదత్తుఁడు తనమెడను వెనుకకుతిప్పి గురువు గారిని మాటిమాటికిచూచుచు, ఆతని పాదపద్మములనే హృదయమున ధ్యానించుచు తన పట్టణమునకు వెడలెను.

శ్లో॥ శనైర్గచ్ఛన్ తథా విప్రో దదర్శ నిజమందిరమ్
సుధామండల సంస్పర్ధి-ప్రాసాద శత శోభితమ్ ॥
తా॥ అట్లు నెమ్మదిగా వెళ్ళుచు చంద్రమండలముతో పోటీపడి ప్రకాశించు నూరుప్రసాదములుకల తన యింటిని చూచెను.

శ్లో॥ నానా రత్నాంచిత ద్వారం-హేమ ప్రాకార వేష్టితమ్
ధ్వజదత్తాభిధానాంక-ధ్వజై శ్చ సమలంకృతమ్॥

తా॥ అది అనేకరత్నములచే నొప్పు ద్వారముకలది, చుట్టు బంగారుప్రాకారముకలది. ధ్వజదత్తుఁడు అను పేరుగల జెండాలతో నలంకరింపబడినది.

శ్లో॥ మహాజలై ర్మహోత్సాహై - ర్హయై శ్చ పరివారితమ్
ఐరావత సమాకారై ర్గజై శ్చ గజయూథపైః
ఉష్ట్రైరష్టప దాకారై-ర్వేష్టితం చ యథాక్రమమ్॥

తా॥ ఇంకను గొప్పవేగము నుత్సాహముకల గుఱ్ఱములతోను ఇంద్రుని ఏనుఁగగు ఐరావతముతో సమానాకారము గల ఏనుగులతోను, బంగారమువంటి యాకారముగల ఒంటెలచేతను క్రమముగా చుట్టబడియున్నటువంటిది.

శ్లో॥ ఆపీన భార వహనాత్-గచ్ఛంతీభి స్సుమంజులమ్
ధేనుభి ర్బహుసంఖ్యాభి-స్సమంతా త్పరివేష్టితమ్

తా॥ నిండుపొదుగుల బరువును మోయుచుండుటచే అందముగా నడచు ననేకగోవులచే పరిసరముల చుట్టబడినది.

శ్లో॥ దాశీభి ర్దాసముఖ్యైశ్చ - సేవితం తు దివా నిశమ్
ద్వీపాంతర సమానీత-నానావస్తు సమన్వితమ్

తా॥ దాసదాసీజనముచే రాత్రింబవళ్ళు సేవింపబడునట్టిదియు, ద్వీపాంతరములనుండి కొనిరాబడిన యనేక వస్తువులతో కూడినదియు

శ్లో॥ రాశీకృతైర్ధనై ర్ధాన్యై-రత్నై శ్చ వివిధై రపి
పట్టవస్త్రైర్మహామూల్యై-ర్దివ్య. పీతాంబరై రపి ॥

తా॥ ధనధాన్యములు, వివిధములగు రత్నములు రాశులుగా పోసియున్నది. గొప్ప విలువగల పట్టుపీతాంబరములతోను

శ్లో॥ దుకూలై ర్భూషణై శ్చాపి-సమంతా దుపశోభితమ్
గృహోపకరణై రన్యై రుపభో గోపశోభితమ్
అన్నైః స్స్వర్ణపాత్రై శ్చ- సర్వత స్సమలంకృతమ్ ॥

దువ్వలువలు, ఆభరణములతోను, ఇతరములగునింటి సామాగ్రిచే నిండి ప్రకాశించునట్టిది, వెలగట్టలేని బంగారుపాత్ర లంతట అలంకారముగా నుంచబడినది.

శ్లో॥ ఏవం సర్వ సమృద్ధం త - ద్గృహరత్నం నిరీక్ష్య సః
విస్మయం పరమం ప్రాప - హనుమ ద్వైభవమ్ స్మరన్ ॥

తా॥ ఇట్లు సర్వసమృద్ధితోనున్న అశ్రేష్ఠ గృహమును చూచి ధ్వజదత్తుఁడు హనుమంతుని యనుగ్రహ విశేషమును తలచుచు మిక్కిలి యచ్చెరువందెను.

శ్లో॥ నిజాగమన సంభ్రాంతై - ర్బంధుభి ర్బ్రాహ్మణో త్తమః
ప్రత్యుద్గత స్సుహృద్భి శ్చ - ప్రవివేశ న్గృహో త్తమమ్ ॥

తా॥ తనరాకకు నాశ్చర్యపోవు బంధువుల చేత స్నేహితుల చేత ఎదురువచ్చి తీసికొని వెళ్ళబడినవాఁడై ఆ బ్రాహ్మణో త్తముఁడగు ధ్వజదత్తుఁడు తన శ్రేష్ఠ భవనమున ప్రవేశించెను.

శ్లో॥ స్వ గృహీతాంగుళీభి శ్చ - సఖీభి స్సంహ తోరుభిః
పశ్యన్ గృహ గరీయస్త్వం - నిజాంతఃపుర మావిశత్ ॥

తా॥ క్రిక్కిరిసిన తొడలు కలిగి తాముగా వ్రేళ్ళు పట్టుకొని చూపు చెలికత్తెలవలఁ గృహ వైభవము చూచుచు తన యంతఃపురమున ప్రవేశించెను.

శ్లో॥ తత్ర సాధ్వీం నిజాం భార్యాం — సఖీభిః పరివారితామ్
మహాభాగ్యవతీ త్యేవ - నిత్యం బంధు జనైస్స్తుతామ్ ॥

తా॥ అట ఉత్తమురాలగు, చెలికత్తెలచే సేవింపబడునట్టి మహాభాగ్యవతియని నిత్యము బంధు జనులచే పొగడబడునట్టి తన భార్యను

శ్లో॥ సర్వలక్షణ సంపన్నాం - నామాంగీం వారి జేక్షణామ్
తారా మధ్య గతాం తన్వీం - చంద్రరేఖా మివస్థితామ్ ॥

తా॥ అన్ని మంచి లక్షణములతో కూడి యున్నట్టియు, చక్కని అవయవములు కల్గినట్టియు, పద్మములు వంటి కన్నులు కల్గినట్టియు నక్షత్రముల మధ్యనున్న చంద్రరేఖ వలె సొగసైనట్టియు.

శ్లో॥ స్వర్ణతాటంక సంరోచ-త్కాపోల ద్వయ జృంభితామ్
నవరత్న ప్రభాలిప్త-మేఖలా దామ శోభితామ్ ॥

తా॥ బంగారు చెవిపోగులకాంతిచే నొప్పు చెక్కిళ్ళజంట వైభవము కలిగినట్టియు, నవరత్నములకాంతిచే పూయబడిన ఎనిమిదిపేటల మొలనూలుతో ప్రకాశించునదియు,

శ్లో॥ క్వణ త్కంకణ విద్యోతి-మణిబంధాం సునోధ్యమామ్
కంఠలంబి మహామూల్యా-ముక్తాహార మనోహరామ్ ॥

తా॥ చక్కగధ్వనించు కంకణములచే ప్రకాశించు మణికట్టు కలదియు, సన్నని నడుముకలదియు, కంఠమునందు వ్రేలు గొప్పవిలువైన ముత్యాలహారముతో మనోహర మైనదియు,

శ్లో॥ మంజు మంజీర నిఃదాం దివ్య పీతాంబ రాంచితామ్
ఏవం విచిత్ర భూ షాఢ్యాం-బాలాం దృష్ట్వా ద్విజోత్తమః
ఉవాచ వచనం ధీరః-సుహృద్బంధు సమావృతః ॥

తా॥ మధురమగు అందెలమోతకలదియు, పట్టుపీతాంబరములచే ప్రకాశించునట్టిదియునై ఇట్లు విచిత్రభూషణములచే గొప్పగానున్న భార్యతో, స్నేహితులు బంధువులతో కూడియున్న ధ్వజదత్తుఁడు ఇట్లు పల్కెను.

శ్లో॥ అయి ప్రియే! కృతార్థోఽస్మి-తవ సౌసీల్య వైభవాత్ ॥
తా॥ ఓ ప్రియురాలా! నీ సౌశీల్య సంపదచే ధన్యుఁడనైతిని.
శ్లో॥ పుష్కరోనామ ధర్మాత్మా-మహాయోగీ మహాతపాః
సాక్షాత్కృత హనూమాం శ్చ-సర్వభూత దయాపరః
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః-సదాచారో జితేంద్రియః॥

తా॥ పుష్కరుఁడను పేరుగల ధర్మాత్ముఁడు గొప్ప యోగి. తపశ్శాలి హనుమంతుని సాక్షాత్కార మందినవాఁడు, ప్రాణికోటియందెల్ల దయకల్గి యుండువాడు. అన్ని శాస్త్రముల తత్వ మెఱిగినవాఁడు, మంచినడత, నియమము కల్గి ఇంద్రియ నిగ్రహము కలవాఁడు

శ్లో॥ ఏవం భూతస్తు విప్రేంద్రో-నైమిశారణ్యగహ్వరే
పుణ్యతీర్థం సమాసాద్య-జప న్నాస్తే నిరంతరమ్॥

తా॥ఇట్టి బ్రాహ్మణోత్తముఁడు నైమిశారణ్య మధ్యమున పుణ్యతీర్థము నొకదానిని చేరి యెల్లప్పుడు జపించుచుండెను.

శ్లో॥ నిష్కామ జపకర్తా సన్-హనుమన్మంత్ర తత్పరః
సంపూర్ణ సర్వకామోఽపి-దీనానుగ్రహ వాంఛయా
జప త్యనుదినం సాక్షాత్-హనుమద్ద్వాదశాక్షరీమ్॥

తా॥ నిష్కాముఁడై జపముచేయుచు హనుమన్మంత్రమున తత్పరుఁడై యుండెను. తన కోర్కెలన్నియు తీరిన వాఁడయ్యు దీనుల ననుగ్రహించు కోర్కెతో సాక్షాత్తు హనుమద్ద్వాదశాక్షరీ మంత్రము ప్రతిదినము జపించుచుండెను.

శ్లో॥ అథాస్మి న్నంతరే సాధ్వి! తవ దైన్య నిరీక్షణాత్
అతీవ దుఃఖితో భూత్వా-త్వ త్సంభాషణ విహ్వలః
ఉపాదాన చ్ఛలే నైవ. నిష్క్రాంతోఽహం గృహాంగణాత్॥

తా॥ ఇంతలో ఓ ఉత్తమురాలా నిన్ను దీనస్థితిలో చూచుటవలన మిక్కిలి దుఃఖితుఁడనై నీతో మాటలాడుటకు కూడ ధైర్యము చాలక ఉపాదాన మను మిషతోనే ఇంటినుండి బయల్వెడలితిని.

శ్లో॥ నిర్గత్య తు చిరం ధ్యాత్వా-స్మృత్వా తవ ముఖాంబుజమ్
క్వ గంతవ్యం మయా చేతి-చింతాక్రాంత మి వాభవమ్॥

తా॥ బయటకు వచ్చి చాలాసేపాలోచించి నీ ముఖపద్మమును స్మరణకు తెచ్చుకొని 'ఎక్కడకు నేను వెళ్ళవలెను?' అనుకొనుచు చింతించుచునుంటిని.

శ్లో॥ తతో ధైర్యం సమాస్థాయ సర్వసంప జ్జిఘృక్షయా
నిద్రాహార విహీనోఽహం-నైమిశారణ్య మావిశమ్॥

తా॥ పిమ్మట ధైర్యము తెచ్చుకొని సర్వసంపదలు గ్రహింపనిచ్ఛ కలవాఁడనై నిద్రాహారములు లేనివాఁడనైనేను నైమిశారణ్యమును ప్రవేశించితిని

శ్లో॥ ప్రవిశ్య తు మహారణ్య-మద్రాక్షం పుష్కరం మునిమ్
దృష్ట్వా తు సుమహాత్మానం-జపం తం పాపకోపమమ్
విజ్ఞాప్య మమ వృత్తాన్తం- గతోఽస్మి శరణం మునిమ్॥

తా॥ అట్లా మహారణ్యమును ప్రవేశించి పుష్కర మహామునిని చూచితిని. అ మహాత్ముని అగ్ని సమతేజుఁడే జపించువానిని చూచి నాగాధ నంతను తెల్పి శరణు వేడితిని,

శ్లో॥ తత శ్ర్శుత్వా తు మ ద్వాక్యం-పుష్కరో దీనవత్సలః
హనుమన్మంత్ర దానేన సద్యో మా మనుగృహ్ణాత॥

తా॥ అంత నా గాథవిని ధీనుల యందు వాత్సల్యము కలవాఁడగు పుష్కరుఁడు వెంటనే హనుమన్మంత్రము నుపదేశించుట ద్వారా నన్నును గ్రహించెను.

శ్లో॥ తదనుగ్రహ మాహాత్మ్యే - ద్దృష్టం దైవత ముత్తమమ్
తతో హనుమతా తేన - దత్తో మే వర ఉత్తమః॥

తా॥ ఆయను గ్రహ ప్రభావము వలన ఉత్తను దైవతమగు హనుమంతుని చూడగల్గితిని. పిమ్మట ఆ హనుమంతునిచే నాకు శ్రేష్ఠమగు వరమీయబడినది.

శ్లో॥ ఇహ సర్వసమృద్ధి శ్చ - పరత్ర చ పరాగతిః
ఏవం వరం గృహీత్వాఽహ - మాగతోఽస్మి త వాంతికమ్॥

తా॥ ఈ లోకమున సర్వభోగములు, పరమున నుత్తమ గతియు కల్గునట్టి వరమది దానిని గ్రహించి ఇట్లు నీ సమీపమునకు నేను వచ్చితిని.

శ్లో॥ వినా తవ వియోగార్తిః – నాస్తిక్లేశో మమప్రియే ః
త్వద్దైన్య స్మరణా దేవ – ఖేదో భవతి నాన్యథా
తయ్యైవ తు మహాకష్టం – భుక్తం దారిద్ర్య సంభవమ్॥

తా॥ ఓ ప్రియురాలా ః నిన్ను వీడియుండుట తప్ప నాకు వేఱు కష్టమొకటిలేదు నీ దీనస్థితిని స్మరించుట వలన తప్ప వేరు విధముగ నాకు బాధలేదు. దారిద్ర్యము వలన నేర్పడు మహాకష్టమనునది నీవేఅనుభవించితివి.

శ్లో॥ ఇత్యుక్తవంతం ప్రోవాచ – పతిశీలా పతివ్రతా
స్వామి న్నకించి త్కష్టం మే – త్వత్పాదాసక్త చేతసః॥

తా॥ ఇట్లను నట్టి ధ్వజదత్తునితో పతితోడిదే చరిత్రగా కల్గి పతి సేవయే వ్రతముగా కల యాతని భార్య ఇట్లనెను. స్వామీ ః మీ పాదము లందే ధ్యానముంచిన నాకే మాత్రము కష్టము లేదు.

శ్లో॥ కిం తు ధి ఙ్మా మిమాం దుష్టాం – త్వ ద్వియోగేఽపిజీవితమ్
తా॥ కాని మీ వియోగమునందు సైతము జీవించియున్న నా జీవితము నింద్యము.

శ్లో॥ జ్ఞాత్వా తు నానుగంత్రీం మాం – భవతః పాదపద్ధతిమ్
అంతరంగ మిదం మన్యే – శత్రురేవ న నంశయః ॥

తా॥ తెలిసియు మీ పాద సన్నిధికి తీసికొని పోని నా మనస్సును శత్రువుగానే తలంచుచున్నాను. ఇందు సందియము లేదు.

శ్లో॥ త్వ ద్గతం భిద్య మానాయా – స్త ద్వార్తాం మే న వక్ష్యతి
ఉపకర్త్రీం తు తాం మన్యే – మూర్ఛనాం తు కథంచన
యయా వియోగదుఃఖాని – నైవ జ్ఞాతవతీ హ్యహమ్ ॥

తా॥ మీ విషయమై దుఃఖించు నాకు మీ వార్తనే చెప్పినదికాదు. దేనిచేత మీ వియోగ దుఃఖములు నేను తెలిసికొన లేనో అట్టి మూర్ఛను ఎట్లో పొందినను దాని ఉపకారము చేసిన దానినిగానే తలచుదానను.

శ్లో॥ పురస్సరం మమ స్వాంతం – తవ మార్గప్రదర్శకమ్
పున ర్నాయాతి శత్రుత్వా – త్త్వా ముపాదాయ సంభ్రమాత్॥

తా॥నాకు శత్రువగుటవలననే ఆ నా మనస్సు మీకు మార్గము చూపుచు మీతో కూడి యుండి నేనేమందునోయను భయమున తిరిగిరాలేదు.

శ్లో॥ ఇదానీం బహుమన్యే తాం– గాధాం జీవం త్యహం పునః
త్వ ద్దర్శన మహానంద–సముద్రోదక సంప్లుతామ్॥

తా॥ ఇప్పుడు మాత్రము బ్రతికియున్నదాననై తమ దర్శనమను మహాసముద్రజలముచే నుప్పొంగు నా యంతరంగ చరిత్రమును గౌర వించుచునే యున్నాను,

శ్లో॥ ఏవం వదంతీం భార్యాం తు–భాష్పపూరిత లోచనః
ఆలింగ ద్వా ద్విప్రః–పరమానంద నిర్భరః॥

తా॥ ద్విజదత్తుఁడు పైరీతిగా చెప్పుచున్న భార్యను పరమానంద ముతో నిండినవాఁడై ఆనంద భాష్పములతో నిండిన కనులు గల్గి వెంటనే కౌగలించుకొనెను.

శ్లో॥ తత స్సంతుష్ట చిత్త స్సన్–స్వభార్యా మిద మబ్రవీత్
తా॥ పిమ్మట సంతోషముతో కూడిన మనస్సు కలవాఁడై తన భార్యతో నిట్లనెను,

శ్లో॥ కష్టా న్యహో న్యతీతాని– లంఘితో దుఃఖసాగరః
ఇదానీం త్యజ కష్టాని-హనుమ ద్దయయా ప్రియే॥

తా॥ ఓ ప్రియురాలా హనుమంతుని దయచే కష్టదినములు గడిచి నవి. దుఃఖమను సముద్రము దాటబడినది. కాన నిప్పుడు కష్టముల విడుము.

శ్లో॥ అధునా త్వం మహాభాగే-భుంక్ష్వ భోగాన్ యథేప్సితాన్
భునక్తు సకలాన్ భోగాన్-భద్రబాహు ర్య థేప్సితమ్
భద్రగోఽపి మహాప్రాజ్ఞో-భ్రాతా మే భ్రాతృవత్సలః

తా॥ ఉత్తమురాలా! ఇప్పుడు నీవు కోర్కెగల సుఖములన్నిటి ననుభవింపుము. ఇష్టానుసారముగా భద్రబాహుడు కూడా సమస్తభోగము లనుభవించునుగాక. సోదరవాత్సల్యముకల నా సోదరుడు, మహాజ్ఞాని భద్రగుడుకూడ నిష్టసుఖముల నందునుగాక.

శ్లో॥ గుర్వనుగ్రహ మాహాత్మ్యాత్-హనుమన్మంత్ర వైభవాత్
తవ భాగ్యోదయా చ్చైవ-సమృద్ధా స్సర్వ సంపదః॥

తా॥ గురువుగారి యనుగ్రహప్రభావమువలన, హనుమంతునిమంత్ర శక్తివలన, నీ యదృష్టమువలనను సమస్తములగు సంపదలు సమకూడినవి,

శ్లో॥ అతో యథేష్ట మన్నాని-భుజంతా మర్థిన స్సదా
బంధవా శ్చ యథాకామ-మీప్సితార్థాన్ భుజంతు నః॥

తా॥ అందుచే యాచకులందరు ఇష్టము వచ్చినట్లు ఎల్లప్పుడు భుజించుచుందురు గాక! మన బంధువులుకూడ కోరినటుల కోర్కెల ననుభవింతురుగాక ;

శ్లో॥ ఇత్యాదిశ్య వధూం విప్రో-విరరామ మహామతిః
చక్రే తదాజ్ఞాం శీలాపి-సుశీలా భర్తృచోదితా॥

తా॥ ధ్వజదత్తుడు భార్యనిట్లాదేశించి యూరకుండ నాతని భార్యయు మంచిశీలముకల శీలాదేవి భర్తచే తెలియబడునటుల చేసెను.

తతః కదాచి ద్విపేంద్రః-పుణ్యకాలే నదీతటే
స్నాత్వా సుశీలయా పూర్వం-శీలయా భార్యయాలహ

తా॥ పిమ్మట ఒకానొకప్పుడు ధ్వజదత్తుడు పుణ్యకాలమున సుశీల యగు శీలాదేవితో కూడి నదియందు స్నానము చేసినవాడై ఆ నదీతటమున

శ్లో॥ యథావిధి యథాన్యాసం-హనుమ ద్ద్వాదశాక్షరమ్
దార్రిద్ర్యపంక శమన-మజ్ఞాన ధ్వాంత నాశనమ్
ఏవం విధం మహామంత్రం-కళత్రాయ దిదేశ సః

తా॥ యథావిధిగా అంగన్యాసకరన్యాసములతోకూడ దర్రిద్రమగు బురదను పోగొట్టునట్టి అజ్ఞానమను చీకటిని నాశనముచేయునట్టి హానుమ ద్ద్వాదశాక్షరమహామంత్రమును భార్యకొఱకై ఉపదేశించెను.

శ్లో॥ అష్టాక్షరం మహామంత్రం-భద్రకాయ దిదేశవై
సప్తమంత్రాత్మికాం విద్యాం-భద్రబాహోస్తు దిష్టవాన్ ॥

తా॥ అష్టాక్షరమహామంత్రమును భద్రకున కుపదేశించెను. శ్రీ హనుమంతుని సప్తాక్షరమహామంత్రమును భద్రబాహునకుపదేశించెను.

శ్లో॥ ఏవం హనూమతో మంత్రాన్-పితృ మాతృ కులద్వయే
విప్రః ప్రవర్తయామాస-యథాన్యాసం యథారుచి ॥

తా॥ ఇట్టు హనుమన్మంత్రములను తండ్రియొక్క, తల్లి యొక్కయు వంశమునందు వారివారి ఇష్టమునసుసరించి న్యాసాదికముతో కూడ ధ్వజదత్తుఁడు ప్రవర్తింపజేసెను.

శ్లో॥ ధ్వజదత్తో మహాప్రాజ్ఞ స్సుహృద్బంధు సమన్వితః
యథాసుఖం యథాన్యాయ్యం సర్వాన్ కామా నభుంజత

తా॥ మహాజ్ఞాన సంపన్నుఁడగు ధ్వజదత్తుఁడు స్నేహితుల తోను బంధువులతోను కూడినవాఁడై సుఖానుసారముగా న్యాయముతప్పక సమస్తభోగముల ననుభవించెను.

శ్లో॥ ఇతి బహుతిథకాలం భుక్తభోగో ద్విజేంద్రో
దురిత చరిత దూరం వాయుసూనో పదం తత్
అలభత సులభాత్మా శాంతచిత్త ప్రచారో
భవ నిభవ నిరాసం కర్తుకామ స్సకామః ॥

తా॥ సులభాత్ముఁడును, శాంతమగు మన స్తత్వముకలవాఁడును కోర్కెతో సంసారబంధనమును తొలగించుకొనగోరువాఁడును బ్రాహ్మణో త

త్తముఁడగు ధ్వజదత్తు డిట్లు చాలాకాలముభోగములననుభవించి తుదకు పాపమునకు సుదూరమగు హనుమంతుని సన్నిధికి చేరెను.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే
సువర్చలా హనుమన్మంత్రవివరణే శ్రీసువర్చలా
హనుమ ద్ద్వాదశాక్షర ప్రభావే ధ్వజదత్త
చరిత్రకథనం నామ చతుర్దశ పటలః

—o—

## పంచదశ పటలః

## విజయ చరితం

శ్రీ మైత్రేయః—

శ్లో॥ హనుమన్మంత్రరాజస్య–ద్వాదశాక్షర సంజ్ఞినః
ప్రభావస్తు పరిజ్ఞాతః–త్వ । త్ప్రసాదా న్మహామునే ॥

తా॥ మైత్రేయుఁడు పరాశరునితో ఓ మహామునీ! మీ యనుగ్రహమువలన ద్వాదశాక్షరీమంత్రముగా చెప్పబడు హనుమన్మంత్రములలో శ్రేష్ఠమగుదానియొక్క ప్రభావము తెలిసికొంటిని.

శ్లో॥ అష్టాక్షరీ ప్రభావం తు – శ్రోతు మిచ్ఛామి సంప్రతి
త త్ప్రభావం సమాచక్ష్వ – శ్రోతుకామస్య మే ప్రభో ।
యత్ప్రభావేన లోకోఽయం – ముచ్యతే భవబంధనాత్ ॥

తా॥ ఏ మంత్ర ప్రభావముచే ఈ లోకము సంసారబంధమునుండి ముక్తినందుచున్నదో అట్టి అష్టాక్షరీ మహామంత్ర ప్రభావము నిప్పుడు వినగోరుచున్నాను. ఓ మహానుభావా! ఇట్లు వినగోరు నాకు దాని ప్రభావము సెలవిండు.

శ్లో॥ ఏవం సంబోధిత స్తేన – మైత్రేయేణ మహాత్మనా
పరాశరస్తుతం ప్రాహ వివక్షు ర్మంత్ర వైభవమ్ ।

తా॥ ఆ మహాత్ముతుఁడగు మైత్రేయునిచే నిట్లు అడుగబడిన వాఁడై చెప్ప సుత్సుకతకల పరాశరుఁడు మంత్రవైభవమాతనికి చెప్పెను.

శ్రీ పరాశరః

శ్లో॥ ధన్యోఽసి కృతకృత్యోఽసి – మైత్రేయ ! మునిసత్తమ !
యతస్తే బుద్ధి మారూఢా – మంత్ర విద్యా హనూమతః ॥

తా॥ ఓ మునులలో శ్రేష్ఠమైనవాఁడా ! మైత్రేయా ! శ్రీ హనుమద్దేవుని యొక్క మంత్ర విద్యాభిలాష నీ బుద్ధియందు ప్రవేశించిన కారణమున నీవు ధన్యుఁడవైతివి. కృతార్థుఁడవైతివి.

శ్లో॥ మగ్నోఽహ మధునా బ్రహ్మన్ – పరమానంద సాగరే
స్మారయన్ మంత్రవిద్యాంహి – మాం కృతార్థం కరోషియత్॥

తా॥ ఓ మహామునీ ! నన్ను శ్రీ హనుమన్మంత్ర విద్యను స్మరించుకొనువానినిగా చేసి ధన్యునిగావించితివి. అందుచే నిప్పుడు నేను పరమానందమను సముద్రమున మునిగిన వాఁడనైతిని.

శ్లో॥ తస్మా దష్టాక్షరీ విద్యాం – వర్ణయిష్యే యథామతి
య ద్వర్ణనేన సద్యోఽహం – జన్మ సాఫల్య మాప్నుయామ్ ॥

తా॥ ఏ మంత్రమును గూర్చి వివరించి చెప్పిన వెంటనే జన్మసాఫల్యత నందగలనో అట్టి అష్టాక్షరీ మహావిద్యను నా మనసున నున్నట్లు వర్ణించి చెప్పెదను.

శ్లో॥ ఆదా వష్టాక్షరీమంత్ర – సముద్ధారం వదామి తే
గోపనీయం తు యత్నేన – యోగినా మపి దుర్లభమ్ ॥

తా॥ ముందుగా అష్టాక్షరీ మహా మంత్రోద్ధారము నీకు చెప్పెదను. యోగులకు సైతము దుర్లభమగు నీ మంత్రము ప్రయత్నపూర్వకముగా రహస్యముగా నుంచదగినది.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య – హనూమ ద్భీజ ముచ్చరేత్
ఆంజనేయపరం జ్ఞేయం – నమశ్శబ్దాం సముచ్చరేత్
సోఽయ మష్టాక్షరః ప్రోక్తః – హనూమన్మంత్ర సత్తమః ॥

తా॥ మొట్టమొదట ఓంకారము నుచ్చరించి 'హ్రాం' అనే హనుమద్బీజము పలికి 'ఆంజనేయా య' అను పదమును పరముగా జెప్పి నమః అనుదాని నుచ్చరింపవలెను. అదియే హనుమన్మంత్రములలో శ్రేష్ఠమగు నష్టాక్షరీ మంత్ర మనబడును.

శ్లో॥ తస్యర్షి రీశ్వరః ప్రోక్తః – ఛందోఽనుష్టు ప్తథైవ చ
హనూమాన్ దేవతా ప్రోక్తా బీజ మా మితి కీర్తితః ॥

తా॥ ఆ మంత్రమున కీశ్వరుఁడు ఋషిగా చెప్పబడెను, అను ష్టుప్ ఛందస్సు హనుమాన్ దేవతా 'అం' అనునది బీజముగా చెప్పబడి నది.

శ్లో॥ నమశ్శ క్తి స్తు విజ్ఞేయా–మధ్యే త్యుక్తం తు కీలకమ్
శ్రీ హనూమత్ప్రసాదార్థం–జపేస్తు వినియోజనమ్॥

తా॥ నమశ్శక్తిః అని, మధ్యేతి కీలకం అని శ్రీ హనూమత్ప్రసా దార్థ జపే వినియోగః అని తెలిసికొన నగును.

శ్లో॥ త్రిభిరాద్యస్వరై ర్దీర్ఘై–ర్బిందు క్రాంతై స్తథైవ చ
అంగుష్ఠా ద్యంగుళిన్యాసాన్ త్రీ న్ప్రకుర్వీత మంత్రవిత్

తా॥ మంత్రజ్ఞుడగువాడు మొదటి స్వరములు మూడు దీర్ఘ ములతో బిందువుల జేర్చి 'ఆం–ఈం–ఊం' అని యనుట అంగుష్ఠతర్జనీమధ్య మాంగుళుల మూటితోను న్యాస మొనర్చవలెను,

శ్లో॥ అవశి ష్టాంగుళీన్యాస–మై మౌం కుర్యా త్తతఃపరమ్
విసర్గనీయ మాత్రేణ కరస్య తలపృష్ఠయోః॥

తా॥ మిగిలిన రెండువ్రేళ్ళగు అనామిక, కనిష్ఠికలను 'ఐం, ఔం' లచే న్యాస మొనర్చవలెను. విసర్గచేత కరతరకరపృష్ఠముల న్యాస మొనర్చి

శ్లో॥ న్యాసం కృత్వా తతః కుర్యా–ద్వ్యాహృత్యా బంధనం దిశాణ్
తత స్తు దేవతాం ధ్యాయే–దేవంరూపా మ తంద్రితః॥

తా॥ వ్యాహృతిచేత దిగ్బంధనమొనర్చి జాగరూకుఁడై చెప్పబోవు రూపము కల ధ్యానము చేయవలెను.

ధ్యానం :—

ఆంజనేయ మతిపాటలాననమ్
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూల వాసినమ్
భావయామి పవమాననన్దనమ్॥

తా॥ మిక్కిలి ఎఱ్ఱనగు ముఖముకలవాడును, మేరు పర్వతము వలె మనోజ్ఞ మగు రూపము కలవాడును, పారిజాత వృక్షము యొక్క మూలమున వసించువాఁడును వాయుసుతుఁడును నగు నాంజనేయుని ధ్యానించుచున్నాను,

శ్లో॥ లక్షసంఖ్యా పురశ్చర్యా-దశాంశం తర్పణం భవేత్
హవనం తద్దశాంశం స్యా త్తద్దశాంశం తు భోజనమ్॥

తా॥ లక్షమార్లు పురశ్చర్య చేసి యందు పదవవంతు తర్పణమును, అందు పదయవవంతు హోమము, దానిలో దశాంశము అన్నదానము చేయ వలెను.

శ్లో॥ మధుత్రయేణ హవనం-కుర్యా న్మంత్రవిచక్షణః
గోక్షీరై శ్శర్కరామిశ్రై స్తర్పణం తు సమాచరేత్॥

తా॥ మంత్రశాస్త్రము నెఱిగినవాఁడు మధుత్రయముతో హోమ మొనర్చి చక్కెరతోకూడిన ఆవుపాలతో తర్పణ మాచరింపవలెను,

శ్లో॥ ఏవం శాస్త్రోక్తవిధినా- జప న్నష్టాక్షరీం మనుమ్
అష్టాక్షరీ ప్రభావేన-శుద్ధాంతః కరణో భవేత్॥

తా॥ ఇట్లు శాస్త్రమునందు చెప్పబడిన రీతిగా అష్టాక్షరీ మంత్రమును జపించుచు వా యష్టాక్షరీ మంత్ర ప్రభావమువలన పరిశుద్ధమగు మనస్సు కలవాఁడగును,

శ్లో॥ సిద్ధిం చ సర్వ కార్యస్య - ప్రసిద్ధిం జగతాం త్రయే
అంతే కైవల్యసంప త్తిం - లభతే నాత్ర సంశయః

తా॥ సర్వకార్యసిద్ధిని, ముల్లోకములందు కీర్తిని పొంది అవసానమున మోక్షమునందును. ఇందులో ననుమానము లేదు.

శ్లో॥ అత్రైవోదాహరం తీయ - మితిహాసం పురాతనమ్
సర్వ పాపహరం నృణాం - సర్వ సంపత్తి కారణమ్ ॥

తా॥ ఈ విషయముననే నరులకు గల సర్వ పాపములు పోగొట్టి సర్వ సంపదలు చేకూర్చునట్టి పురాతనమైన జరిగిన గాథను ఉదాహరణగా చెప్పుచున్నారు.

శ్లో॥ యోఽయం శ్రవణ మాత్రేణ - సకృద్వా మునిపుంగవ
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ - త్రీన్ పునాతి న సంశయః ॥

తా॥ ఓ ముని శ్రేష్ఠా! మైత్రేయా ఈ గాథ వినుట వలననే వెంటనే చెప్పువానిని, అడుగువానిని, వినువారిని ముగ్గురిని నిస్సంశయముగా పునీతులను జేయును.

శ్లో॥ ఆసీ త్త్రేతాయుగే భూమౌ - చంద్రకోణం మహాపురమ్
సర్వవస్తు సమృద్ధం త - త్త్రిలోకేషు చ విశ్రుతమ్ ॥

తా॥ భూమియందు త్రేతాయుగమున సర్వవస్తువులు సమృద్ధిగా గల్గి మూడు లోకములందు తెలియబడు చంద్రకోణ మను మహా పట్టణ ముండెను.

శ్లో॥ తత్రా భూ ద్విజయో నామ - క్షత్రియో రిపుమర్దనః
మహాశూరో మహేష్వాసో - యుద్ధకర్మ సముత్సుకః ॥

తా॥ అక్కడ విజయుఁడు అను పేరుగల శత్రువుల నాశ మొనర్చుటలో మేటియగు రాజు కలడు. ప్రశస్తమగు విల్లు కలవాఁడును. యుద్ధ మొనర్చుటయం దుత్సాహము కలవాఁడును.

శ్లో॥ స కదాచి న్మహావీరో - రాజ్య మారోప్య నందనే
చకమే దిగ్జయం కర్తుం - విజయో నృపసత్తమః ॥

తా॥ ఆ మహావీరుఁడు, రాజశ్రేష్ఠుఁడునగు విజయుఁడు ఒకప్పుడు కుమారునిపై రాజ్యభారముంచి దిగ్విజయయాత్ర చేయనెంచెను.

శ్లో॥ తతః ప్రతస్థే నృపతి - ర్విజయో జయకాంక్షయా
మధ్యే మార్గం దదర్శాథ - గర్గం నామ మహామునిమ్

తా॥ పిమ్మట విజయుఁడు జయమును సాధింపవలెనను కోర్కెతో బయలుదేరెను. మార్గ మధ్యమున నాతఁడు గర్గుడను పేరుగల మహామునిని చూచెను.

శ్లో॥ దృష్ట్వా మునిం నృపాధ్యక్షః – తురంగా దవతీర్య సః
దూరే నిహితసైన్యస్సన్ – మునే రంతిక మాయయౌ ॥

తా॥ రాజశ్రేష్ఠుఁడగు నతఁడు గర్గమునిని చూచినవాఁడై గుఱ్ఱము నుండి దిగి, దూరముననే సైన్యము నుంచి ముని సమీపమునకు వెళ్ళెను.

శ్లో॥ తతః కృతానతి ర్భూత్వా – రాజా తస్థౌ కృతాంజలిః
గర్గో దృష్ట్వా మహారాజ – మబ్రవీ న్మునిసత్తమః ॥

తా॥ అటు పిమ్మట రాజు తలవంచినవాఁడై అంజలి ఘటించి నిలచెను. మునిశ్రేష్ఠుఁడగు గర్గుఁడతనిని చూచి ఇట్లు పల్కెను.

శ్లో॥ ఇత ఏహి నృపశ్రేష్ఠ! కుత ఆగమనం తవ?
కచ్చి త్తే స్వాగతం రాజన్! సర్వత్ర కుశలం ను॥

తా॥ రాజశ్రేష్ఠుడా! ఇటురమ్ము. నీ రాక ఎచ్చట నుండి?ఎక్కడ నీకు స్వాగత మేర్పడును? ఓ రాజా! అందఱు కుశలముకదా?

శ్లో॥ కచ్చిత్తే శత్రుసామంతాః– ప్రయచ్ఛంతి బలిం బలాత్
ఇత్యుక్తో విజయ స్తేన–గర్గేణ సుమహాత్మనా
ప్రత్యువాచ మునిం రాజా– విజయో జయతాం వరః॥

తా॥ నీ శత్రుసామంతులు బలాత్కారముగా పన్నును చెల్లించు చున్నారా? అని మహాత్ముఁడగు నాగర్గునిచే నడుగబడినవాఁడై జయశీలురలో శ్రేష్ఠుఁడు, రాజు నగు విజయుఁడు ఇట్లు సమాధానము చెప్పెను.

శ్లో॥ భవతోఽనుగ్రహా ద్బ్రహ్మ న్–సర్వే కుశలినో వయమ్
దిగ్విజిగీషు రహం తాత! చంద్రకోణా ది హాగతః॥

తా॥ ఓ మహామునీ! నీయనుగ్రహముచే మేమందఱము కుశలముగా నున్నాము. ఓ స్వామీ! నేను దిక్కులన్నిటిని జయించు గోరికతో చంద్రకోణ నగరము నుండి యిటకు వచ్చితిని.

శ్లో॥ తవ సందర్శనా దద్య - కృతార్థోఽస్మి మహామునే!
ఇతః పరం తు కర్తవ్య - ముపదిశ్య మ మాధునా
అనుగృహ్ణీష్వ దీనం మాం - త్వా మేవ శరణం మమ॥

తా॥ తమదర్శన భాగ్యముచే ఓ మహామునీ ఈ రోజు ధన్యుడనైతిని. ఇకముందు నాకు తగు కర్తవ్యమిప్పుడుపదేశించి దీనుడనగు నన్ననుగ్రహింపుము. నాకు నీవే శరణము.

శ్లో॥ ఏవం సంప్రార్థితో గర్గో - విజయేన జయార్థినా
ఉపదేష్టుం హితం తస్య చకమే దీనవత్సలః॥

తా॥ జయమునుకోరు విజయునిచే నీరీతిగా ప్రార్థింపబడినవాడై దీనులయందు వాత్సల్యముకల గర్గమహాముని యాతనికి మేలగు విషయము నుపదేశించనెంచెను.

శ్లో॥ హనూమ న్మంత్రరాజం చ - గృహాణ విధివ న్మనుమ్
ఆయాస మంతరేణైవ - విజయస్తే భవిష్యతి

తా॥ ఓ విజయా! నీవు యథాప్రకారముగా హనుమన్మంత్ర శ్రేష్ఠమును గ్రహింపుము ఆయాసములేక చాల తేలికగానే నీకు విజయము లభింపగలదు.

శ్లో॥ ఏవ ముక్త్వా మునీంద్రస్తు - ప్రాదా దష్టాక్షరం మనుమ్
యథాబీజం యథాన్యాసం - మంత్రోద్ధారం ప్రణీతవాన్॥

తా॥ ఇట్లుపల్కి గర్గమహాముని బీజన్యాస మంత్రోద్ధార విధానములతో అష్టాక్షరీమహామంత్రము నుపదేశించెను.

శ్లో॥ ఉపదిష్టం మహామంత్రం-గర్గేణ సుమహాత్మనా
ప్రతిజగ్రాహ రాజేంద్రో-నిగృహీతేంద్రియ స్తదా॥

తా॥ అప్పుడు మహాత్ముఁడగు గర్గుఁడుపదేశించిన మంత్రమును రాజశ్రేష్ఠుఁడగు విజయుఁడు ఇంద్రియనిగ్రహము కలవాఁడై గ్రహించెను.

శ్లో॥ గృహీత్వా మంత్రరాజం తు-జజాప సాష్టోత్తరం శతమ్
గురు దైవత మంత్రేషు-సమ విశ్వాస గౌరవాత్॥

తా॥ ఆతఁడు ఆ మంత్రరాజమును గ్రహించి ఉపదేశించిన గురువు నందు మంత్రదైవతమగు హనుమంతుని యందు మంత్రమందును సమముగా నమ్మకము, గౌరవము నుంచి నూట యెనిమిది పర్యాయములు జపించెను,

శ్లో॥ జప్తమాత్రే మహామంత్రే హనూమా న్మారుతాత్మజః
ఆవిర్బ భూవ త స్యాగ్రే-సుగ్రీవాది సమన్వితః॥

తా॥ ఆ మహామంత్రము నట్లు జపించినంతనే వాయు నందనుఁడగు హనుమంతుఁడు సుగ్రీవుఁడు మున్నగువారితో కూడినవాఁడై ఆ విజయుని యెదుట ప్రత్యక్షమాయెను,

శ్లో॥ త మాగతం హనూమంతం-దృష్ట్వా నృపతినందనః
సాష్టాంగ ప్రణతో భూత్వా-తుష్టావ ప్రయతాంజలిః॥

తా॥ ఆ వచ్చిన హనుమంతుని చూచి రాజకుమారుఁడగు విజయుఁడు సాష్టాంగ నమస్కార మొనర్చి (సాష్టాంగ మన కాళ్ళు రెండు, చేతులు రెండు, భుజాగ్రములు రెండు, రొమ్ము, నొసలు కొందఱు మాట, మనస్సుకూడ కల్పి చెప్పుదురు,) దోసిలొగ్గి స్తుతించెను.

శ్లో॥ చతుర్ముఖ షణ్ముఖో వా-సహస్రవదనోఽపి వా
యథా విస్మయ మాపేదే-ప్రశశంస తథా నృపః॥

తా॥ నాల్గు ముఖములుకల బ్రహ్మయు, ఆరు ముఖములుకల కుమారస్వామియు, వేయిముఖములుకల ఆదిశేషుఁడుకూడ ఆశ్చర్యపడునట్లుగా నొక్క ముఖమున్నను విజయుఁడట్లు స్తోత్రము చేసెను.

శ్లో॥ తస్యస్తవేన సంతుష్టో-వాయుసూను స్తమబ్రవీత్
అనేన స్తోత్రపాఠేన-ప్రీతోఽ స్మి నృపనందనః

తా॥ ఆతని స్తోత్రమునకు సంతోషించినవాఁడై ఆంజనేయుఁ డాతనితో నిట్లనెను. ఓ రాజకుమారా! ఈ స్తోత్రపాఠముచేత తృప్తినందితిని

శ్లో॥ వరం వరయ భద్రం తే-మా కురు ష్వాత్ర సంశయః

తా॥ నీవు శుభప్రదమగు వరమును కోరుకొమ్ము. ఈ విషయమున సందేహింపకుము.

శ్లో॥ ఇత్యుక్తో నృపశార్దూలో-దైవతేన హనూమతా
ప్రత్యువాచ వినీతస్సన్-విజయో వదతాం వరః

తా॥ ఇట్లు దైవమగు హనుమంతునిచే చెప్పబడినవాఁడై ఆ రాజశ్రేష్ఠుఁడు మాటకారి యగు విజయుఁడు వినయముతో నిట్లు బదులు పల్కెను.

శ్లో॥ స్వామి న్నద్య కృతార్థోఽస్మి-తవ సందర్శనా దహమ్
శ్రేయస్సాఽ దివ మత్యర్థం-బ్రహ్మాద్యై రపి దుర్లభమ్॥

తా॥ స్వామీ! నేడు నీ దర్శనముచేతనే ధన్యుఁడనైతిని. బ్రహ్మాదులకు కూడ దుర్లభమగు నిదియే మిక్కిలి శ్రేయస్కరమైనది,

శ్లో॥ కిం తు సద్యో జిగీ షాస్తి-మనసాగ్రమతే ర్మమ
యథా మదీప్సితం సిద్ధ్యే-త్తథా మయి దయాం కురు॥

తా॥ కాని రోకటి పన్ను వంటి బుద్ధిగల నాకు లోకముల జయించు నిచ్ఛకలదు. నా కోరిక తీరునట్లుగా నాయం దనుగ్రహము చూపుము.

శ్లో॥ ఇతి సంప్రార్థితో రాజ్ఞా—హనుమా న్మారుతాత్మజః
ఉవాచ విజయం దేవో—భక్తానుగ్రహ తత్పరః॥

తా॥ ఇట్లు రాజుచేత ప్రార్థింపబడినవాఁడై దేవుఁడు, భక్తుల ననుగ్రహించువాఁడు, వాయునందనుఁడు నగు హనుమంతుఁడు విజయునితో నిట్లనెను.

శ్లో॥ విజయ స్వం యథేచ్ఛంవై – దిశో దశ మహామతే!
కిం త్విదానీం దిశోజేతుం – న యతస్వ నరాధిప!

తా॥ ఓ బుద్ధిమంతుడా! పది దిక్కులందు నీ ఇచ్ఛవచ్చిన రీతిగా విజయము నందుము. కాని రాజా! ఇప్పుడు మాత్రము దిక్కులను జయించుటకు యత్నించకుము.

శ్లో॥ ద్వాపరాఖ్యే యుగే రాజన్ – కార్యం హి మహ దుద్యమమ్
త్వయా వినా మహా బాహో – తత్కార్యం నైవ సిద్ధ్యతి॥

తా॥ ఓ రాజా! ద్వాపరయుగమున నొక గొప్పకార్యము సాధించు ప్రయత్నమున్నది. ఓ బలవంతుఁడా! ఆ పని నీ వలన తప్ప వేఱొక రీతిగా కాదు.

శ్లో॥ అతో మమాజ్ఞయా రాజన్ – ఇంద్రసూనుత్వ మాప్స్యసి
కృష్ణం సారథి మాసాద్య – రణరంగే నరాధిప!
తదా విజయనామ్నైవ – కౌరవాః స్త్వం విజేష్యసి॥

తా॥ అందుచే నా యాజ్ఞ వలన నో రాజా! ఇంద్రునకు కుమారుఁడవౌదువు. నరాధిపా! రణరంగమున కృష్ణుని సారథిగా పొంది విజయ నామముతోనే కౌరవులను జయించగలవు.

శ్లో॥ తతో యథాక్రమం రాజన్ – దిశో దశ విజేష్యసి!
భజేయా విజయా యాంతే – వైజయంతీ జయాంకితా

తా॥ పిదప క్రమముగా దశదిశలను జయించగలవు. విజయము కొఱకు జయాంకితమగు వైజయంతి సేవింపదగినది.

శ్లో॥ బహూ నాత్ర కి ముక్తేన – భవతాహం పరాజితః
కపిధ్వజ ఇతి ఖ్యాతిం – గమిష్యసి న సంశయః ॥

తా॥ పెక్కు మాటలేల ? నీచే నేనే పరాజితుఁడనైతిని. నీవు నిస్సందేహముగా "కపిధ్వజుడు" అను కీర్తినందగలవు.

శ్లో॥ ఇతి విజయ ముదీర్య కార్యసారమ్
పవనసుతస్తు తిరోదధౌ తదానీమ్
నరపతిరపి పట్టణం ప్రపేదే
గురు మభివాద్య గృహీత దైవతాజ్ఞః ॥

తా॥ అని విజయునకు పనియందలి విశేషమును తెల్పి యప్పుడు వాయుకుమారుఁడగు హనుమంతుఁడంతర్ధానము చెందగా విజయుఁడు కూడ తన గురువునకు నమస్కరించి దైవాజ్ఞను శిరసావహించి తన పట్టణమునకు వెడలెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పరాశర మైత్రేయ సంవాదే
పంచముఖ హనుమన్మంత్ర వివరణే విజయచరిత్ర
కథనం నామ పంచదశ పటలః

—o—



# దాతలు

| | రు. |
|---|---|
| 1. శ్రీ కె. ఎస్. శర్మ, M.A., M.Sc., I.A.S., జిల్లా కలెక్టరు. కరీంనగరము | 1,116 |
| 2. శ్రీమతి అండ్ శ్రీ టి. మల్లిఖార్జునరావు, హైదరాబాదు | 300 |
| 3. శ్రీ టి. ఆర్. స్వామి, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, హైదరాబాదు | 50 |
| 4. శ్రీ శంకర్, మూసారాంబాగ్, ,, | 101 |
| 5. శ్రీ కన్నయ్యలాల్, కార్వార్, ,, | 101 |
| 6. శ్రీ నిమ్మగడ్డ పాండురంగ విఠల్ శర్మ ,, | 11 |
| 7. శ్రీ ఎన్. వెంకటసుబ్బారావు, ,, | 11 |
| 8. శ్రీ ఎన్. మధుసూదనశర్మ, ,, | 11 |
| 9. శ్రీ పి. పి. కుటుంబరా[illegible], ,, | 10 |
| 10. శ్రీ బి [illegible] కె. శర్మ, ,, | 10 |
| 11. శ్రీ [illegible] & శ్రీ కనపర్తి సీతారామయ్య, కరీంనగరము | 15 |
| 12. శ్రీ పొందూ[illegible]రసింహారావు, ఒంగోలు | 15 |
| 13. శ్రీ గొల్లపూడి కామేశ్వరశర్మ, ఒంగోలు | 10 |